తప్పక చూడండి!

ప్రప్రథమంగా ఆంధ్ర చలన చిత్ర రంగంలో త్రి పాత్రాభినయం.

విశాలాంధ్ర ప్రజానీకాన్ని విచిత్రాలతో కవ్వించి వినోదాలతో నవ్వించే





శ్రీదేవి పిక్చర్స్

వారి

# దొంగలు దొరలు

[తెలుగు]

దర్శకత్వం

B.R. పంతులు





పూర్ణా రిలీజ్

NAVARANG

# భారీయెత్తున దేశరక్షణకు
# ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

# ఉత్తరాలు

## ముఖచిత్రం

కొంత మంది పాఠకులు "మీరు వేస్తున్న సినిమాతారల ముఖచిత్రాలు మాకు విసుగును కల్గింప జేస్తున్నాయి. మన నాయకుల ఫోటోలను వేయరాదా ?" అని ఉత్తరాల శీర్షికలో వ్రాస్తూండటం గమనించిన తర్వాత ఒక విషయం అదే ఉత్తరాల శీర్షికకు వ్రాయాలనిపించి వ్రాస్తున్నాను. మా వూరి (మన) పత్రిక ఏజంటు నాతో మాట్లాడుతూ ఆ మధ్య ఇందిరాగాంధి ముఖచిత్రమున్న వీక్లీలు తెప్పించిన వాటిలో సగం ఖర్చుకాలేదని, స్వతంత్ర దినోత్సవ సంచిక ఎన్నదగిన 14–8–64 వీక్లీ నెహ్రూ ముఖచిత్రం వేసినవి ఒకింటు మూడుపాళ్లు అమ్ముడు పోలేదని, అంచేత సినిమా తారల ముఖ చిత్రాలుంటేనే సేల్సు అధికంగా ఉంటుందని నాతో మాటల మధ్య వెల్లడించడం జరిగింది.

రాచపల్లి నాగరాజ్ (ఒక వూరు)

*  *  *

ముఖచిత్రము అందము చిందే అప్సరస వలె నున్న బి. సరోజాదేవి చిత్రం చూడ ముచ్చటగా నున్నది. ఇప్పటికి నేను చూచే ముఖ చిత్రములలో క్రిందటి వారం 'నెహ్రూ' ముఖ చిత్రం, ఇప్పుడు సరోజాదేవి చూడ ఆకర్షణీయంగా ఉన్నాయి. ఆ కన్నులలోంచి వచ్చే అందముగల బి. సరోజాదేవి లాంటి ముఖచిత్రములు వెయ్యమని కోరిక.

కామోజీరావు (విజయనగరము)

## కథలు

కె. సూర్యనారాయణమూర్తి, రామచంద్రరావు గారలు వ్రాసిన "ప్రేమలేఖ" కథ చదివి చాలా ఆనందించాను. ముగింపు చాల చక్కగా నూతన విధంగా ఉంది. ఇటువంటి ముగింపు, కథా గమనంలో ఉత్కంఠ గల కథలు ఈ మధ్య రావడం లేదు. రచయితలకు నా ధన్యవాదములు అందజేయండి.

మణి (తొప్పిపూడి)

*  *  *

"ప్రేమలేఖ" అనే కథ బాగుంది. కథ చివర పాఠకులు వూహించని విధముగా చిత్రించి అందరినీ ఆశ్చర్య, సంతోషములలో ముంచి వేశారు.

ఎ. సత్యవతి (యడ్లపల్లి)

*  *  *

'ప్రేమలేఖ' అను కథ చదివాను. కాని 34వ పేజీలో విశ్వం వ్రాసిన ప్రేమలేఖను చూచి, అతనిని నిందిస్తున్న కరుణ యొక్క తండ్రి విశ్వాన్ని "కృతజ్ఞుడు" అని అన్నాడని ఉన్నది. తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టేవాడు 'కృతఘ్నుడు' అవతాడు. కాని ఎప్పటికీ కృతఘ్నుడు కాదు. ఇది రచయిత గారి పొరపాటా, లేక అచ్చు పొరపాటా తెలియదు.

## సీరియల్ కథలు

మీ పత్రికలో ధారా వాహికంగా ప్రచురింప బడుతున్న ప్రఖ్యాత రచయిత్రి 'ముప్పాళ రంగనాయకమ్మ' గారి నవల కూలిన గోడలు చదువుతున్న వేలాది పఠితల్లో నే నొకణ్ణి. ఒక్క ఆంధ్రపత్రికలోని కాక మరితరత్రా గూడా రంగనాయకమ్మ గారి కథలను, నవలలను నే నెన్నో చదివాను. సాధారణంగా వాటిల్లో నేను గమనించిన ముఖ్య విషయం— నాకు కథావస్తువును సాధ్యమైనంత వరకు ప్రకృతికి సన్నిహితమై యుండే విధంగా ఎన్నుకుంటారు.

కానీ 'కూలిన గోడలు' నవలలోని మధుపాత్ర చాలా అసహజంగాను, మెచ్చదగినది కానిది గాను (నాకు మాత్రం) ఉన్నట్లుగా అభిప్రాయ పడుతున్నాను. దానికి నాకీ క్రింది కారణాలు ఆధారం.

ఒక వేళ చిన్నతనంలో అల్లరిగా పెంకి ఘటమై యుండవచ్చు ఎవరైనా. కానీ పెరిగి, విద్యాబుద్ధులు గడించిన పిదప కూడా పెద్దవాళ్ళకు (వారెటువంటి వారైనా కావచ్చు) ఎదురు సమాధానాలు చెప్పటం, పూచిక పుల్లంత గౌరవం కూడా లేకుండా స్వంత పెద్ద నాన్నగారి ఎదుట సిగరెట్లు త్రాగటం, (పైగా తనను మంచివాడుగా భావించుకుంటూ లేక సమర్థించుకుంటున్న మధూ) ఆయను చూచినా కూడా లెక్క చేయకుండటం! 'నవలలో ఆతనిది హీరో పాత్రా? లేక హీరో విలన్‌ల ద్విపాత్రలను వహిస్తున్నాడా అన్నది నా ముఖ్య సంశయం. నదివిస్తే ఉన్నమతి పోయిందన్న సామెత మధు విషయంలో రుజువైంది. రంగనాయకమ్మ గారి ఉద్దేశం రక్త సంబంధమున్న బంధువులే చేసే పెద్ద అన్యాయాలను అన్నివిధాలుగా ఎదుర్కొ గల నాగరిక యువకునిగా మధూను చిత్రించటం అయ్యుండవచ్చు కానీ, తన ప్రవర్తన మూలంగా మధు అంతటి సత్కార్యాలకు అనర్హుడని అనిపిస్తుంది.

ఏమైనా మిగిలిన పాత్రలు చక్కగా సృష్టించబడ్డాయి. ఎక్కడ విసుగు కలిగించకుండా సరళంగా నడుస్తున్నదీ నవల— ఇటువంటి నవలను పత్రిక ద్వారా మా కందిస్తున్న మీకు ధన్యవాదాలు. హారంలోని పూసలన్నిటికి కంఠాన్ని అలంకరించే శక్తి ఉన్నా హృదయాన్ని తాకగల స్థానంలో ఉండే అర్హత ఉండనట్లు ఈ నవల మిగిలిన నవలల మాదిరి సూటిగా హృదయాన్ని తాక లేక పోతూంది.

యం. బి. యఫ్. లాయడ్ (కటక్)

## వ్యాసాలు

మీ పత్రికలో ఎప్పుడు చూసినా 'స్థలాభావం' అని కనపడుతుంటుంది. మీరు అనవసర శీర్షికలు గూడా కొన్ని వేస్తున్నారు. వాటిలో 'వార ఫలాలు' ఒకటి. తమ, నుదుటి రేఖల్లో చేతిరేఖల్లో జీవిత సమస్యలు, ఇమిడి ఉన్నాయను కోవటం పొరపాటు. అలాగే వారఫలాలు గూడా ! కాబట్టి ఈ శీర్షికను నిలిపివేస్తే 'స్థలాభావం' అన్న అస్త్రాన్ని ఉపయోగించ నవసరం ఉండదు.

అమెరికా అధ్యక్షుడు శ్రీ 'జాన్సన్' గురించి వ్యాసం బాగుంది. 'ఉ. వియత్నాం'పై యుద్ధాన్ని ప్రారంభించినా అమెరికా ఎన్నికలలో ఆయన ఓడిపోవాలని ఎవ్వరూ అనుకోవడం లేదు. అందుకు ఈయన అదృష్టవంతుడే.

జి. ప్రమీళాదేవి (ఎడ్లపల్లి)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 11—9—'64
క్రోధినామ సం॥ భాద్రపద మాస శు॥ పంచమి
సంపుటము 57 సంచిక : 2
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1




"మన 'నల్లధనం' తోటలోనే దాచుకొందాం 'బాత్‌రూం'లోకంటే యీ చోటే మంచిది."

## మనలో మాట

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరికీ మా 'వినాయక చవితి శుభాకాంక్షలు!'

*    *    *

ప్రత్యేక హాస్య సంచికగా వెలువరించటానికి రచయితల సహకారాన్ని అర్థించాము. కృతార్థులమయ్యామనే చెప్పాలి; 'వినాయకచవితి హాస్యసంచికకు' అని వ్రాసి ఉన్న వ్రాత ప్రతులు కోకొల్లలుగా వచ్చి మా కార్యాలయం చేరాయి. రచయితలందరికీ కృతజ్ఞులము. అయితే ఈ సంచికలోనే ఎన్నుకొన్న రచన లన్నిటినీ వెయ్యటం సాధ్యపడదు. కొన్నిటిని పై సంచికలలో ప్రచురిస్తాము....

*    *    *

'కార్యసిద్ధి' ఈవారంతో అయిపోతుంది. శ్రీ ముద్దా చిట్టిబాబుగారికి ఆధారాలుగా ఉన్న కొన్ని పుస్తకాల జాబితా చివర వేశాము కాని 4, 16 అంకెల ఎదురుగా పడవలసిన పేర్లు పడలేదు! దాని కారణాలు వివరించేబదులు ఇక్కడ ఆ రెండు గ్రంథాల పేర్లూ ఇస్తున్నాము: 4. The Madras Manual of Administration. 16. Ganapati– Sri Haridas Misra.

*    *    *

'అర్జున విషాదయోగం' బొమ్మలు కూడా రచయితే వేశారు....

*    *    *

'రాజశ్రీ'ని గురించి శ్రీ ధర్మారావు వ్రాసిన వ్యాసంతో వాడిన చిత్రాలు శ్రీ ప్రభాకర్ తీసినవే....

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : శ్రీ గణపతి

## మీ కృషియే దేశానికి సౌభాగ్యం
## మీ పొదుపే రక్షణనిధికి మదుపు




తిమ్మారెడ్డికి
ప్రదేశ్ కాంగ్రెసు
అధ్యక్ష పదవి
ప్రదేశ్ కాంగ్రెస్


మీ తుపాకీకి లైసెన్సు లేదనే నా భయం
అవినీతి
సదాచార్ సమితి
అతుల్య ఘోష్


కేంద్ర మంత్రి వర్గం
ఖాళీ లేవేమైనా ఉన్నాయా సార్!


శాస్త్రిని కలవటానికి అంత తొందరెందుకు?
భుట్టో
ఇండో పాక్ చర్చలకు
OOMMEN



# పడవ ప్రయాణం సుఖమేకాని.....

సాయంత్రం అయిదింటికల్లా బయలుదేరుతుందనుకున్న రహదారి పడవ ఏడయినా రేవు ఒదల్లేదు. పడవకి ముందునైవున్న రెండు కంపార్టుమెంటుల్లాంటివాటిని సీతాపతి పెళ్ళి పార్టీకి కేటాయించి ఇచ్చాడు పడవ ఆసామి. పిల్లా పెద్దా అంతా కలసి ఓ పాతికమంది ఆ రెండు కంపార్టుమెంటుల్లోనూ ఎలాగో కిక్కిరిసి కూర్చున్నారు. పడవ వెనుక భాగంలో ఏవో బస్తాలు వేస్తున్నారు. పడవవాళ్ళు గట్టుమీద బీడీలు వెలిగించి వేళాకోళాలు ఆడుకుంటున్నారు. పడవ మాత్రం బయలుదేరలేదు పెద్ద జంక్షనులో ఆగిన రైలుబండిలాగ. పాపం, ఆడవాళ్ళు బనారసు చీరలు, రవ్వలు, బంగారములాంటి ముఖ్య విషయాలు కబుర్లాడుకుంటూ పడవ ఇంకా రాజమండ్రీ రేవులోనే ఉందనే విషయమే మరచిపోయారు. ఇంక మగవాళ్ళలానూ ఓపికా,

**ఎం. ఎస్. ప్రకాశరావు**

వల్లకాడూలేని వాళ్ళాయె. కూర్చుని కూర్చుని కాళ్ళు కుదుములు కట్టిపోయి, కాస్త కాళ్ళు ఝాడించుగోవచ్చుని, క్రిందికి దిగబోయారు. "బాబ్బాబు, దిగకండి. ఇదుగో పడవ తోసేస్తున్నాము" అంటూ వచ్చాడు పడవ అతను. బహుశా పడవ క్రూ కి అతనే కేప్టెన్ కాబోసు. "ఒరేయ్ వెంకన్నా! బల్లచెక్కతీసేయరా, ఓరి, నాగులూ! గడ తీయరా!" అని గట్టుమీద హడావిడిగా పరిగెత్తాడు, ఇటూ అటూ. ఓ పదేళ్ళ కుర్రాడు వచ్చి

పడవమీదనుంచి ఒడ్డుకి ఎక్కడానికి వేసిన బల్ల చెక్క కాస్త లోపలికి లాగేశాడు.

"నీడి తోసెయ్యడానికి నిప్పంటించా. రెండు గంటలనుంచి ఒకేమాట చెబుతున్నాడు గాడిపడిన రికార్డులా. పీడ్ని తీసికెళ్ళి నడి గోదార్లో ముంచెయ్యా" అని ఒకటే విసుక్కున్నాడు, వీరేశలింగం స్కూల్లో భమిడిపాటివారి శిష్యరికంచేసిన సుబ్బారావు. వెంకయ్యనే కుర్రాడు బల్లచెక్కనయితే తీసేసాడు కాని పడవమాత్రం బయలుదేరలేదు.

"అయినా, తెలియకడుగుతా బావగారూ, నిక్షేపంలాగ ఉలోతి స్టీమరుమీద బొబ్బర్లంక జేరితే అక్కడనుంచి బస్సుమీద అమలాపురం జేరచ్చు కదా, ఈపడవ ప్రయాణ మేర్పాటుచేశారేం ఖర్మం?" అన్నారు పెళ్ళికొచ్చిన వాళ్ళల్లో కొంచెం వయస్సు మళ్ళిన రామయ్యగారు.

"ఆఁ నా ముఖం! అసలు గోదావరిపైన ప్రయాణమంటే పడవమీద చేస్తేనే బాగుంటుంది. దీని ఆనందం దేనికీరాదు." అన్నారు సీతాపతి తండ్రి శివరావుగారు. అసలింత మందికి ఉభయ ఖర్చులు పెట్టుకుని రాజమండ్రీనుంచి తరలి వెళ్ళడమే ఆయనకి మంటగా ఉంది. పైగా సీతాపతిగాడు కాని కట్నంకూడా తీసికోనివ్వాడుకాడు.

"ఏమయ్యోయ్, పడవాయనా ! బయల్దేరుతావా, లేకపోతే నన్నే వేసేయమన్నావా గెడ ?" పంచ ఎగగట్టి డెక్‌మీదకి వచ్చి దబాయించాడు, రామారావు. వెనక ఆర్ట్సు కాలేజీలో చదివే రోజులలో పడవ నడపడంలో సిద్ధహస్తుడతను.

"ఏంటండీ, వూరికే దబాయిస్తారు. అన్న టయానికి ఇమానాలే బయల్దేరడంలేదూ, మా పడవ వాళ్ళమీద ఇరుచుకుపడుతున్నారు ?"

ఈ న్యూస్ పేపర్లు కాదుఃగాని, వీళ్ళందరూ పాడయిపోతున్నారని చాలా విసుక్కున్నాడు రామారావు లోలోపల. వీళ్ళ విసుగులు, తిట్లూ, శాపనార్థాలూ మధ్య, ఎనిమిది గంటలకి, నెమ్మదిగా పడవ రేవుని వదిలింది. 'హమ్మయ్యా' అని నిట్టూర్చారు. అంతాను. పడవ నడి గోదావరిలోకి వచ్చాక, మగవాళ్ళందర్నీ పైన టాపుమీద కూర్చోనిచ్చాడు పడవ ఆసామి. 'బ్రతుకు జీవుడా' అని అంతా పైకి ఎగబ్రాకారు. సీతాపతిని మాత్రం పైకెక్కనీయలేదు వాళ్ళమ్మ పార్వతమ్మ, దిష్టి తగులుతుందని.

పైన గుడ్డి వెన్నెలగా ఉంది. పడవ నెమ్మదిగా వాయువేగంతో వెడుతోంది. క్రింద గోదావరిలో చిన్ని చిన్ని కెరటాలు గలగలా చప్పుడు చేస్తున్నాయి. చుట్టూ మంచివాడి మనసులా నిండయిన గోదావరిపైన పసిపిల్లల ఆలోచనల్లాగ నిర్మలమైన ఆకాశం, అంత గుడ్డి వెన్నెల్లోకూడా వీళ్ళందరినీ టోపీవేసి బోల్తా కొట్టించాయి. పట్టి బాతాఖానీ రాయుళ్ళయిన వీళ్ళందరూ మాట్లాడకుండా అయిదు నిమిషాలు అలా ఉండిపోయారు.

"గలగలా కదిలింది గోదావరి
కిలకిలా నవ్వింది గోదావరి
ననసనా.................."

ఇంక కవిత్వం ముందుకి నడవక 'ననననానోడ్' లోకి దిగాడు విశ్వనాథం, సీతాపతి ఫ్రెండ్.

"జలగలా నడిచింది గోదావరి" అని అందించాడు రామారావు.

"ఛస్ ! యతిప్రాస తప్పితే కవిత్వానికి భావం వల్లకాదూ ఒద్దేమిటోయ్, మీ ముఖాలిద్దా" అని విసుక్కున్నాడు సుబ్బారావు, వీళ్ళ కవిత్వపు ధోరణిలో పడితే ఆపడం కష్టమని.

"ఇందాకా ఎవరి చేతిలోనో చూశాను పేక ముక్కల్ని. బైటకి తియ్యండ్రా. కాసేపు జేస్తు వేద్దాము" అని హుషారు చేశాడు. వృద్ధులయినా కూడా రామయ్యగారు. దాంతో అంతా ఒకచోట జేరారు జేబుల్లోంచి చిల్లర లెక్కపెట్టుకుంటూ.

"బాగా వెలుతురున్నప్పుడే జోకీనిచూసి రాజను కుని వేసేస్తాడే ఈ విశ్వనాథం, ఇంక ఈ గుడ్డి వెన్నెల్లో మనపని కుదేలే" అని గొడవచేశాడు రామారావు. దాంతో గృహస్థు, శివరావుగారు, కిందకో కేకవేశాడు.

'ఒరేయ్, బుల్లోడా, అమ్మనడిగి లాంతరు పైకి పంపించరా" అని, కిందనుంచి బుల్లాడు లాంతరందిస్తూ ఉంటే, ఓ చంటి వెధవ పైకి వస్తానంటూ మారాంచేశాడు.

"వెధవా, నోరు మూసుకుని కూర్చో. లేకపోతే గొంతుక పిసికి గోదార్లో పారేస్తాను." అని విసుక్కున్నాడాయన.

"శుభమా అంటూ పెళ్ళికి వెడుతూవుంటే ఏమిటీ అఘాయిత్యం మాటలూ" పిల్లవాడిని లోపలి తీసిగుంటూ బుగ్గలు నొక్కుకుంది పార్వతమ్మగారు. తరువాత, ఆవిడ ఈ పేకాటాడే వాళ్ళందరిమీద లెక్చరు, ఆ చంటి వెధవ ఏడుపుతో పైకి వినబడలేదు. లేకపోతే అక్కడి పేకాట ప్రియులతోన

అమాంతంగా గోదావరిలోకి ఉరక్కపోయినా, అర్ధమం తలకాయ తీసి పెట్టలో పెట్టుకునేవారు. లాంతరు పైకి వచ్చేదాకా వూరుకుని అప్పుడు వచ్చాడు. రాక్షసుడిలాగ చుక్కాని, "ఏమయ్యోయ్ పెద్దమనుసులూ, లాంతలార్పేసేయండమ్మా. దారి కనబడకపోతే పడవ కాస్త ఇసక దిబ్బ ఎక్కేయుగలదు" అని భయపెట్టేశాడు. అయితే విశాఖపట్నంనుంచి వచ్చిన లెక్చరరు వెంకటేశ్వర్లు ఒదిలిపెట్టలేదు.

"గోదార్లో దారేమిటోయ్, మరీ చెబుతావు" నీ తెలివితేటలు మా దగ్గిరా అన్నట్లు దబాయించాడు.

"మరేమనుకున్నారండీ, లాంతరు పెట్టుకుంటే దాని వెలుతురు నీటిమీద పడుతుంది. దాంతో దారి నోస్" అంటే దారి కనిపించదు అని వాడి ఇంగ్లీషులో చెప్పాడు, నాకూ వచ్చు ఇంగిలీసు అన్నట్టు మొసంచువ్వి. వాడి ఇంగ్లీషుగో నుండి వెంకటేశ్వర్లు తేరుకునే లోపల్నే ఇంకో విషయంకూడా చెప్పాడు వాడు, "పడవ నడపడమంటే పట్టాలమీద పరుగెట్టే రైలు నడపడమనుకున్నారా? లేకపోతే యిమానం నడపడమనుకున్నారా? ఇదేమీ అల్లాటప్పయ్య యవారం కాదయ్యోయ్" అన్నాడు. వాడి దృష్టిలో వాడుచేసే పనే ప్రపంచంలోకల్లా అతి కష్టమయిన పని. వాడి వాదన ధాటికి వెంకటేశ్వర్లు గాలిపోయిన సైకిలు ట్యూబుల్లాగ అయిపోయాడు.

"మరింకేం చేస్తాం ఆర్పేయండి లాంతరు. లేకపోతే, దారితప్పి, ధవళేశ్వరం చేరకుండా, బొబ్బర్లంక బదులు" అని లాంతరు ఆర్పేశాడు విశ్వనాథం.

"అలా జరిగిందంటే, ... ... మహానాస్త్రం

## ఓ బొజ్జ గణపయ్యా

ఓ బొజ్జ గణపయ్యా - నీ బంట్లు మేమయ్యా
ప్రశ్నపత్రం మాకు - పంపవయ్యా
హోయ్ - ప్రశ్నపత్రం మాకు పంపావయ్యా...!!
మార్కు లెన్నోవచ్చి - మేలుగా పాసైతే
కోర్కెమీరా నిన్ను - కొలచేమయ్యా
మేళాలు తాళాలు మారుమ్రోగేటట్లు
ఉత్సవా లెన్నెన్నొ - చేసేమయ్యా...
పోయినసారీ మరీ - పదమూడెవచ్చాయి
ఈ సారిఐనాను - ఇరవయ్యొస్తే
కొబ్బరీకాయలు - కొడతామయ్యా - నీకు
పెద్దపెట్టున పూజ పెడతామయ్యా..
ముప్పైమై దొస్తేను - మూడుకొడతామయ్య
నలభైమై దొస్తేను - నాలూగయ్యా
ఏభైమై దొస్తేను - యేడుకొడుతావయ్యా
ఫస్టు మార్కొస్తేను - పదహారయ్యా
పదహారయ్యా - పదహారయ్యా
కొబ్బరి కాయాలు పదహారయ్యా...

—దయానిధి ★

# పడవ ప్రయాణం

కాస్తే జారిపోతుంది. ఇంక మిగిలేది సీతాపతి గతి ఆ సీతాపతే. శ్రీమద్రమారమణ గోవిందం గోవింద'' అన్నాడు సుబ్బారావు.

''బాగా చెప్పావు. అయినా అపర భీష్మాచార్యుడి ననుకునే ఈ సీతాపతిగాడు పెళ్లిచేసుకోవడమే మహాశ్చర్యం. పైగా ముదురు బెండకాయ లక్షణాలు, లక్షణంగా వాడి ముఖంలో కొట్టొచ్చినట్టు కనబడేవి. అటువంటి మొండిఘటాన్నికూడా తల్లక్రిందులు చేసేసిన ఆ అమ్మాయి ఎవరో నెరజాణనే చెప్పాలి''

''ఆఁ పోదురూ ! ఈ పెళ్లికూతుర్ని చూసి వెరగ మేమిటి? పొట్టిగా, లావుగా ఉంటుంది. వీడేమిటి చూచి వలచాడోకాని. అందుకనే తాను వలచినది రంభ అని అనవే అన్నారు''

''ఛ ! ఛ ! ఏమిటి సుబ్బారావు ఆ మాటలు? ఎంతమాట పడితే అంతమాట అనీయడమే. ఆ అమ్మాయి బలంగావుంటే నీకేం, ఇంకోలాగ ఉంటే నీకేం? తాను ప్రేమించాడు, తానే చేసుగుంటు న్నాడు. ఇంకోళ్లని చేసుకోమనలేదుకదా? నీ కెందుకు బాధ?'' అని మందలించాడు వెంకటేశ్వర్లు.

''ఏమిటో శిద్దురూ, అంతా ఘటన'' అని సద్దిచెప్పారు పెళ్లి పెద్ద శివరావు.

వీళ్ల మాటలు వింటూ, కునికిపాట్లు పడుతున్న రామయ్యగారికి ఛటుక్కున ఏదో గుర్తుకి వచ్చింది.

''ఆఁ మీరంతా ఎన్ని చెప్పండి. ఇది, ఈ కుర్రకారు అనుకుంటున్నట్లు ప్రేమాకాదు, బావగారు చెప్పినట్లు ఘటనా కాదు. ఈ రెండూ కూడా అర్థంలేనివే.'' అని ఖండించి పారేశారాయన.

''ఏముంది, ఒక్కొక్కరున్న పరిస్థితిమీద ఆధారపడి ఉంటుందంతే. అటువంటి పరిస్థితి ఏర్పడిందంటే, భీష్మాచార్యుడైనా తలవంచి, ఎదురుగుండా కోతివున్నా పెళ్లిచేసేసుగుంటాడు. నా శ్రీనివాసుడి విషయంలో అలానేగా అయింది''.

ఆయన శ్రీనివాసుడి పేరెత్తేసరికి, 'చచ్చాం, బాబోయ్' అనుకున్నారు అంతాను. ప్రపంచంలో ఎక్కడ ఏ సంఘటన జరిగినా అటువంటి సంగతే ఈ శ్రీనివాసుడి విషయంలో పెద్ద కథ చెప్పి సిగించేస్తాడాయన. ఈయన్నెలా ఆపాలా అని పడిమికారు వాళ్లు ఆలోచిస్తూవుంటే, ''ఏ శ్రీనివాసండీ?'' అని ఓ చవట ప్రశ్న వేశాడు విశ్వనాథం, ''అతను కోతినెందుకు పెళ్లాడేడు?'' అని వివరాలుకూడా అడిగాడు.

''నీ నాలుకని, ఆకురాయితో అరగతీసెయ్యా, ఏ ప్రోత్సాహం లేకుండానే ఆయన రామాయణం మొదలు పెడతాడే, మధ్యలో నీచవట ప్రశ్నలేమిటోయ్'' అని చాటుగా విసుక్కున్నాడు సుబ్బారావు.

రామయ్యగారికి మాత్రం, విశ్వనాథాన్ని చూస్తే చాలా ఆనందమయింది. వృద్ధిలో కొస్తాడను కున్నారు.

''శ్రీనివాసరావు తెలియదూ. మా వేలు విడిచిన పట్నం శేషమ్మ దత్తుడు.''

ఈ శ్రీనివాసరావాయన కథా వాయకుడు. ఎక్కడో పట్నంలో ఏదో ఉద్యోగం చేస్తున్నాడుట అతడు చేసే ఘనకార్యాలు ఉడ్ హవుస్ పుస్తకాలు చదువుతూ కూర్చోడం, డిటెక్టివ్ కథలు వ్రాసేయడమూను. ఇప్పుడతని కథ ఏదో చెప్పి విసిగించేస్తాడీయన ఎలాగూనని మాట మరిపించేయా అని చూశాడు రామారావు.

''ఏమండీ, సెనేటర్ గోల్డువాటరు అమెరికా అధ్యక్షుడయితే, కొంపతీసి మూడవ ప్రపంచ యుద్ధం వచ్చేస్తుందంటారా ?'' అన్నాడు. కాని రామయ్యగారి సంగతి రామారావుకి తెలియదు. ఆయన శ్రీనివాసోపాఖ్యానపు మూడ్‌లో పడ్డాడంటే, పది మంది గోల్డువాటరులు వచ్చినా, ఆయన ఉత్సాహమ్మీద కోల్డువాటరులు పోయలేరు.

''మా శేషమ్మ, వాడి పెళ్లిగురించి ఎంత ఇద యేదో మీ కందరికి తెలిసే ఉండాలి'' అంటూ ప్రారంభించాడాయన.

ఆయన్ని కూడా వెంట బెట్టుకుని పెళ్లికి బయలు దేరినందుకు సీతాపతి తండ్రి శివరావుకి లోపల్లోపల శాపాలు ఇచ్చుగుంటూ నడుముల్లు వాల్చారు నడివయస్కులు. బాగుండదని, వస్తూన్న ఆవలింతల్ని అపుగుంటూ వూకొట్టారు గృహసవ శివరావు—

పట్నంలో హాయిగా ఉన్న శ్రీనివాసరావుకి రోజులన్నీ ఓ మాదిరిగా జరగలేదు. 'శలవు పెట్టి రారో

అని వాళ్ల పిన్ని శేషమ్మగారు ఎన్ని ఉత్తరాలు వ్రాసినా వెళ్లేవాడు కాదు. వెడితే వచ్చే ప్రమాద మతనికి తెలుసు. తాను ఎదురుకుండా ఉంటే మెడ వంచి పెళ్లి చేసేస్తుందావిడ, ఆవిడ మాటకి వ్యతిరేకంగా చేయలేడు అతను. ఆ మాట కొస్తే మీసాలు మెలేసి నిమ్మకాయలు నిలబెట్టిన మేటి మనుష్యులు కూడా ఇంకోలాగ చేయలేరని అతని గట్టి నమ్మకం.

రానురాను శ్రీనివాసుకి రోజులు మొదటిలో లాగ గడవడం లేదు. కారణం ఎందుచేతనో ఉడ్ హౌస్ వినోదం కలిగించలేక పోయాడు. పైగా డిటెక్టివ్ కథలు వ్రాయలేక పోయాడు. వాటిని వ్రాయడం పూర్తిగా విరమించుకున్నాడు కూడాను. ఘోర హత్యలు, దారుణ క్రియలు వ్రాసి, వాటిని అతి భయంకరంగా వర్ణిస్తూ అందరినీ హడల గొట్టిన అతనికి హత్యలన్నా, హింసాకాండలన్నా ఏవగింపు, భయమూ కలిగించే సంఘటన ఒకటి జరిగింది. అతని ఆఫీసులోనే పని చేస్తూన్న సత్యమనే అబ్బాయి రైలు క్రింద పడ్డాడు. ఆ క్రితం రోజు వరకూ నిండు విగ్రహంలా ఉన్న వ్యక్తి రక్తమాంసాల మధ్య గుర్తించడానికి వీలులేకుండా పడి ఉండగా చూసి అతనికి కడుపులో దేవినట్లయి పోయింది. కథల్లో అయితే చాలా భయంకరంగా వర్ణించి వ్రాసేవాడే కాని, యదార్థంగా చూసే సరికి అతనా విషయాల్ని వ్రాయలేక పోయాడు, డిటెక్టివ్ కథల్ని చదవలేక పోయాడు. రాత్రి నిద్దర్లో కూడా ఆ ఆలోచనలే వచ్చేవి. ఒక్కొక్కప్పుడు డిటెక్టివ్ సతీష చంద్రుడు (అతని కథలో పత్తేదారన్న మాట) తానే అయినట్లు, హంతకులు తన నెత్తిమీదే బడితెలతో బాదుతూ ఉన్నట్లు కలలు వచ్చేవి. ఆ విధంగా రచయితగా అతని జీవితం అంతమయింది.

అతని అవస్థలు మాత్రమంతటితో అంత మవలేదు. ఉన్నట్టుండి అతనికి పట్నం నుంచి బదిలీ అయిపోయింది. కొత్త వూర్లో, ఓ మాదిరి మంచి హొటలులో గది తీసుకున్నాడు. అతని జీవితంలో హొటల్లో ఉండడమదే మొదటిసారి. అక్కడ ఉదయం అయిదయేసరికల్లా హడావిడి ప్రారంభమయి రాత్రి ఒంటి గంటదాకా ఉండేది. "అరవై మూడో నంబరు, రెండు ఇడ్లీ వడా సాంబార్" అని పైనించే అరుస్తాడు హొటల్ బోయ్, తెలవారగట్ల అయిదింటికల్లా, ఫలహారం తినగలగడం అటుంచి అంత తొందరగా లేవగలిగిన రాక్షసు లెవరా అని ఆశ్చర్యపోయే వాడతను. ఉదయం ఎనిమిది గంటలకి అలారం పెట్టుగుని లేచే అలవాటు తనిది. గదిబైట జరిగే ఈ అల్లరితో అతనికి మహా చికాకుగా ఉండేది. ఓ వారం రోజులు ఓపిక పట్టి చూశాడు. ఇంక లాభం లేదని ఇంటికోసమన్వేషణ ప్రారంభించాడు.

ఇల్లు దొరకడం కూడా అంత సామాన్యమయిన పనిగా కనపడలేదతనికి. వెళ్ళిన చోటల్లా ఇతని కులమూ, గోత్రమూ, ఆచారాలూ, వ్యవహారాలూ, పెళ్ళాం బిడ్డల వివరాలు అన్నీ అడిగేవారు. ఇలా శతభిషలు చేసే వాళ్లంటే అతనికి మంట. అంచేత కొన్నిళ్లు అలా వదిలేశాడు. ఇతని వ్యవహారం నచ్చక కొందరింటివాళ్లితనిని వదిలేశారు. అయితే అతను చూసిన అన్నిళ్లలోనూ గంటల తరబడి కాలం మాత్రం వృథా అయేది. ప్రతి ఇంటివాడూ, తన ఇంటిని పొగుడుతూ గంటలకొద్దీ లెక్చర్లిచ్చేవాడు. ఒకసారి ఓ పెద్ద మనిషి తన ఇంటిని గురించి అదే పనిగా కోసేశాడు. 'ఇల్లంతా కాంక్రీటుతో ఇనుప ఇల్లు, అయిరన్ హవుస్, కట్టేశాను. చూడండి' అని గోడ మీద గట్టిగా గుద్దాడు. పైనించి ఓ తట్టెడు బెల్లు వూడి వాళ్ల నెత్తిన పడింది. 'కంట్రాక్టరు వెధవ మోసం చేశాడ'ని ఇంకో గంట కంట్రాక్టర్లని, మేస్త్రీలనీ అందరినీ కడిగేశాడాయన. ఈ విధంగా తాను విసిగి వేసారి ఉన్న సమయంలో అతనికో ఇల్లు దొరికి సంతసమయింది. ఇంటాయన ఇతన్ని ప్రశ్నల వేసి బాధించలేదు. "నాకు మంచివాళ్లు. తిన్నగా నెలనెలా నేనడిగిన అద్దె ఇచ్చేవాళ్లు కావాలంతే" అన్నాడు. శ్రీనివాసరావుకి భలే ఆనందమయింది. ఆ పెద్ద మనిషికి బట్టతల లేదు. లేకపోతే ముద్దు పెట్టుగుని ఉండేవాడు. వెంటనే అడ్వాన్సు కట్టడానికి డబ్బు కూడా తీశాడు.

"మరి మీ ఆవిడని ఎప్పుడు తీసిగుని వస్తారని" అడిగాడాయన నోట్లు లెక్క పెట్టుగుంటూ.

"నాకింకా పెళ్లి కాలేదండీ" అన్నాడు శ్రీనివాసరావు ముసి ముసి నవ్వు నవ్వుతూ.

ఆ పెద్ద మనిషి వెలవెల బోయాడు. తరువాత నీళ్లు నములుతూ చెప్పాడు. "మీరు పెద్ద మనుష్యులని నాకు తెలుసు. కాని, చూశారూ, నాకు పెళ్లికాని అమ్మాయిలు ముగ్గురున్నారు. బ్రహ్మచారి కింట్లో వాటా అద్దెకిచ్చానంటే బంధువులంతా నన్ను కొరుక్కు తినేస్తారు."

శ్రీనివాసరావుకి ఉత్సాహమంతా చచ్చింది. 'ఇవ్వకపోతే నిన్ను నేను కొరుక్కుతినేస్తా'నని అందా మనుకున్నాడు. కాని, ఆయన బాధ ఆయనది. అతను తిరిగిపోతూ ఉంటే, ఇంటాయన తల్లి లోపల్నించి, "బ్రహ్మచారికి ఇల్లు దొరకడం కష్టం. అయినా మంచి ఉద్యోగంలో ఉన్నారు. పెళ్లి చేసుగోక పోవడం ఏం పాయగాలం ? ఈ హొటల్ కూడు తింటూ అవస్థ పడడ మెందుకు రోగమా ?" అని అడిగింది.

అవేవీ వినిపించుకోకుండా తిన్నగా హొటల్‌కి వచ్చేశాడు. పినతల్లి, శేషమ్మ, వ్రాసిన ఉత్తర మతని కోసం నిరీక్షిస్తూంది. తనకి వయస్సు వచ్చేస్తోందని, వ్యవహారాలూ అవీ చూసుకో లేక పోతున్నానని వ్రాసింది. "నువ్వేమో చెప్పిన మాట వినిపించుగోవు. ఎంత కాల మవస్థ పడతాను ? నీవూ ఓ ఇంటి వాడి వయితే నాకు బాధ్యత తీరుతుంది. లత నిక్షేపంలాంటి పిల్ల. దాన్ని చూసి నువ్వెందుకు భయపడుతున్నావో తెలియదు. నువ్వు పిచ్చి పుస్తకాలు చదువుకుంటూ కూర్చుంటే, నీ సంసారాన్ని నడపగల శక్తి దానికి మాత్రమే ఉంది. ఇప్పటికయినా నీ అంగీకారం తెలియజేస్తే వచ్చే నెల్లోనే ఉన్నాయి బోల్డు ముహూర్తాలు." అంటూ లతని పొగుడుతూ ఇంకో రెండు పేజీలు వ్రాసింది. లత అంటే శేషమ్మగారికి వరుసకి మేనకోడలు. చదువుకున్న పిల్ల. శ్రీనివాసరావా అమ్మాయిని తాను చేసుకోలేదు సరికదా, తన స్నేహితుడు చేసుకోబోతూ ఉంటే కూడా తప్పించేశాడు. పిన్ని ఉత్తరం చూసేసరికి అతనికి అనేక ఆలోచనలు వచ్చాయి. ఇంటాయన తల్లి తలుపుచాటు నుండి ఇచ్చిన సలహా గుర్తుకి వచ్చింది. ఓస్ ! లతని చూసి తానెందుకు అంత భయపడుతున్నాడు ? ఆమె ఈ హొటల్ బోయ్‌ల కంటే భయంకరమయినది కాదని నిర్ధారణ చేసుగున్నాడు.

వెంటనే కార్డు తీసి రెండే రెండు ముక్కల్లో తన ఉద్దేశం వ్రాసేసాడు. "ముహూర్తం పెట్టించు" అని వ్రాసి క్రింద సంతకం పెట్టబోయే సమయానికప్పుడే అతని చెవులల్లో సన్నాయి మేళాలు వినిపించేయి. సన్నాయి మేళాలిప్పుడతన్ని కంగారు పెట్టలేదు కాని వాటి వెనుక చంటి పిల్లల ఏడుపులు, కోమటి కొట్లో కందిపప్పు బేరాలూ లాంటివి వినిపించి, అతను హడలి పోయాడు.

"హరి భగవంతుడా ! ఇంకానయం ! !" అని కళ్లన్ని మూసేసి, లైటార్పేసి, దుప్పటి ముసుగు పెట్టి పడుకున్నాడు. రాత్రి తెల్లవార్లూ అతని కనేక రకాలయిన కలలు వచ్చాయి. ఒకసారి లత, హొటల్ కుర్రాళ్ల బారి నుండి తనని రక్షించడానికి వచ్చినట్లు, ఇంకోసారి ఆమె బారి నుండి వాళ్లు తనని రక్షిస్తూ ఉన్నట్లు, మరోసారి తనని టగ్ఆఫ్‌వార్ తాడులాగ ఒకవేపు పిన్ని, లత, ఇంకో వేపు హొటల్ కుర్రాళ్లు లాగుతూ ఉన్నట్లూ కలలు వచ్చేయి. ఈ కలలన్నింటిని నెట్టేసి, అతనికి నిద్రపట్టేసరికి అప్పుడే నాలుగున్నర అయింది. "ఇరవయ్యొకటో రూమ్, పెసరట్ ఎక్స్‌ట్రా రోస్టు" అని హొటల్ కుర్రాడి కేకతో ఉలిక్కిపడి లేచాడతను. వెంటనే లైటు వెలిగించి, కార్డుపై సంతకం పెట్టేసి, అడ్రసు వ్రాసి, అప్పటికప్పుడే పోస్టు డబ్బాలో పడేసి వచ్చి హాయిగా పడుకున్నాడు—

"ఇప్పుడు ఇద్దరో ముగ్గురో పిల్లలనుకుంటా వాళ్ల సంసారం బాగానే సాగిపోతోంది. అహో, ఇంతకీ నే చెప్పేదేమిటంటే, ఇక్కడ ప్రేమ ప్రమేయమూ లేదు, ఘటనా కాదు. కేవలం ఆ సమయంలో ఉన్న పరిస్థితుల్ని బట్టి ఉంటుంది ఏమంటారు ?" అన్నారు రామయ్యగారు.

ఏమనడానికీ, ఎవరయినా మెలకువగా ఉంటేగా, అంతా గుర్రుపెట్టి నిద్రపోయారు. చంద్రుడు కూడా ఎప్పుడో అస్తమించాడు. పైన నక్షత్రాలు మాత్రం ఏమీ విననట్లు కూర్చున్నాయి. క్రింద గోదావరి ఏ అభిప్రాయమూ చెప్పకుండా గలగలా నవ్వింది తెలివిగా. "భలే వాళ్ళురా" అనుకుని ఆవలిస్తూ నడుం వాల్చాడాయన.



---

యజమాని : ఒకే! యింట్లో అన్ని పనులు చెయ్యి. నెలకు 30 రు. యిస్తాను. వచ్చే నెలలో 50 రు. యిస్తాను!

కూలి : అయితే వచ్చే నెలలో చేస్తాను సార్!

యల్. ప్రకాశరావు (కుల్యూరు)

---

11-9-1964 శుక్రవారము మొదలు
17-9-1964 గురువారము వరకు.

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారంతో మొదటి సగంకంటే రెండవ సగం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. వారం ప్రారంభంలో కొన్ని వ్యవహారాల్లో ఆందోళన కలగవచ్చును. కాని మీరు సమయోచితంగా వ్యవహరించడంవలన చికాకులు కలగకుండా తప్పించుకొనగలుతారు. వారాంతంలో అన్ని వ్యవహారాలూ మీరు అనుకొన్నట్లుగా నెరవేరడంవలన లాభం కలుగుతుంది. వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలతో చీలికలు రావడంవలన మీ అభివృద్ధి పూర్ణం నిష్కంటకం కాగలదు.

స్త్రీలకు : ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు వారాంతంలో సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

12, 13 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈ వారం మొత్తంమీద బాగానే ఉండవచ్చును కాని వారం మధ్యలో ఆకస్మికంగా కొన్ని చికాకులు వస్తాయి. వృత్తివ్యాపారాల్లో పోటీవారితో పోటీ కొంత తగ్గడంవలన అభివృద్ధిని సాధించగల అవకాశం ఉంది. వృత్తిలో కొంతమంది మిత్రుల సహకారం లభిస్తుంది. ఉద్యోగం అనుకూలంగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావచ్చును. ఆరోగ్యం బాగా ఉన్నా వారం మధ్యలో మానసికాందోళన కలుగుతుంది. శుభకార్యాల విషయంలో ప్రోత్సాహం లభిస్తుంది. బంధు వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు.

స్త్రీలకు : ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. కొంతమంది సన్నిహితులతో భేదాభిప్రాయాలు రావచ్చును. అధిక వ్యయం జరుగుతుంది.

12, 13, 17 తేదీలు మంచివి. మిగిలినవి మంచివికావు.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో మీరు ఎంత ప్రయత్నంచేసినా వ్యర్థంకావడం మరికొన్ని వ్యవహారాలు మీ ప్రయత్నం లేకుండానే నెరవేరడంవంటి సంఘటనలు జరుగుతాయి. ఏ వ్యవహారాన్నీ పూర్తిగా నెరవేరేవరకూ నమ్మడానికి వీలులేదు. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. మీకు అందవలసిన డబ్బును నమ్మి వాగ్దానాలు చేయడం మంచిది

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | | గు | రా |
| శ | వారఫలం | | కు శు |
| | మహేష్ | | ర బు |
| కే | | చం | |

కాదు. వృత్తి ఉద్యోగాల్లో ప్రయోజనంలేని ప్రయాస కలుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును.

స్త్రీలకు : వారాంతంనుంచి ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

12, 13, 17 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం చిత్రంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో కలిగే ఆకస్మిక పరిణామాలవలన, కొన్ని వ్యవహారాలు మీ స్వాధీనంనుంచి తప్పిపోగలవు కాని మీకు అపకారం జరిగే సూచనలు లేవు. ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్నవారే కొంతమంది వ్యతిరేకులు కావడంవలన మీ వారెవరో పైవారెవరో తెలియని స్థితి పరిస్థితి ఏర్పడుతుంది. అధికారుల వలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరి లాభం కలుగుతుంది. ఉద్యోగంలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. మీ అభిప్రాయాలకు అధికారుల ఆమోదం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు : ఆరోగ్యం బాగావున్నా అప్పుడప్పుడు బలహీనత కన్పించవచ్చును. బంధు వ్యవహారాల్లో నిష్ఠూరం వస్తుంది. అలంకార వస్తువులు కొంటారు.

14, 15, 16 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం అనుకూలంగానే ఉంటుంది కాని వృత్తి వ్యాపారాల్లో సులభంగా జరుగవలసిన పనులకుకూడా ఆటంకాలు రావడంవలన కొంత శ్రమ పెరుగుతుంది. మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు ప్రాముఖ్యత రావడంవలన మీరు పొందవలసినలాభాన్ని పొందలేని పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తిలో కొన్ని నూతనావకాశాలు లభిస్తాయి. వాటివల్ల ప్రస్తుత ప్రయోజనంకంటే భవిష్యత్తులో మిక్కిలి ఉపయోగం ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన నూతన

**సూచన**

నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

పరిణామాలు రావచ్చును.

స్త్రీలకు : ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. నూతన విషయాలను తెల్సుకుంటారు.

14, 15, 16 తేదీలు మంచివి. 17వ తేదీ మంచిదికాదు.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం గతవారంకంటే బాగావున్నా పూర్తిగా అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. భారీ యెత్తునచేసే వ్యాపారాలు కొంతకాలంపాటు వాయిదా వేయడం మంచిది. ఆదాయం మామూలుగా ఉన్నా రావలసిన డబ్బు సమయానికి అందక కొంత ఇబ్బంది కలగవచ్చును. వృత్తి ఉద్యోగాల్లో మీరు ఇదివరకు చేసిన నిర్ణయాలవల్ల ఇప్పుడు కొన్ని చికాకులు వచ్చే సూచనలు ఉన్నాయి. కోర్టు వ్యవహారాల్లో వ్యతిరేకత చాలావరకు తగ్గుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దూరపు బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు : ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత ఉంటుంది.

11, 17 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

వృత్తి వ్యాపారాల్లో వ్యయప్రయాసలు ఎక్కువైనా మీరు తలపెట్టే పనులన్నీ సక్రమంగా నెరవేరడంవలన ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యాపారాల్లో లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిరీత్యా ప్రయోజనంకల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. ముఖ్యమైన కాగితాలుగాని వస్తువులుగాని పోయే ప్రమాదం ఉంది.

స్త్రీలకు : ఆరోగ్యం అంత బాగా ఉండక పోవచ్చును. సాంఘిక వ్యవహారాల్లో బాధ్యతా పలుకుబడి పెరుగుతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

11, 12, 13 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### వృశ్చికం :

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం గడచిన వారాల కంటే బాగ

ఉంటుంది. వృత్తి వ్యాపారాల విషయంలో మీరు కొంత కాలంగా చేస్తున్న ఆలోచనలు కార్యరూపం ధరించడానికి అవకాశంవుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. భారీయెత్తున చేసేవ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.వృత్తిలో అనుకూలతా, ఆదాయమూ కూడా పెరుగుతాయి. ఉద్యోగంలో మీ అభివృద్ధికి కలిగిన అవరోధాలు తొలగిపోతాయి. అన్ని వ్యవహారాల్లోనూ ముందుకు వెళ్లవలసిన సమయం. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. అధికులతోసహవాసం లభిస్తుంది.

స్త్రీలకు : ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి.

11వ తేదీ మంచిదికాదు. 14, 15, 16 తేదీలు మంచివి.

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ వారంకూడా అంత బాగా ఉండదు. వృత్తి వ్యాపారాల్లో వెంటనే ప్రయోజనం లేకపోయినా ముందుముందు లాభించుటకు, అవసరమైన మార్పులు, ఏర్పాట్లు జరగవచ్చును. అన్ని వ్యవహారాల్లోనూ ప్రయోజనంకంటే ప్రయాస అధికంగా ఉంటుంది. అధికారులవలన జరుగవలసిన పనులకు, ఆకస్మికంగా ఆటంకాలు రావడంవలన మీ కార్యక్రమాలు తల క్రిందులు కాగల ప్రమాదం ఉంది. ఉద్యోగంలో మీ పరిస్థితి యథాతథంగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందకపోవచ్చును. అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు : మీ ఆరోగ్యం బాగావున్నా సంతానానికి కించిత్‌అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులుగా లేకుండా నెరవేరుతాయి.

12, 13 మంచివికావు. మిగిలినవి మంచివి.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. ప్రతి వ్యవహారంలోను ఏదో ఒక సందేహం కలుగుతూ ఉండడంవలన మీరు సాహసించి ఏ పనీ చేయలేరు. కాని మీకు కలిగిన సందేహాలు, సరియైనవని క్రమంగా రుజువు కావడంవల్లన ఏ పనీ చేయకుండా ఉండడమే సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తిలో తీవ్రమైన పోటీని ఎదుర్కొన్న తరువాత సత్ఫాభివృద్ధిని సాధిస్తారు. వారాంతంలో అకారణంగా అధికారుల అనాదరణకు గురి కాగల సూచనలున్నాయి. ఆరోగ్యం అంతగా బాగా ఉండదు. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు: కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. సాహిత్యరంగంలో మీ కృషి ఫలిస్తుంది. విలువైన వస్తువులు కొంటారు.

14, 15, 16 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

## కుంభం :

ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

ఈ వారం ప్రారంభంలో అని వ్యవహారాల్లోనూ చికాకులు కల్గే టట్లు కన్పించినా, వారాంతానికి చాలా వరకు ప్రశాంత పరిస్థితి ఏర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో మార్పులకోసం మీరుచేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చును. మీరు ఇదివరకు చేసిన వాగ్దానాలవల్ల ఇప్పుడు ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. మిత్రులతో కలహ ప్రసంగం రావచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు : ఆరోగ్యం గత వారంలోకంటే బాగా ఉంటుంది. శుభమూలంగా వ్యయం జరుగుతుంది. బంధువుల్లో ఖ్యాతి లభిస్తుంది.

17వ తేదీ మంచిదికాదు. మిగిలినవి మంచివి.

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. రేభాద్ర,వతి.)

మీరు ఇతరులకోసం ఏ ప్రయత్నంచేసినా అది సులభంగా నెరవేరుతుంది కాని మీ స్వంత వ్యవహారాల్లోమాత్రం ఎన్నో ఆటంకాలను ఎదుర్కోవలసి ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో కన్పించే నూతనావకాశాలు అంతగా ఫలించగల సూచనలు లేవు. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని ముఖ్య వ్యవహారాలు నిలచిపోవచ్చును. ఉద్యోగంలో మీకు వ్యతిరేకంగా కొన్ని మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రతిపక్షుల బలం పెరుగుతుంది. ఆరోగ్యం అంత బాగావుండదు.

స్త్రీలకు : ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని వారాంతంలో మానసికాందోళన కలుగుతుంది. కుటుంబ కార్యక్రమాల్లో కొన్ని మార్పులు వస్తాయి.

11వ తేదీ మంచిదికాదు. 17వ తేదీ చాలా మంచిది.



# జన్మదిన ఫలం

## సెప్టెంబరు-11

ఈ సంవత్సరం మొత్తం మీద బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొద్ది చికాకులు వచ్చినా, మీ కార్యక్రమాలకు ఆటంకం కలగదు. వ్యాపారంలో మీరు చేసే ఆలోచనలు సంవత్సరం మధ్యలో ఫలిస్తాయి. సమయానికి కొంత మంది మిత్రుల అండదండలు లభించడం వలన నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ఇంతవరకు ఉన్న అవరోధాలు తొలగిపోవడం వలన కొంత అభివృద్ధి కలుగుతుంది. ఉద్యోగంలో పలుకుబడి అందరితో మంచి పేరు లభిస్తాయి. ఆర్థికంగా విశేషమైన ఒత్తిడిలేకుండా అన్ని వ్యవహారాలూ నెరవేరతాయి. ఆరోగ్యం బాగా ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు మంచివి కావు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో హోదా లభిస్తుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-12

ఈ సంవత్సరం గడచిన కొద్ది సంవత్సరాల కంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో యేర్పడిన చిక్కులు క్రమంగా తొలగిపోవడం వలన భవిష్యత్తుపై విశ్వాసం యేర్పడుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా అనుకూలంగా ఉంటాయి. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన పెట్టుబడి చాలక కొంత ఇబ్బంది కలగ వచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంత వరకు లాభించవచ్చును. వృత్తి ఉద్యోగాల్లో ధైర్యంగా ముందుకు వెళ్లవలసిన సమయం మీ అభిప్రాయాలను అమలు జరపడం వలన ఆదాయం అంతస్తూ కూడా పెరుగుతాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో ఉన్న చిక్కులు తొలగిపోతాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది కుటుంబ వ్యవహారాల్లో అప్పుడప్పుడు కొన్ని చిక్కులు రావచ్చును. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-13

అన్ని వ్యవహారాలూ అనుకూలంగా కన్పించినా యే మాత్రం యేమరుపాటు చూపినా నష్టం తప్పదు. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి. కాని వాటి నిమిత్తం ప్రయత్నించడం వలన ప్రస్తుతం ఉన్న వ్యవహారాలు నిలచిపోయే ప్రమాదం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు క్రమంగా సానుకూల పడతాయి. వృత్తిలో ప్రయోజనం కల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి యధాతథంగా ఉంటుంది. విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి సమయం కాదు. మీరు ఇంతవరకు జరిపిన వ్యవహారాల్లో చికాకులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని అప్పుడప్పుడు ఉష్ణాధిక్యత కన్పించవచ్చును. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. కొంత మంది బంధువులు మీతో భేదాభిప్రాయాలు కల్గించడానికి ప్రయత్నిస్తారు. విద్యార్థులు మొదట నుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

## సెప్టెంబరు-14

ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు ఉన్న అవరోధాలు తొలగిపోయి అభివృద్ధికి మార్గం యేర్పడుతుంది. ఇంతవరకు కొన్ని వ్యవహారాల్లో ఉండిపోయిన డబ్బు సంవత్సరం మధ్యలో చేతికి రావడం వలన నూతన వ్యాపారాలు ప్రారంభించడానికి అవకాశం ఉంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో అధిక వ్యయంతో కూడిన కార్యక్రమాన్ని చేపట్టి విజయం సాధించే సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడవచ్చును కాని సంవత్సరాంతంలో ముఖ్యమైన కాగితాలు పోయే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో పలుకుబడి పెరుగుతుంది. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కాగలరు.

దీపావళి కథలపోటీ

ఆఖరి తేదీ

1-10-'64



# జన్మదినఫలం

## సెప్టెంబరు-15

ఈ సంవత్సరం ఆర్థికంగా గత సంవత్సరం కంటే బాగా ఉన్నా అప్పుడప్పుడు వృత్తి వ్యాపారాల్లో యేర్పడే అనిశ్చిత పరిస్థితి వలన సంతృప్తికరంగా ఉండక పోవచ్చును. వ్యాపారంలో మీకు కలిగే సందేహాల వలన కొన్ని వ్యవహారాలు నిలచిపోతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు వెంటనే ప్రోత్సాహకరంగా ఉండక పోయినా, నష్టం రాగల సూచనలు లేవు. వృత్తిలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. ఉద్యోగంలో సంవత్సరం మధ్య నుంచి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఇప్పుడు ఫలించవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది కాని మానసికంగా శాంతి లభించని స్థితి యేర్పడుతుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాలు అంతబాగా ఉండవు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-16

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను వృత్తి వ్యాపారాల్లో కొద్దిగా చికాకులు కలగవచ్చును. భారీ యెత్తున చేసే వ్యాపారాలు బాగానే ఉంటాయి. వ్యాపారంలో మీ అభిప్రాయాలు అమలు జరపడం కంటే భాగస్థుల నిర్ణయానికే విడిచి పెట్టడం మంచిది. సామాన్యంగా జరిగే వ్యవహారాలకు కూడా ఇబ్బందులు రావడం వలన మీకు కొంత శ్రమ కలిగినా ఆదాయం కూడా తగినట్లుగా పెరగడానికి అవకాశం ఉంది. సంవత్సరాంతంలో ఆకస్మికంగా అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. వృత్తిలో కూడా ప్రయోజనం, ప్రయాస పెరుగుతాయి. ఉద్యోగంలో శ్రమ మీద మీ స్థానాన్ని నిలబెట్టుకొంటారు. జీర్ణ సంబంధమైన అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతి పక్షాల ఒత్తిడి పెరుగుతుంది. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు అనుకూలంగా ఉండవచ్చును.

## సెప్టెంబరు-17

ఈ సంవత్సరం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉన్నా మీకు ఇంతవరకు అన్ని విధాలా చేదోడుగా ఉన్న వారితో అభిప్రాయ భేదాలు రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో కార్యక్రమాలు మీరు అనుకొన్నట్లుగా జరగక పోయినా జరిగినది మాత్రం మీకు అనుకూలంగానే ఉంటుంది. వృత్తిలో వెంటనే విశేష ప్రయోజనం ఉండక పోవచ్చును కాని ముస్ముందు రాణించుటకు కావలసిన మార్పులు జరుగుతాయి. ఉద్యోగం సామాన్యంగా ఉంటుంది. స్థాన చలనమునకు అవకాశం ఉన్నది. ఆర్థికంగా అప్పుడప్పుడు ఒత్తిడి వచ్చినా మీ వాకచక్యంవల్ల అన్ని వ్యవహారాలూ సరిపుచ్చుకొంటూ అభివృద్ధిని సాధించగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిసుంది. విద్యార్థులు సామాన్యంగా కృతా[illegible] కాగలరు.



# హృదయ కుసుమాలు



హరికిషన్

### జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తన కుటుంబ గాథను చెపుతూవుంటుంది... జానకి, సీత అక్కచెల్లెళ్లు. జానకీ రామారావులకు పెళ్లవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు. భార్యాభర్తల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు రావటంతో, జానకి తానాశించిన ఆనందాన్ని పొందలేకపోతుంది. జానకిపై రామారావు అనుమానం నానాటికి పెరిగిపోతూ వుంటుంది.

## 5

భోజనాలయాక కాసేపు ఇద్దరూ విశ్రాంతి తీసుకున్నారు. మిగిలిన విషయాలన్నీ చెప్పమన్నది రాధ. అప్పటికి మధ్యాహ్నం మూడు గంటలయింది.

సీత మళ్లీ చెప్పసాగింది—

"శ్రావణ మాసంలో నోములు కాగానే అక్కయ్య గుంటూరు వెళ్లిపోయింది. నేను స్కూలు ఫైనలు పాసయింతరువాత ఆ సంవత్సరం కాలేజీలో చేర లేదు. కారణం అక్కయ్య పెళ్లితో డబ్బు లేకపోవ టమే. మా నాన్నగారు తాలూక ఆఫీసులో గుమాస్తా. మాకున్న పొలమూ కాస్త అక్కయ్య పెళ్లికిగాను అమ్మేశారు. ఆర్థిక ఇబ్బందులవల్ల ఆ ఏడు నేను [illegible] అమ్మకు సాయంగా ఇంట్లోనే ఉన్నాను.

"రాధా! అక్కయ్య ఎప్పుడూ అంటూ ఉండేది. లోకంలో అనేక తరహాలు వ్యక్తులుంటారు. అందర్నీ మనంమెప్పించలేం. అందరికీ సహాయం చెయ్యలేం. అందరి ఆదరాభిమానాలు సంపాదించలేం. అందరి మాటలూ వింటూ ఉండాలి. మన మనస్సుకి ఏది న్యాయసమ్మతంగా ఉంటే అది చెయ్యాలి. అక్కయ్య ఆ సిద్ధాంతానికు ప్రాధాన్యత ఇస్తుంది. చదువులో అక్కయ్య మేధావి. చిన్నప్పట్నుంచీ ప్రతి క్లాసు లోనూ ఫస్టుగానే ఉండేది. ఇంటరు ఫస్టుక్లాసులో పాసయింది. ఏలూరు కాలేజీలో ద్వితీయశ్రేణిలో వచ్చింది. అక్కయ్యంటే అటు విద్యార్థులకూ,

# హృదయ కుసుమాలు

లక్ష్మణ్ణకూ అందరికీ గౌరవమే. అందరికీ అభిమానమే. ప్రతిఒక్కరి జీవితంలోనూ ఏదో ఒక లోపం కనబడుతూనే ఉంటుంది. అక్కయ్య చదువులో ఎంత మేధావంతురాలో జీవితంలో అంత మేధకురాలు. ఏం మాట్లాడాలో ఏం మాట్లాడితే ఎవరు నొచ్చుకుంటారోనని ఎంతో విబ్బరంగా జాగ్రత్తగా మసులుకుంటుంది. ఎవ్వరి మనసూ నొప్పించదు. అందరి దృష్టిలో మన్ననలందుకున్న అక్కయ్య కట్టుకున్న భర్త దృష్టిలో అవినీతి పరురాలు. దాని జీవితంలో ఇదొక రంపపుకోత. అగ్నిపరీక్ష.

అక్కయ్య వెళ్ళిపోయాక చాలా రోజులు దాని జీవితాన్ని గురించే ఆలోచిస్తూ ఉండేదాన్ని. ఈ అగ్నిగుండంలోనుంచి ఎట్లా బయటపడి తన నిర్దోషిత్వాన్ని ఋజువుపర్చుకుంటుందో ఎంత ఆలోచించినా నాకు అర్థంకాలేదు. నాలో నేనే విచారపడుతూ ఉండేదాన్ని. అమ్మకు ఏ విషయాలూ తెలియనివ్వలేదు. తెలిస్తే మంచమెక్కుతుంది.

అక్కయ్య మామగారు రిజిస్ట్రారాఫీసులో గుమాస్తా. రెండేళ్లలో ఆయన రిటయిరవుతారు. ఆయన్ని గుంటూరునుంచి వినుకొండకు బదిలీ చేశారు. భార్యాభర్తలిద్దరూ, సుభద్రా వినుకొండ వెళ్ళిపోయారు. ఇక గుంటూరులో బావ, అక్కయ్య ఇద్దరే వున్నారు. ఇద్దరే ఉండటంనుంచి బావలో కొంత మార్పేమయినా వస్తుందేమోనని ఆశించాను.

ఆర్థిక ఇబ్బందివల్ల నేను ఆ సంవత్సరం నేను చదువు మానేసినా, అక్కయ్య జీవితంకూడా కొంతవరకూ కారణమయింది. అసలింక చదువే వద్దన్నది అమ్మ. ''జానకి ఇంటరు చదివి ఏంచేస్తున్నది. కాపురం చేస్తున్నది. దానికి చదువేమయినా అక్కరకొచ్చిందా?. దీనికీ ఎట్లాగోట్లా పెళ్లి చేసి ఓ అయ్య చేతిలో పెడితే మీరు నిశ్చింతగా రిటయిరవచ్చు.'' అనేది అమ్మ. నాన్న ఏమీ చెప్పేవారుకాదు. నేను ఒక్కటే నిశ్చయించుకున్నాను. అక్కయ్య కాపురం బాగుపడి అది సుఖ సంతోషాలతో ఉంటేనే నేను పెళ్లిచేసుకునే సంగతి ఆలోచించటం. అక్కయ్య జీవితం ఇట్లా కన్నీరుమున్నీరుగా గడుస్తుంటే ఇంక జీవితంలో వివాహమే చేసుకునేదిలేదు. ఉద్యోగమే శరణ్యం. అందుకూడా పై చదువు పూర్తిచెయ్యాలి. ఏమైనా ఆ ఏటికి చదువు ఆపేశాను గనుక అమ్మతో ఏమీ తర్కించలేదు.

దసరా, దీపావళి, పండుగలకు బావనీ, అక్కయ్యని రమ్మనమని నాన్న ఉత్తరం రాశారు. అందుకు అక్కయ్య పెద్ద ఉత్తరం రాసింది. పర్యవసానం పండక్కి తాము అక్కడికి రామనీ, నన్ను పండక్కి గుంటూరు పంపించమనీ మరీమరీ ప్రాధేయపడుతూ అక్కయ్య ఉత్తరం వ్రాసింది. అమ్మ అంతగా ఇష్టపడలేదు. అల్లుడూ, కూతురూ, తమ ఇంటికే రావాలని అమ్మ పట్టుదల, రెండు రోజులు పట్టుబట్టి అమ్మను ఒప్పించిం తరువాత నాన్నగారితో నేను గుంటూరు వెళ్లాను. పది రోజులుముందుగానే వెళ్లాను.

అక్కయ్యను చూడంగానే నాకు దానిలో ఏ మార్పు కనిపించలేదు. శ్రావణ మాసంలో వచ్చినప్పుడు ఎట్లావున్నదో అప్పుడూ అట్లాగే వున్నది.

మేం వెళ్లేసరికి బావ ఇంట్లోనే ఉన్నారు. కాలేజీకి వెళ్లబోతున్నారు. పెళ్లికి ఎట్లా వున్నారో అప్పుడూ అట్లాగే ఉన్నారు. మమ్మల్ని చూడగానే ఎంతో ఆదరంగా ఆహ్వానించారు. నాన్నతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడారు. కాలేజీ టైమవటం నుంచి వెళ్లిపోయారు.

నాన్ననూ, నన్నూ చూసేసరికి అక్కయ్యకు ప్రాణం లేచివచ్చినట్లయింది. నాన్నకు ఇష్టమైన తీపి పిండివంట మైసూరుపాకు చేసింది. నాకు ఇష్టమైన కారంబూందీ చేసింది. జీడిపప్పులు వేయించి కారం మసాలా చల్లింది. ఎంతో సంతోషం ఆప్యాయంగా ఇవన్నీ చెయ్యటం చూస్తే, అక్కయ్య జీవితంలో నవోదయం ఇప్పటికి ప్రారంభమైందా అని అనుకున్నాను.

రాత్రికి మామా, అల్లుడూ భోజనానికి కూర్చున్నారు. అక్కయ్య సంతోషానికి అవధులు లేవు. కూతురు చేతివంట ఆప్యాయంగా తిన్నారు. నాన్నతో కబుర్లుచెబుతూ బావకూడా సుష్టుగా భోజనంచేశారు. నేను తలుపు పక్కన నిల్చుని బావ ముఖంలోకి పరీక్షగా చూడసాగాను.

''మామగారికి తీపి ఇష్టమైనట్లుంది. ఇంకో నాలుగు మైసూరుపాకు ముక్కలు వడ్డించు'' అన్నారు బావ.

నాన్న విస్తట్లో రెండు ముక్కలు వేసింది అక్కయ్య. తనకూ వెయ్యబోగా వద్దని చెయ్యి అడ్డంపెట్టి ముఖం చిట్లించుకున్నారు బావ. అక్కయ్య చిన్నబుచ్చుకుని వెళ్లింది.

''తీపి సయించకపోతే బూందీ అయినా తినండి బావా'' అన్నాను.

''అన్నంలో తినలేను సీతా. అన్నంలో నాకేమీ సయించవు'' అన్నారు బావ. కాని కోపంతో మాట్లాడలేదు.

బావ మాట్లాడే తీరుచూస్తే నాకు ఒక్క విషయం అర్థమైంది. ఒక్క అక్కయ్యతో మినహా మిగతా వాళ్లతో ఆప్యాయంగా మాట్లాడుతారు. తన చదువుకూ, తన హోదాకు తగినట్లుగా మాట్లాడుతారు. ఎంతో వినయంగా కబుర్లు చెబుతారు. కాని అక్కయ్యను చూసేసరికి వూసర వెల్లి రంగులు మార్చినట్లే. నాటకంలో ఒక విదూషకుడు ద్విపాత్రాభినయం చేసినట్లు, అంత



''నారద మునీంద్రా! భూలోకంలో విశేషాలేమిటి?''
''ఏమున్నాయి బాబూ! ఇదివరకు నీపొట్టే చాలా పెద్దదనుకున్నాం! ఇప్పుడు, భూలోకంలో దేవుడి సొమ్ము, ప్రజల సొమ్ము, ప్రభుత్వం సొమ్ము తినే పెద్దమనుషుల పొట్టలముందు... ఉండ్రాళ్లు తినే నీ కడుపు చాలా చిన్నదైపోయిందంటున్నారు...!!''

అవే ముఖకవళికలు మారిపోతయ్యి. మాటలో కాఠిన్యం కనిపిస్తుంది.

బావ ఆత్మాభిమానానికి నాన్న ఎంతో సంతోషించాడు. బావ కాలేజీకి వెళ్ళినప్పుడు అక్కయ్యతో అన్నాడు.

''చాలా అదృష్టవంతురాలివమ్మా జానకీ. అల్లుడు చాలా మంచివాడు. సౌమ్యుడు. బుద్ధిమంతుడు. ఎరగని పరాయి సంబంధం చేశాను. ఎట్లా ఉంటుందో నీ కాపురం అనుకున్నాను. చాలా తృప్తిగా ఉందమ్మా జానకీ. నీ కడుపు చలవన మనవలనీ, మనవరాళ్ళనీ ప్రసాదించావంటే నాకు ఇంకా కొండంత సంతోషంగా ఉంటుంది.'' అన్నారు నాన్న.

ఆ మాటలు విని అక్కయ్య నవ్వింది. నేనూ నవ్వుకున్నాను. అక్కయ్య కాపురం సంగతి నాన్నకే తెలుసా? బావ మాటలు నాన్నను తృప్తి పరిచిన మాట నిజమే. కాదని ఎవ్వరూ అనలేరు.

పండుగలు వెళ్ళగానే నన్ను పంపమని బావతోనూ అక్కయ్యతోనూ చెప్పి నాన్న వెళ్ళిపోయారు. బావతోనూ, అక్కయ్యతోనూ ఎక్కువ మాట్లాడకుండా వాళ్ళ మనస్తత్వాలు అర్థం చేసుకోవాలని అనుకున్నాను.

రోజూ వాళ్ళ దినచర్య గమనించేదాన్ని. ఉదయం ఆరు గంటలకు పనిమనిషి రాగానే నిద్ర లేస్తుంది అక్కయ్య. కాఫీలు పూర్తయాక వంట మొదలుపెడుతుంది. అంతవరకూ తన కాలకృత్యాలు తీర్చుకుని కాలేజీ పాఠాలు చూసుకోవటమో, పేపరు చదువుకోవటమో, చేస్తుంటారు బావ. కాఫీగ్లాసు కూడా డ్రాయింగురూములో పెట్టి వెళుతుంది అక్కయ్య. ఏ విషయం మాట్లాడుకోరు. తను స్నానంచేసి వచ్చి బట్టలు మార్చుకున్నాక వంట ప్రయత్నం చేసేముందు మెల్లిగా వచ్చి ''ఇవాళ కూర ఏం చెయ్యమంటారు'' అంటుంది అక్కయ్య, పేపరు చదువుకుంటూనే ''నీ ఇష్టం'' అంటారు బావ. ''చెప్పండి ఏం వండాలో'' అంటుంది. మళ్ళా అక్కయ్యతో ''చూడు జానకీ, నీకు ఏది ఇష్టమైతే అది వండు. ఏం కూరలున్నయ్యో నీకు తెలుసుగా'' అంటారు బావ. ఒక్క నిమిషం నిల్చుని అక్కయ్య వచ్చేస్తుంది. బావ ఏం చెప్పకపోయేసరికి అక్కయ్య తనకు తోచింది చేస్తుంది. తొమ్మిదన్నరకల్లా బావ వంటింట్లోకొచ్చి వంట అయిందా, లేందీ కనుక్కోకుండానే ''ఇంక కైనైంది వడ్డించు'' అంటూనే పీటవేసుకుంటారు. ''అయిపోయింది. ఒక్క నిమిషం. ఈ పులుసులో తిరగమోత పెట్టి వడ్డిస్తానో, ఈ చారు దింపి వస్తానో'' అంటుంది అక్కయ్య తొందరపడుతూనే. బావ వంటింట్లోకి వచ్చి పీటమీద కూర్చోగానే అక్కయ్య, ఎంతో ఖంగారుపడి పోతుంది. తొందర తొందరగా ఆ కుంపట్లమీదివి దించేసి, చేతులు కడుక్కుని ఆ చీరె కుచ్చెళ్ళ పైకి దోపుకుంటూ, ముఖంమీది ముంగురుల్ని వెనక్కయినా తీసుకోకుండా, గబగబా ఆ వంట ఇల్లు చిమ్మేసి, వడ్డన మొదలుపెట్టే సరికి, ముఖమంతా చెమటపట్టి, ఎంతో అలిసిపోయిందానిలా కనిపిస్తుంది. వడ్డన పూర్తయాక విసురుతూ ఎదురుగా నిల్చుంటుంది. బావ వంచిన తల ఎత్తకుండానే భోజనం ప్రారంభిస్తారు. ఇంక చూడాలి అక్కయ్య ఆదుర్దా. ''కూరలో ఉప్పూ కారం సరిపోయిందా'' అంటుంది అక్కయ్య.

''ఆ. నా మొహంలా ఉంది. కారం మండిపోతుంది. ఈ అన్నం ఇట్లా మెత్తనయిందేం'' అంటారు బావ, కనుబొమలు చిట్లించి, ముద్ద నోట్లో పెట్టుకుంటూ.

''కూర మాడుతుందేమోనని కలబెడుతూ ఉండేసరికి అన్నం కొంచెం మెత్తనయింది. అక్కడికీను'' అంటుంది. అక్కయ్య, ఇంక పూరుకుంటే మంచిదని అక్కయ్య పూరుకోదు. పులుసో, చారో, వడ్డించి ''ఉల్లిపాయలు ఉడికినయ్యా ముల్లక్కాడలు చేదుగా లేవుకదా'' అంటుంది. ''ఆ. పుల్లగా నీ మొహంలా ఉంది'' అంటారు బావ. బావ అట్లా అంటారని తెలిసి కూడా అక్కయ్య అడక్కమానదు. అడిగిందికదా సరైన సమాధానం చెప్పుదామనే ఉద్దేశ్యం బావకూ ఉండదు. బావ కాలేజీకి వెళ్ళాక తను భోజనం ముగించి, వంటిల్లు సర్దుకుని వచ్చేటప్పటికి పన్నెండవుతుంది. ఇంక ఆ గదిలో పడుకుని ఒకటే ఆలోచన. ఆ ఆలోచనలకు అంతులేదు. జీవిత ఘట్టాలన్నీ సినిమా రీలులా తిరిగిపోతయ్యట. కాసేపు రేడియో, కాసేపు పుస్తకాలు. అదిలేకపోతే నిద్ర, మధ్యాహ్నంపూట బావ ఇంటికి రారు కాఫీకి. ఏ మూడు గంటలకో కాచుకుని అక్కయ్య కాఫీ తాగుతుంది. మళ్ళా సాయంత్రం పనిమనిషి రాగానే ఇంటిపని మొదలు. తరువాత సాయంత్రం వంట.

ఈ రకంగా చూస్తుంటే మొదటి నాలుగయిదు రోజుల్లోనే వాళ్ళ జీవితాలు కొంతవరకూ అర్థంచేసుకున్నాను. ఒక రోజున అక్కయ్యను అడిగాను.

''అక్కా నీ కాపురాన్ని ఇప్పుడు నేను సరిగా అర్థంచేసుకున్నా'' అన్నాను.

''ఎట్లా ఉందేం'' నవ్వుతూ అడింగింది అక్కయ్య.

''దివ్యంగా ఉంది. ఎంతో ఆదర్శవంతమైన కాపురం. చూడ ముచ్చటగా ఉంది. ఇంక నీకు లోటేమిటే జానకీ'' అన్నాను.

''ఏదో లేవే. నా జీవితం ఇట్లాగే వెళ్ళిపోతుంది. ఎట్లాగయినా నీ అంత తెలివితేటలు నాకు లేవే. ఇంతవున్నా, అన్న వస్త్రాలకు ఏ లోటులేక పోయినా ఏ రోజూ దిగులు కూడే'' అన్నది అక్కయ్య నిరాశగా.

అక్కా, కష్టపడుతున్న వాళ్ళెప్పుడూ తమ కష్టాలను ఏకరువు పెట్టుకుంటేనే కాలంగడిపేస్తే ఆ కష్టాలనుంచి గట్టెక్కే మార్గం ఆలోచించుకో వద్దా. నా జీవితం ఇట్లా అయింది కదాని, దిగాలుపడి, దిగులుపడి కూర్చుంటే, ఆ వచ్చిన ఇబ్బందులూ, కష్టాలూ వాటంతటవే పోతయ్యా'' అన్నాను.

''నువ్వు చెప్పింది నిజమే. మీ బావ మనస్తత్వం కొంతవరకయినా నువ్వు అర్థంచేసుకున్నావుగా. వారికి ఎట్లా నచ్చ చెప్పాలో పోనీ నువ్వే ఆలోచించి చెప్పు. రెండు చేతులూ కలిస్తేనే చప్పట్లు. వారన్నారని నేనూ నోరు పారేసుకుంటే, సర్వనాశనం ఆలోచించి చూడు. నా పొందంలేనే వారికి గిట్టంది, నేను విచారపడక చేసేదేముంది'' అన్నది. అక్కయ్య.

''జానకీ ఎదుటి వారికి తగినట్టు మనం నడుచుకోవాలి. నువ్వు



'మన ఆఫీసులో ఖాళీబడ్డ గుమాస్తా ఉద్యోగానికి వచ్చిన దరఖాస్తులు సార్.'

'ఆహా! అలాగా! ఇవన్నీ పరిశీలించను యింకో గుమాస్తా కావాలని వెంటనే ప్రకటించండి.'

సరస్వతిదేవి పుత్రికవు. లక్ష్మీదేవి కోడలివి. కాని పార్వతీదేవి ప్రభావం నీతో ఏమాత్రమూ లేదు.

"జానకీ! అందరి జీవితాలూ వడ్డించిన విస్తరిలాంటివి కాదే. ఉన్న విస్తరికే చిల్లులులేకుండా చూసుకుని మనం వండుకున్న పదార్థాలను చక్కగా వడ్డించుకుని ఆప్యాయంగా తినాలి. అంతేగాని ఆ విస్తరికి చిల్లులున్నవి కనక, నేనసలు భోజనమే చెయ్యలేనంటే అందులో అర్థమేముంది చెప్పవే" అన్నాను.

నా మాటలు విని అక్కయ్య ఆవేశ పడ్డది. పొడారిన గొంతుతో "అయితే మీ బావగారి మాదిరే నువ్వూ నన్ను అపార్థం చేసుకుంటున్నావా సీతా, తప్పంతా నాదేనంటావా" అన్నది ఆదుర్దాగా.

"అది కాదే. నిన్ను నేను అవమానించటం లేదే. బావకు నువ్వు నచ్చచెప్పే ప్రయత్నం గట్టిగా చెయ్యలేదు. నీ మౌనమూ, మొండితనమూ బావ అనుమానాలను దృఢతరం చేసినయ్యి, ఆ అనుమానం చిన్న మావయ్య మీదికి పోయింది. పోనీ చిన్న మావయ్య బ్రతికుంటే ఎంత త్యాగాని కయినా సిద్ధపడి, ఎన్నిసార్లయినా బావచుట్టూ తిరిగి ఎంతో నచ్చచెప్పి బావ మనస్సులోని అనుమానం నివృత్తి చేసేవాడు. కాని నీ దురదృష్టం కొద్దీ చిన్న మావయ్య మన లోకంలో లేడు. అది నీ దురదృష్టమే. నువ్వు బావ అనుమానాలను ఇంకా దృఢతరం చేసినయ్యి" అన్నాను.

"పోనీ, నీ సలహా ప్రకారమే నడుచుకుంటాను ఏం చెయ్యమంటావో చెప్పు." అన్నది అక్కయ్య.

ఇంతవరకూ చెప్పి సీత కళ్ళుతుడుచుకున్నది.

"అదేమిటి సీతా, ఇంతలోనే అంత దిగాలు పడిపోయావేం" అన్నది రాధ.

"ఏముందే రాధా. అక్కయ్య జీవితం తల్చుకుంటే ఏడుపు కాక మరేముంది. నాకీ మగవాళ్ల మీద నమ్మకమనేది పోవటానికి కారణం అక్కయ్య కాపురమే. అందరి కాపురాలూ ఇట్లా ఉండవనుకో. కాని అక్కయ్య జీవితం తల్చుకుంటే నాకు మగవాళ్ళ మీద నమ్మకం పూర్తిగా పోయింది" అన్నది సీత.

ఈ మాటలకు రాధ నవ్వింది.

"అయితే నేను పెళ్ళి చేసుకోవటం తప్పనే అంటావా సీతా" అన్నది రాధ.

"తప్పనను. అయినా నీ భర్త కూడా డాక్టరు కనుక మీ ఇద్దరి జీవితాలూ సాఫీగానే నెళతయ్యి. ఎవరి బ్రతుకు వారు బ్రతగ్గలరు. ఇద్దరి జీవితాలూ మానవసేవకే అంకితమయినయ్యి. కనుక నువ్వు డాక్టరుగానే గాక, ఆదర్శ గృహిణిగా కూడా రాణించ గలవు. నువ్వు చాలా అదృష్టవంతురాలివే" అన్నది సీత.

"మరి నువ్వు గృహిణిగా నీ జీవితాన్ని పరిదిద్దుకోలేవా సీతా, నిన్ను చేసుకోటానికి ఎంతో మంది సిద్ధంగా ఉన్నారు. కాని నువ్వే వెనకాడుతున్నావు" అన్నది రాధ.

"చెపుతున్నానుగా. అక్కయ్య జీవిత చరిత్ర పూర్తిగా వింటుంటే నేనీ అభిప్రాయానికి ఎందుకు వచ్చానో నువ్వే గ్రహిస్తావు" అన్నది సీత.

"సరే కాని, పూర్తిగా చెప్పుమరి. ఏ విషయమూ ఏ సంఘటనా మర్చిపోకుండా అంతా చెప్పు వింటాను" అన్నది రాధ.

77 వ పేజీ చూడండి

# అతని ప్రేమకథ



వినాయకరావ్

నారాయణ రావుగారి షష్ఠి పూర్తి మహోత్సవం ముగిసింది! మహోఘనంగా ముగిసింది! వచ్చిబంధుకోటి ఆయనగారి వైభవాన్ని పొడిగి పొడిగి మరీ వెళ్లారు. మహోత్సవం తాలూకు సందడి నాలుగు రోజులగ్గాని తగ్గలేదు. ఇప్పుడు ఆ ఇంట్లో ఉన్నది కేవలం నారాయణరావుగారి ఆత్మీయుల్లే.

ఈ కథ వారింటో జరిగింది!

వారిల్లు లంకంత ఉంటుంది. అది అధునాతనంగా నిర్మింపబడ్డ అందమైన భవంతి. వూరికి చాలా దూరంగా కావాలని కట్టించేరు. ఆ ఇంటికి కాస్త దూరంలో నాలుగెకరాల మామిడితోట ఉన్నది. ఆ తోటలో ఓ మూలగా పూల మొక్కలు నాటింపించేరు. నారాయణరావు గారికి ఆ మొక్కలంటే వల్లమాలిన అభిమానం. సాయంత్రం పూట ఆ మొక్కల మధ్య పేముకుర్చీ మీద కూర్చుని ఆకాశం వైపు చూడటం ఆయనకో సరదా.

ఆ ఇంట్లో జరిగిన ఈ కథ నారాయణరావు గారి సంతానానికి సంబంధించింది!

ఆయనకి నలుగురు ఆడపిల్లలూ, ఇద్దరు మొగపిల్లలూను. అందరికీ పెళ్ళిళ్ళయ్యాయి, చిన్నబ్బాయిని మినహాయించి. చిన్నబ్బాయి మీద అందరికీ జాలి. అతను బి. ఎ. లో ఆగిపోయి సాధారణ మైన ఉద్యోగం చేస్తోన్న కుర్రవాడు. అతని చదువూ, అతని ఉద్యోగమూ ఇలా తగులడినందుకు నారాయణరావుగారు చింతించే మాట నిజం. అదంతా చిన్నబ్బాయే తన చేతులారా చేసుకున్నదని ఆయన ఉద్దేశం.

చిన్నబ్బాయి పేరు శ్యామలరావ్. అతను వాళ్ళ నాన్నగారిలా చాలా భారీ మనిషి. చక్కటి అంగ సౌష్టవం గల అందమైన కుర్రాడు. శ్యామలరావ్‌ని అదృష్టం చిన్న చూపు చూచిందని అతనెప్పుడూ అనుకోడు. ఏది జరిగినా తన మంచికే అనే బాపతు మనిషి.

అతను సీతను ప్రేమించాడన్నది నాలుగేళ్ళ క్రితమే నిర్ణయమైంది. పెళ్ళంటూ జరుగుతే సీతతోనే జరగాలనేది అతని లక్ష్యం. సీత అతని ప్రాణం.

సీత అని చెప్పబడే పద్దెనిమిదేళ్ళ ఆడపిల్ల శ్యామలరావ్ రెండో అక్కయ్య కూతురు. ప్రస్తుతం అక్కయ్య వాళ్ళూళ్ళో బియస్సీ చదువుతోంది.

పాత్రపరిచయం ముగిసింది గనక కథ ప్రారంభం.

* * *

—మహోత్సవం ముగిసిన అయిదోనాటి ఉదయం పది గంటల వేళ ఓ గదిలో శ్యామలరావ్‌కి వైద్యం గురించి వివరిస్తున్న వాడు అతని అల్లుడూ మరియూ కాబోయే బావమరదైన సత్యం. సత్యం వైద్య విద్యార్థి. అవుతే అంత మాత్రం కనిపించిన ప్రతి పెద్దమనిషినీ 'బోర్'తో చంపేయా లన్న కోరిక సహించరానిది.

"...కాబట్టి అప్పటికీ ఇప్పటికీ గల మార్పుని గ్రహించే వుంటావ్. ఆ రోజుల్లో మనిషిని పడుకోబెట్టి వాడి కళ్ళముందరే తళతళతళా మెరిసే కత్తితో వాడి శరీరాన్ని పరపరా కోసి పారేసే వాళ్ళు. ఈ నాడు అలాకాదు. వైద్యం ముందంజ వేసింది. బ్రహ్మాండమైన అభివృద్ధిని సాధించింది. మంగలి షాపులో ఫాన్‌కింద కూర్చుని మంగలాడి చేత గడ్డం గీయించుకున్నంత సులువుగా, మెత్తగా, హాయిగా మేజర్ ఆపరేషన్లు చేసేస్తున్నారు. ఎంత పెద్ద వ్యాధినైనా నయంచేసి పారేస్తూ న్నారు ఉదాహరణకి కేన్సర్ తీసుకుందాం. నువ్వు కేన్సర్ వ్యాధితో—"

"ఒరే సత్యం ! కొంచెం ఆపరా" శ్యామలరావ్ విసుక్కున్నాడు.

సత్యం దెబ్బతిన్నాడు. నోరు చప్పున మూశాడు. శ్యామలరావ్ సిగరెట్టు ముట్టించి ఏదో చెప్ప బోయాడు. కాని సత్యం మాట అడ్డుపడింది.

"కేన్సర్ వ్యాధి రావడానికి ఒక కారణం హెవీ చెయిన్ స్మోకింగ్"

"అవునట"

"మరెందుకు కాలుస్తావ్."

"ఖర్మ"

"ఇదీ ఒక విధమైన వ్యాధే. శారీరకంగా వచ్చే వ్యాధులూ, మానసికంగా కుమిలి పోయే వ్యాధులూ అని రెండు రకాలు. రెండో రకమైన వ్యాధి నయం గడానికి కొంచెం ఇబ్బంది పడాలి. ఉదాహరణకి ప్రేమని తీసుకుందాం. ప్రేమ అనేది ముగ్ధ రంగులో. . . . ."

సత్యం ప్రేమగురించి ఏం చెబుతున్నాడో వినాలనిపించలేదు శ్యామలరావ్‌కి. ప్రేమ మాట వినగానే అతనికి సీత గుర్తుకొచ్చింది. సీత గుర్తు కొచ్చినప్పుడు అతనేమీ పట్టించుకోడు. కేవలం సీతరూపాన్నే ధ్యానిస్తూ కూర్చుంటాడు.

ఈ నాలుగు రోజుల్లోనూ సీత కనిపించింది చాలా తక్కువసార్లు. అయినా మాటాడలేదు. కనీసం 'కులాసానా' అన్నైనా పరామర్శించలేదు. సీత బొత్తిగా మారి పోయింది. బాగా మారి పోయింది. మునుపటి సీతకాదు. ఈ మార్పెందుకు వచ్చిందో అర్థం కావడం లేదు. శ్యామలరావ్ బాధగా నిట్టూర్చాడు. తల దించుకుని చేతుల్తో గట్టిగా అదిమేడు.

"...కేన్సర్ వ్యాధితో బాధపడే జనసంఖ్య రోజు రోజుకీ ఎక్కువై పోతోంది. దీన్ని అరికట్టాలి. అసలు చావునే జయించాలి. మనిషి మృత్యుంజయుడని నిరూపించాలి."

"నీ బొంద ! నీ తరం కాదుగదా నీ ముని మనవడి తరమూ కాదు."

శ్యామలరావ్ మాటకి సత్యం సిగ్గుపడిపోయాడు.

"చూస్తూండు నే చెప్పింది నిజం కాకపోదులే!" సత్యం నిష్ఠూరంగా అనేశాడు.

"చూద్దాం. ఈ లోగా నన్ను కాసేపు ఒంటరిగా ఉండనివ్వు. వెళ్ళు"

"బోర్ కొడుతున్నానా ?"

"మరే. భరించలేక పోతున్నాను."

"అనువుగానిచోట నే నసలు నోరెత్తనే కూడదు." సత్యం లేచి నిలబడి అన్నాడు.

"ఆలస్యమైనా మంచి మాట అన్నావ్"

"హూ.. వస్తా." అని కోపంగా వెళ్ళి పోయాడు సత్యం.

శ్యామలరావ్ మెల్లిగా నవ్వుకున్నాడు. గది గుమ్మం దగ్గరికొచ్చి నిలబడ్డాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. జనాభా ఏం చేస్తున్నారో ఏమో. ఒక్కమాటు సీతని పలుకరించాలి. సెలవు రెండు రోజులుంది. తర్వాత ఆఫీసూ, ఆ వాతావరణం, శ్యామలరావ్‌కి దిగులనిపించింది.

అతను వాళ్ళూరికి డెబ్బై మైళ్ళ దూరంలో ఉద్యోగం చేస్తున్నాడు. సీతవాళ్ళు వస్తున్నారని తెలిగానే నాన్నగారి షష్ఠిపూర్తి మహోత్సవాన్ని ఘనంగా శ్లాఘించేడు. ఇలాంటిది సంవత్సరానికి అరడజను తడవలైనా వస్తే బాగుంటుందనీ అనిపించింది. సెలవు పెట్టి రెక్కలు కట్టుకు ఇంటికి వచ్చాడు. వచ్చిన లగాయితూ ఇప్పటి వరకూ సీతతో మాట్లాడటానికి నోచుకోలేదసలు. ఖర్మ కాపోతే ఏమిటిది ?

ఊహించినదంతా తలక్రిందులౌతుంటే అతనెలా సహించ గలడు. ఎలా ? సీతా ! .... కనికరించు. పలుకరించు సీతా ! . . . . .

చిరంజీవి శీను గంతులేసుకుంటూ రావడం చూశాడు శ్యామలరావ్. శీను, అన్నగారబ్బాయ్. ఉత్త పెంకి ఘటం. వాడికున్నంత స్వేచ్ఛ, చొరవా ఈ ఇంట్లో తనకి లేదు.

"శీనూ ! .... ' శ్యామలరావ్ ఆ కుర్రాడ్ని పిలిచాడు. శీను ఆగిపోయాడు. నిశ్చింతగా వాళ్ళ బాబాయిని పరీక్షించేడు. మెల్లిగా అడిగేడు.

"సీతమ్మ కనిపించలేదా బాబాయ్ !"

బాబాయ్ తలూపాడు దిగులుగా.

"కనిపించమని చెప్పానే." అన్నాడు వాడు.

"పోనీలే.... ఇప్పుడెక్కడుందో చెప్పూ."

"అదిగో ఆ గదిలో."

"ఏం చేస్తోంది ?"

"ఏం చేస్తున్నావని అడిగితే ఇంగ్లీషులో నాన్‌సెన్స్ అని కోప్పడి బైటకి పొమ్మంది. హు..... నీ గురించే గదా ఇదంతా." అన్నాడు ఒక చేత్తో ముక్కు తుడుచుకుంటూ.

"శీనూ . . . . . ."

"వింటున్నాన్లే."

"నేనో మాట చెప్తాగాని ఆమాట సీతతో చెప్తావా ?"

"చెప్తాన్లే. నాకవతల బోల్డంత పనుంది. తాతయ్య నాకు కొత్త చెప్పులు కొంటానన్నారు. కొన్నారేమో కనుక్కోవాలి" అన్నాడు శీను.

"చూడ్రా శీనూ..... నువ్వు నాలుగో తరగతి చదువుతున్నావా ? నీకు పెన్ను కావాలి గదా. ఈ పని చేసిపెట్టావంటే సరికొత్త పెన్ను కొని పెడతా."

"వద్దులే. అది తాతయ్యనే అడిగేస్తాను."

"మా నాన్నవి కదు ! బాబాయి మాట విన వురా !"

"సీతమ్మతో నేను మాటాడను. అంతే."

"పోని నువ్వు మాట్లాడొద్దులే. ఒక పని చెయ్యి చాలు."

"ఏమిటది."

శ్యామలరావ్ ఓ కాగితం ముక్క మీద రెండు మాటలు వ్రాసి శీను కిచ్చాడు.

"ఇది సీతకి కనిపించేలా గదిలో విసిరేయ్."

"మరి . . . . . మరి . . . . ".

"నువ్వీ పని చేసిపెట్టు. రేపు నీకు పెన్ను కొనిస్తాను."

"సరే . . . . ."

"శీనూ ఈ సంగతి ఎవ్వరికీ చెప్పకు."

"తాతయ్యతో కూడానా ?"

"అయ్యో బాబోయ్ . . . వద్దురా !"

"ఓ. యస్..... అలాగే."

శీను గంతులేసుకుంటూ సీత గది వేపు వెళ్ళడం చూచి మెల్లిగా తన గదిలోకి వచ్చి కూర్చున్నాడు శ్యామలరావ్.

ఈవేళ ఎలాగైనా సీతతో మాటాడేయాలి. ఎన్నో సంగతులు, గుండెల్లో దాచుకున్నవీ, కలల్లో తిరుగుతున్నవి — ఎన్నో అడగాలి. ఎన్నింటికో సమాధానం రాబట్టుకోవాలి. తప్పదు. అది ఈ రోజే జరగాలి. తప్పని సరిగా జరిగి తీరాలి.

* * *

సీతా,

ఒక అందమైన అమ్మాయిని నా మనసులో దాచుకున్నాను. ఆ అమ్మాయి పేరు సీత. ఆఅమ్మాయితో చాలా మాటాడాలని వుంది. అది ఈ





## అతని ప్రేమ కథ

ఇంట్లో ఇందరి మధ్య కుదర్దు. ఈ సాయంత్రం మామిడి తోటలో ఆ అమ్మాయి కోసం ఎదురు చూస్తాను. ఆమె వస్తే అంతకంటే అదృష్టం ఇంకేం కావాలి.

— శ్యామలరావ్.

సీత నిట్టూర్చింది. ఉత్తరాన్ని చించి ముక్కలు చేసింది. శ్యామలరావ్ అందమైన మనిషే కావచ్చు. అంత అందమైన మనిషిలో అంత నీచం ఎలా దాక్కుంది. నమ్మ కూడదు. అసలెవర్నీ నమ్మ కూడదు.

ఎంత ధైర్యంగా ఉత్తరం వ్రాయ గలిగేడు. వాళ్లింటికి వచ్చామనేగా ఇంత అలుసు. చెబితే విన్నారు కాదు అమ్మా నాన్నాను. ఒక్కర్తివీ ఎలా వుంటావ్. అందునా ఈ సమయంలో నువ్వు రాలే దని తెలిస్తే ఆయనకెలా వుంటుంది ? తప్పు కదూ అన్నారు.

వీళ్లకేం తెలీదు. తాతయ్య షష్ఠిపూర్తి చేసు కుంటున్నారంటే తనకి మాత్రం పండుగ కదూ. కానీ, అక్కడ శ్యామలరావ్‌నెలా తప్పించుకు తిర గాలి ? ఇదీ ప్రశ్న. సమాధానం రాబట్టుకోక ముందే అమ్మా వాళ్లతో ప్రయాణం కావాల్సి వచ్చింది.

నాలుగు రోజులూ అతి కష్టం మీద గడిచేయి. ఈ వేళ . . . . . ఉత్తరం. రేపు బెదిరింపు. ఎవ రిచ్చారీ చనువు ? అమ్మే కదూ. అవును అంతా అమ్మే చేస్తోంది. తమ్ముడన్న అభిమానం కొద్దీ, అతని మాయలో పడి పోయింది అమ్మ.

వీళ్లందరికీ బుద్ధి చెప్పాలి.

— తన ఆలోచనలకి తనే భ్రమపడి పోయింది సీత. ఏమిటిది ? ఇంత ఘోరంగా ఆలోచించడం తప్పు కదూ ? ఎవర్ని తను దూషిస్తు ? ఎవర్ని తను అనుమానిస్తు ?

సీత ఆవేదనతో కదిలి పోయింది. తనమీద తనకే విసుగు కలిగింది. కోపంతో వణికి పోయింది. మళ్లా అంతలోనే ఆలోచనలు మొదటికొచ్చేయి.

'మనుష్యు లెందుకింత త్వరగా మారిపోతారు' అనుకున్నది సీత. తలుచుకుంటూంటే వళ్లు మండు కొస్తోంది. మూడేళ్ల క్రింద శ్యామలరావ్ చాలా మంచివాడనీ సీత అభిప్రాయం. ఆ అభిప్రాయం రానురానూ వికృత రూపం దాల్చు కుంటోంది.

ఇంతా తెలిసిన తర్వాత అతను మంచివాడని తానెల్లా అనుకుంటుంది ? చాలా జ్ఞాపకానికున్నాయి. శ్యామలరావ్ వ్రాసే కథల గురించి తను చాలా మందితో చెప్పుకుంది. ఫలానా అతను నాకు ఫలానా అని గర్వంగా చెప్పుకునేది. విన్నవాళ్లలో చాలామంది అసూయ గూడా చెందేరు.

ఆదివారం నాడు వనజ తనకి 'కంగ్రాట్స్' చెప్పింది. శ్యామలరావ్ రాసిన ఓ రచనకి ప్రథమ బహుమతి రావడం, అతని ఫోటో పత్రికలో అచ్చు కావడం జరిగాయి. అందమైన శ్యామలరావ్ ఫోటోలో ఇంకా అందంగా వున్నాడు.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివోయ్ సీతా!" అన్నది వనజ.

గర్వించిన ఘట్టాలు చాలా కొద్ది. ఆకొద్దీ శ్యామలరావ్ గురించే గర్వించింది తను.

సీత కళ్ళ నీళ్లతో నిండాయి.

ఎన్నో బంగారు కలలు, ఏవో అందమైన ఊహాగానాలు — శ్యామలరావ్ కథలో ఇంత మలుపున్నదని తెలీదు. ముందే తెలుస్తే మనపసబడే గుర్రానికి కళ్లెం వేసి అదుపులో పెట్టుకునేది.

ఓనాడు తనకి కంగ్రాట్స్ చెప్పిన వనజ మరో నాడు ఈదారుణమైన వార్త నంద జేసింది. ఆరోజు నుంచే మనసులో కొండంత వెలితి. కేవలం "నువ్వు క్షమిస్తానంటే నీకో విషయం చెప్పక తప్పదు. వింటావా సీతా !" అన్నది వనజ.

ఏమి వినవలసి వస్తుందోనని కలవర పడుతూనే తలూపింది సీత.

కమల మాదూరబ్బంధువుల పిల్ల. మీ శ్యామలరావ్ గారితోఁ చదువుకుంది. ఈరోజు అది నాకో ఉత్తరం రాసింది. చదువుతావా ?"

జవాబు చెప్పకుండానే ఉత్తరం లాక్కుంది తను. బాధ పెట్టిన నాలుగు మాటలూ బాగా జ్ఞాపకాని కున్నాయి.

" శ్యామలరావ్‌ని తెగ పొగుడుతూ రాశావ్. నవ్వొచ్చింది నాకు. అతను నువ్వు వూహించినంత గొప్ప మనిషి కాడు. కేవలం రోడ్ రోమియో అతనికి రెండు జెడల జూలియట్ వుంది. ఆ అమ్మాయి పేరు రమ. కాలేజీలో చాలా అభాసు చెందేడు. మతిచెడి కథలు వ్రాయడం మొదలు పెట్టాడు. అతని గొప్పతనం మాకు తెలుసు. కథలు వ్రాసే వాళ్లంతా మహానుభావులని తలిచే ఓవెర్రి — శ్యామలరావ్ గురించి మళ్ళా వ్రాశావంటే నాకు వళ్లుమండి పోగలదు."

ఉత్తరం చదివిన సీత చేతులు వణికాయి. ఇంటికొచ్చి చాలాసేపు ఏడ్చింది. ఆరోజు లగాయితూ అతను గుర్తు కొచ్చినప్పుడల్లా ఏడుపూసె వుంది. నాన్న, అమ్మ, అన్నయ్య — అందరూ గౌరవించే శ్యామలరావ్ రెండేళ్ల క్రితం ఆడపిల్లల పాలిట యముడు. వాళ్లని నీడలా వెంబడించే 'బాడీ గార్డు' వాళ్లందరిచేత 'ఛీ' కొట్టించుకున్న . . . . . . . .

వద్దు. నాకు శ్యామలరావ్ ఏమీ కాడు. అంతే అంతే ఏమీకాడు.

వనజ తెలివైన పిల్ల గనక, మీదుమిక్కిలి తనంటే అపరిమితమైన అభిమానమంది గనక ఈ 'రహస్యం' ఎవ్వరికీ చెప్పలేదు. చెప్పివుంటే నేస్తురాళ్ల ముందు తలెత్తుకు తిరగ్గల ధీమా ఇంకెక్కడిది ? అతను నాకేమీ కాడని చెప్పినా వినిపించుకుంటారా వాళ్ళు !

'భగవంతుడా' అనుకుంది సీత.

* * *

మామిడి చెట్టు నీడలో అతను పెళ్లికిలా పడుక్కున్నాడు. సిగరెట్టు కలుస్తూ సీతకోసం ఎదురు చూస్తున్నాడు. మనసులో ఆరాటం దాచుకోడం దుస్సాధ్యంగా ఉంది. తడవతడవకీ వాచీ చూచుకుంటున్నాడు. ఇంకా సీత రాలేదు.

సీత రాదా ? ఎందుకు రాదు ? సిగ్గా ? కోపమా? నిర్లక్ష్యమా ? ఏమిటి ? సీతకేమైంది ? నవ్వుతూ నవ్విస్తూ మాటాడే సీత ఇంత ముభావంగా ఉండటంలో అర్థమేమిటి ?

వద్దనుకున్న కొద్దీ ఆరాటడి ఎక్కువైపోతోంది. కాదనుకున్న కొద్దీ మనసు ఇష్టం లేని దానిని వూహిస్తోంది. భరించడం కష్టం.

అతను పాట పాడటం మొదలెట్టాడు. పాటతో కొంత బాధని మరిచి పోవచ్చునట.

'చల్లగాలిలో యమునా తటిపై
శ్యామసుందర నీ మురళి !'

కొంత వరకూ పోసిన పాట అకస్మాత్తుగా ఆగిపోడాని క్కారణం సీత ఆగమనం. ఆమె వచ్చి ఎంత సేపైందో గాని వెనక్కి తిరిగి చూచినప్పుడు ఆమె చెట్టుకానుకుని నించుంది. అతను కళ్లలో ఆనందం నింపుకుని అడిగేడు.

"వచ్చావా సీతా ?"

".... .... ...."

"రా.... ఇలా కూర్చో."

".... .... .... ...." సీత అతని వైపు చూచింది.

"సారీ సీతా ! ఈ సిగరెట్టు అలవాటు మానుకోలేక పోతున్నాను." సిగరెట్టు ఆర్పి పారేశాడు. లేచి నించున్నాడు.

"నువ్వొస్తావో రావోనని చాలా సేపట్నుంచి ఎదురు చూస్తున్నాను. ఏం తోచక పాట పాడేను. నువ్వొచ్చావ్. చాలా సంతోషం.

".... .... .... ...."

"సీతా ! నేను నీతో చాలా మాటాడాలి. మాటాడనా ?"

"వద్దు."

"సీతా.." అతను ఆశ్చర్యపోయాడు.

"ఎందుకిలా మారిపోయావు సీతా ! చెప్పు."

"ఉత్తరాలు వ్రాయడం పెద్దమనుష్యుల లంపో కాదు."

అతను మెల్లిగా నవ్వాడు—

"నీ దగ్గర పెద్దరికం యిందుకులేవీలా! కానీ.. పలుకరించిన పలక్కపోవడం నీలాటి చదువుకున్న అమ్మాయికి తగదు."

"నాకు అన్నీ తెలుసు. హెచ్చరించక్కర్లేదు." రోషంగా అనేసింది.

"పోనీలే సీతా ! ఉత్తరం వ్రాయడం నా పొరపాటే. క్షమించు. రా. అలా నడిచొద్దాం."

"రాను."

"ఏం."

"అంతే"

"నేనంటే కోపమా ."

"అంతే కాదు. మాయ మాటలు చెప్పేవాళ్ళంటే అసహ్యం కూడాను."

"నీతో ఎప్పుడు చెప్పాను."

"చెప్పలేదు. తెలిసింది. రమని మీరు వలచి పోయారా?"

"రమ !"

"అవును. రమ. రెండు జడల ఆడపిల్ల."

"ఆవిడా ? నాకు బాగా తెలుసు మా క్లాసుమేటు. అవును గానీ ఆవిడ నీకెలా తెలుసు?"

"చాలా తెలుసు. ఆడ పిల్లల్ని అల్లరిపెట్టే వాళ్ల జాతకాలు ఊసూరా తెలుస్తాయన్నది ఆశ్చర్యమేమీకాదు. ఇప్పటికైనా నన్ను వెచ్చ గొట్టకుండా ఉంటే అదే పదివేలు ! నమస్కారం." సీత విసవిసా వెళ్లిపోయింది.

శ్యామలరావ్ నిట్టూర్చాడు. సీతా ! నీ కోపానికి కారణం తెలిసింది. నన్ను అపార్థం చేసుకున్నావ్.

78 వ పేజీ చూడండి

## అనువుగాని చోట తెలుగైన మోటు

మద్రాసొచ్చిన ప్రతివాడూ మాట్లాడాలి తమిళం
మాకు రాదంటే చేస్తారు మనల్ని వేళాకోళం
తెలుగులో ఏదైనా కావాలని నువ్వడుగు
తెప్పినా మాట్లాడడు తమిళం తప్ప తెలుగు !

సెంట్రల్ స్టేషన్‌లో దిగ్గానే మనం
సెన్సిటివ్‌గా ఉండాలి అనుక్షణం
అనుసరిస్తాడు అవస్యం పిక్‌పాకెట్
ఆదమరిస్తే క్షణంలో పాకెట్ కట్ !

మవుంట్‌రోడ్ కెళ్లాలంటే మోటార్ డ్రైవర్
మళ్లిస్తాడు వాహనాన్ని వయా పారిస్ కార్నర్
అక్కణ్నుంచి పోనిస్తాడు ఎజ్ కార్నర్
జపైన తీసికెళ్లి చూపిస్తాడు మీటర్ !

హొటల్‌కెళ్లి కావాలంటే హాట్
హృదయపూర్వకంగా చేస్తాడు టూ లేట్
తీరా తెచ్చింది చవిచూస్తే ఉండదు టేస్ట్
తెస్తాడది కావాలనే మనకి వేస్ట్ !

ఫలానా చోటికి పోవాలంటే దారి
పక్కు తమిళంలో అడిగితే సరేసరి
తెలుగులో అడిగావో నోరుజారి
తెలీదంటూ తగలేస్తాడు సారీ !

[మద్రాస్‌కే అంకితం —మాధవ్]




సదా గగనయానం చేసే నారద మునీంద్రుల వారు ఆకాశంలో పయనిస్తూ క్రిందికి ఒకసారి చూశారట. అప్పుడాయనకు కన్పించినది, తన అరుగుమీద నిల్చుని, ఒక చేతిలో చేతికర్రతో, మరొక చేతిలో పంచాంగంతో, శుద్ధ వైదిక వేషంలో పంచే పోణి వేసుకుని, మెడలో రుద్రాక్ష మాలా, నుదుట కొట్టవచ్చినట్లు కన్పించే విభూతి కుంకంబొట్టుతో, పెరిగిన గడ్డంతో, పిలకతో, సన్నగా, పొట్టిగా ఉన్న మూప్ఫై ఐ అయిదేళ్ల బుచ్చి శాస్త్రి—సరిగ్గా ప్రయాణ మవబోతున్న దృశ్యం! అతనిని చూసి, నారదులవారు, "అమ్మయ్య! నేను భూలోకం వెళ్లలేదని దిగులు లేదు. నా ప్రియశిష్యుడు బుచ్చిశాస్త్రి నాకు మనసారా తృప్తి కలిగిస్తున్నాడు. ఇప్పు డతను వెళ్తున్న కార్యం చక్కగా నిర్వహింపబడుగాక!" అని ఆశీర్వదించారట.

ఆ విషయం తెలియని బుచ్చిశాస్త్రి కొంచెం దిగులుగా, "వెళ్తున్నా! తలుపు వేసుకో" అని ఆఖరిసారి భార్యను హెచ్చరించి, శకునం విమర్శించి చూసుకుని తన గుమ్మం దిగి నడవ నారంభించారు. ఆయన పౌరోహితుడనీ, ఆయన ఇల్లు ఆ పట్టణంలోనే ఒక టలో ఉందనీ, ప్రస్తుతం దగ్గరలో ఉన్న ఒక గ్రామానికి అత్యవసర కార్యంమీద వెళ్తున్నారనీ చెప్పడం అప్రస్తుతం కాదు. అయినా నారదులవారిని హర్షింపజేసిన విషయ మేమిటంటే బుచ్చిశాస్త్రి వెళ్తున్నది సింగిపురంలోని పంతులుగారింటికి. ఆ పంతులుగారి అమ్మాయిని విజయనగరంలో ప్లీడరుగారైన హనుమయ్యగారి మూడో అబ్బాయికి అయిదేళ్ల క్రితం వివాహం చేయించినప్పటి నుంచీ ఆ రెండు కుటుంబాల మధ్యా కలతలూ, కలహాలూ, వైషమ్యాలూ, పగలూ, విపరీతంగా పెరిగిపోయాయి. వియ్యంకులిద్దరికీ మధ్య వచ్చుగడ్డి వేస్తే భగ్గున మండుతుంది. హనుమయ్యగారు వియ్యంకుడిమీద కోపంకొద్దీ కొడుకూ కోడలూ అన్యోన్యంగా కాపరం చెయ్యకుండా పేచీలు పెడ్తున్నాడని—పంతులుగారి ఆరోపణ! పంతులుగారు, తన కొడుకును తననుంచి వేరుచెయ్యాలని చేస్తున్న ప్రయత్నాలు తనకు తెలుసుననీ, ఆ పప్పులు తన దగ్గర ఉడకవనీ—హనుమయ్యగారి సవాలు. వీరిద్దరి తగవులవల్లా ఆ దంపతుల కాపురంలో సుఖశాంతులు లేకుండా పోయాయి. పెళ్లి పీటలమీద హనుమయ్యగారు, కట్నం చాలదనీ, లాంఛనాలు సరిగా జరుపలేదనీ ప్రారంభించిన పేచీ, ప్రతి చిన్న విషయంలోనూ కయ్యాలతో సాగి, నలుగురి నోళ్లలో బడి, చూసేవారి కొక వింత, అనుభవించేవారి కొక నరకంగా పరిణమించింది. పంతులుగారి కూతురైన శారదకు అత్తవారిల్లు కంటకప్రాయం అయిపోయి, మామగారనే మాటలు భరించలేక, ఎందులోనైనా దూకుదా మనిపించేది. ఆమె భర్త

రఘురాం సాత్వికుడు. తండ్రిని వారించలేక, తనలో తను దిగులు పెంచుకుని, మతి పోగొట్టుకున్నాడు. అది శారదకు మరింత దుస్తర వేదనగా మారింది.

అసలు ఇన్ని పేచీలకు కారణం, పంతులుగారూ, హనుమయ్యగారే కాని, మరో విషయాలేమీ కావు, ఇద్దరూ హేమాహేమీలు. తగవులూ, డబాయింపులూ, కుయుక్తులూ, వారికి ఉగ్గుపాలతో అబ్బిన విద్యలు. వీ రిద్దరికీ దూరపు చుట్టరికం ఉన్నా, వీ రిద్దరూ వియ్యం పొందడానికి మాత్రం బుచ్చిశాస్త్రే కారణం. అసలు ఇటువంటి ఇద్దరు విశిష్టవ్యక్తులు వియ్యం పొందుతే చూడాలని అతగాడి వాంఛ !

ఎందుకంటే, మొదట హనుమయ్యగారి గురించి చెప్పుకుందాం. ఆయన విజయనగరంలో పేరు పొందిన క్రిమినల్ వకీలు. ఆస్తి బాగా సంపాదించాడు. ఆస్తికన్నా మనిషిలో డాబూ, దర్పం ఎక్కువ. మనిషి పొడుగ్గా, ఎర్రగా, జబర్దస్తీగా ఉంటాడు. ఆయన దగ్గరకు వచ్చిన క్లయింట్లు బాగా డబ్బున్నవాళ్లయి ఉండాలిగాని, సామాన్యులు లాభంలేదు. ఆయనవి విపరీతమైన ఖర్చులు. అంతా జమీందారీ ఫాయాలో ఉంటుంది సంసారం. మనిషిలో పట్టుదల హెచ్చు. అన్యాయానికీ, అక్రమానికీ, డబాయింపుకీ వెనుదియ్యడు. ఇద్దరు స్త్రీలు, విధవలై తమ అత్తింటివారు భర్తల ఆస్తిని స్వాహా చేస్తున్నారనీ, అవి తమకు దక్కేట్లు చెయ్యమని ఆయన వద్దకు వస్తే, కేసులు నడిపించి గెల్చి ఆస్తులు స్వాధీనం చేసుకోవడమే కాకుండా ఆ ఆస్తుల్ని తను కాజేసి, వాళ్లని పూర్తిగా బోడుల్ని చేసి పంపిన మహానుభావుడు. ఇంకా ఇలాంటి ఎన్నో లెక్కలేనన్ని సంఘటనలు. అయితే, ఇంత సంపాదనకూ మించిన ఖర్చు లతనికి ఉన్నాయనీ, ఆస్తితోబాటు అప్పు కూడా పెరుగుతోందని కొద్దిమందికి తెలుసు. ఆ కొద్దిమందిలో బుచ్చిశాస్త్రి ఒకడు.

ఇహ కాంతారావు పంతులుగారంటే సింగిపురంలో లక్షాధికారి. ఆ చుట్టుప్రక్కల ఉన్న భూముల్లో సగం అతనివే. కాని, పరమలోభి. వడ్డీ వ్యాపారం కూడా చేస్తూంటాడు. పిల్లికి బిచ్చం పెట్టడు.. బంధు వెవరైనా భోజనానికి వస్తే, భోంచేస్తూండగా "ఇదిగో ! ఇదే విస్తరి, హొటల్లో వేస్తే పూటకు ముప్పావలా తీసుకుంటారు. నా యిల్లు బొత్తిగా సత్రమైపోతూంది ...." అంటూ, మళ్లీ ఆ వ్యక్తి 'జన్మలో ఇక్కడికి రాకూడ'దనేటట్లు చేస్తాడు. తన క్రింద పనిచేసే గుమస్తాల్నీ, కంబార్లనీ, పీల్చి పిప్పిచేసేస్తాడు. వాళ్లకు అంతకన్నా గతిలేక పడుంటారు. సింగిపురం గ్రామంలో అందరూ అతనికి వ్యతిరేకమే. రైతుల్ని నానా దుర్భాషలూ ఆడి, ఏమాత్రం పంట వాళ్లు సరిగ్గా ఇవ్వకపోయినా కోర్టు కీడుస్తాడు. రెండు మూడు సార్లు, అర్ధరాత్రి అతన్ని ఎవరో చావగొట్టారు. అయినా అతని పద్ధతి మారలేదు. అందరితోనూ తగాదాలే. అందరిమీదా దావాలే. అతనితో వ్యవహారమంటే అందరికీ భయం. కోర్టుకి ఎంత ఖర్చయినా వెనుదియ్యకుండా ఎగబడతాడు. అవతల వాణ్ణి నాశనం చెయ్యందే వదలడు. అతని ఇంటి పౌరోహిత్యం, తాతలనాటి నుండి వస్తోంది కాబట్టి వదలలేక వెళ్లడంగాని, బుచ్చిశాస్త్రికి ఎంత మాత్రం ఇష్టంలేదు. ఎందుకంటే, పంతులుగారిచ్చే దక్షిణ, బుచ్చిశాస్త్రి బస్సు ఖర్చుకి కూడా సరిపోదు. అయినా పరువు కోసం వెళ్తూంటాడు.

ఇద్దరూ ధనవంతులు కాబట్టి, పంతులుగారి ఏకైక పుత్రికను హనుమయ్యగారి మూడో అబ్బాయికిచ్చారు. ఈ పెండ్లిసంధాన కర్త బుచ్చిశాస్త్రేను. పంతులుగారి రోగం కుదర్చాలనే ఉద్దేశంతో తార్కికి, పేచీలలోనూ, కోర్టు వ్యవహారాలలోనూ సమఉజ్జీ అయిన హనుమయ్యగారితో వియ్యం కుదిర్చాడు గాని, శారద రఘురాంల అవస్థలు చూస్తుంటే, హనుమయ్యగారు చాలా అన్యాయంగా ప్రవర్తిస్తున్నారని బుచిశాస్త్రికి అనిపించేది. తక్కిన కొడుకుల్నీ, కోడళ్లనీ ఆదరంతో చూసే హనుమయ్యగారు, శారదను నానా హింసలూ పెట్టడమే కాక, రఘురాం శారద నేమాత్రం ఆపేక్షగా చూసినా మండిపడి పోయేవారు. ఆ యింట్లో, పనిమనిషికన్నా హీనంగా పనిచేస్తూ, చిక్కి శల్యమై, మతిలేని భర్తను వదలలేక, దిగులుగా ఉండే శారదను చూస్తూంటే బుచ్చిశాస్త్రి హృదయం తరుక్కుపోయేది. ఈ పరిస్థితి కేదైనా నిష్కృతి నాలోచించా లనుకునేవాడు. హనుమయ్యగారి ఏకైక పుత్రిక మనోరమ వివాహ ప్రసక్తి వచ్చిన దగ్గర్నుండీ బుచ్చిశాస్త్రి మెదడు అమోఘంగా పనిచెయ్యసాగింది.

కోట దాటి మూడు లాంతర్ల వైపు వెళ్లబోతున్న బుచ్చిశాస్త్రికి ఒక సన్నటి, ఎర్రటి ఇరవై ఏళ్ల యువకుడు ఎదురుపడ్డాడు. అతని జుట్టు దిలీప్‌కుమార్‌లా మొహంమీద పడ్తోంది. కళ్లు ఎర్రగా ఉన్నాయి. చూపు ఎక్కడోవుంది. టెర్లిన్ షర్టు బాగా నలిగిపోయింది. రేయాన్ పాంటు దుమ్ము అంటుకున్నట్లుంది. సాయంకాలం అయిదు గంటలకు, కాలేజీ విద్యార్థి అయిన ఆ అబ్బాయి, ఆ ప్రదేశంలో ఆ స్థితిలో కన్పించటం బుచ్చిశాస్త్రికి ఆశ్చర్యంవేసింది. తనే పలకరించాడు.

"ఏమోయి సూర్యం ! నేను మీ ఊరే వెళ్తున్నాను. నాన్నగారితో ఏమైనా చెప్పమన్నావా?" అని, ఆ అబ్బాయిని ఆపి అడిగాడు.

సూర్యం పరధ్యానంగా, "ఆఁ" అన్నాడు. బుచ్చిశాస్త్రి తన మాటల్ని మరొకసారి అన్నాడు. అప్పుడా అబ్బాయి కాస్త ఆలోచించి, "నేను ఆత్మహత్య చేసుకోబోతున్నానని చెప్పండి" అని విసురుగా వెళ్లిపోబోయాడు. బుచ్చిశాస్త్రి, ఆశ్చర్యంగా, "ఆ ! ఆ ! లవేం మాటలోయ్?" అంటూ అతని ప్రక్కనే నడుస్తూ, "మీ నాన్నగారు కోపదారి మనుషులు. ఆయన కోపంలో ఏదైనా అంటే నువ్విలా తలపెట్టడం భావ్యంకాదు......" అని నచ్చచెప్తూంటే, సూర్యం మెల్లిగా నడుస్తూ, "నన్నాయన ఏమీ అనలేదు. కానీ నాకే ఈ ప్రపంచం అంటే రోత పుట్టేసింది. ఈ మనుషులంటే అసహ్యంవేస్తోంది. నేనిక జీవించదల్చుకోలేదు" అన్నాడు.

బుచ్చిశాస్త్రి, ఈ వ్యవహారం తనూహించిన దానికన్నా క్లిష్టమైనదని గ్రహించాడు. "కాస్త కాఫీ తాగొద్దాం, పద !" అని సూర్యాన్ని కాఫీ హొటలుకి తీసుకువెళ్లి, "అసలు విషయమేమిటో చెప్పు?" అని అడిగాడు. వకొరదర బెట్టుచేసినా తరువాత సూర్యం మెల్లిగా బయటపెట్టాడు. తను కాలేజీలో ఒక అమ్మాయిని ప్రేమించాననీ, ఆమె తనను నిరాకరించిందనీ, అందువలన తను ప్రాణత్యాగం చెయ్యదల్చుకున్నాననీ, అందుకు ఇంకా కారణాలున్నాయనీ చెప్పాడు.

ఈ రోజుల్లో యువతీ యువకులు ఎంత సులభంగా ఆత్మహత్యకు తెగిస్తారో తెలిసిన బుచ్చిశాస్త్రి, సూర్యం భుజం తట్టి, "ఓస్ ! ఇంతేటయ్యా ! నువ్వెవర్ని ప్రేమించావో చెప్పు? ఆ అమ్మాయిని నీ కిచ్చి వివాహం జరిపే ఏర్పాటు చేయిస్తాను" అన్నాడు.

లాభం లేదన్నట్లు తలూపాడు సూర్యం. "ఆ అమ్మాయి ఎవరో అయితే ఫరవాలేదు. మనమంటే బొత్తిగా పడని కుటుంబంలోది. అందుచేత లాభంలేదు" అని గట్టిగా చెప్పాడు. సూర్యం చాలా ఉద్రేక స్వభావం గలవాడేకాక, చాలా విషయాలలో, తండ్రైన కాంతారావుగారికి వ్యతిరేకి. సృష్టి చిత్రమే అటువంటిది. కేపిటలిస్టు తండ్రులకు సోషలిస్టు కొడుకులు, కాంగ్రెసు అన్నలకు కమ్యూనిస్టు సోదరులూ, శాఖాహార భర్తలకు మాంసాహార భార్యలూ తటస్థ పడుతూంటారు. అదే విధంగా లుబ్ధాగ్రేసరుడూ, పరమ పేచీకోరూ అయిన పంతులుగారికి ఖర్చుదారూ, సుస్మిత స్వభావుడూ, భావకవీ అయిన సూర్యం, ప్రథమ పుత్రరత్నం. అంతేకాకుండా రోమియో, జూలియట్‌ల కుటుంబాల మధ్య విరోధం ఉందని తెలిసి కూడా, రోమియో, జూలియెట్‌ని ప్రేమించినట్లు, సూర్యం తన కుటుంబానికి ఇష్టం వుండదని తెలిసి కూడా, మనోరమను ప్రేమించాడు. ఆమె హనుమయ్యగారి పుత్రిక. కాలేజీలో పి.యు.సీ. చదువుతున్న పద్దెనిమిదేళ్ల చక్కనిచుక్క. సూర్యంయొక్క ప్రేమలేఖ అందుకున్న మరుక్షణమే, దాన్ని చించి పారేసి, అతనికి విన్పించేట్లు "ఇదే నా జవాబు" అంది. ప్రేమలేఖతోబాటు, సూర్యం హృదయం కూడ ముక్కలైపోయింది. ఈ సంగతి విన్న బుచ్చిశాస్త్రి, "అబ్బాయి, నువ్విందుకు విచారించవలసిన పని ఎంతమాత్రం లేదు. నిన్నెలాగ చిన్నప్పటినుంచీ ఎరుగుదునో, అలాగే మనోరమనుకూడా ఎరుగుదును. నువ్వు దిగులుపడకు. మీ ఇద్దరికీ వివాహం జరిపించే పూచీ, నాది" అని సూర్యానికి మరీ మరీ ధైర్యంచెప్పి, సూర్యాన్ని ఎలాటి అఘాయిత్యమూ జరపవద్దని బోధించి, సింగిపురం వెళ్లే బస్సెక్కాడు.

తను వేసుకున్న పథకంలో మొదటి ఎత్తు దిగ్విజయంగా సాగినందుకు బుచ్చిశాస్త్రికి భుజాలు పొంగిపోయాయి. సూర్యానికి పిల్ల నచ్చుతుందో లేదో అన్న బెంగలేకుండా సూర్యమే ఆ అమ్మాయిని ప్రేమించాడు. ఇక పెద్దల సంగతి : వాళ్ల నెలా కదిలించాలో తనకు తెలుసు.

మరునాడు సింగిపురంలో, పంతులుగారింట్లో సత్యన్నారాయణ వ్రతం చేసుకున్నాక, భోజనాల వద్ద కాంతారావుపంతులుగారు బాతాఖానీ ప్రారంభించారు. ఆయనకు ఏభై ఏళ్లుంటాయి, జుట్టు నెరసినా రంగువేయడంవల్ల కొంత నల్లగా కన్పిస్తుంది. ఆయన ఎర్రగా పొట్టిగా ఉంటారు. మాట మాటకూ కన్నుకొట్టడం, వాక్యానికొక తిట్టు

ప్రయోగం ప్రయోగించడం ఆయన కలివాటు. కొంచెం నవ్వుకూడా జోడిస్తూంటారు.

"ఏవిటోయ్, విజయనగరం విశేషాలు?" అని అడి అడిగాడాయన ఒక కన్నుమూసి, ఒక కన్ను ఎగర వేస్తూ, చిన్న చిరునవ్వుతో.

"మీ అబ్బాయి బాగానే ఉన్నాడు" అన్నాడు బుచ్చిశాస్త్రి మామిడిపండు చీకుతూ.

"ఆ వెధవాయ్ సంగతి ఎవడడిగాడు? అమ్మాయి అత్తవారింట్లో సంగతడుగుతూంటేనూ— మా అల్లుడి నంట్లో ఎలాగుంది?"

"అతని స్థితి అలాగేవుంది. దాంతోబాటు హనుమయ్యగారికికూడా దిగులెక్కువై పోయింది".

"ఏం? ఖూనీకేసులు తక్కువయ్యాయా?"

"అబ్బే. పెళ్లీడుకొచ్చిన పిల్లకు తగిన సంబంధం దొరక్క అవస్థపడుతున్నారు. వారి హోదాకి తగిన సంబంధం కావాలి. కదండీ".

"ఏమిటీ, పిల్ల పెళ్లిచేస్తాడా! ఇహ తెలుస్తుంది లే అయ్యగారి పని. ఆ వచ్చే వాళ్లెవరో మాంఛి గడుసువాళ్లు రావాలి. ఈయన్ని నానా గడ్డీ గరి పించాలి. నాలాటి వాడైతే........."

"అదే నేనూ అన్నానండి. మీ సంబంధమైతే దివ్యంగా వుంటుందని అన్నానండి" అన్నాడు బుచ్చిశాస్త్రి మధ్యలో అడ్డువచ్చి.

"మా సంబంధమా?" అని పంతులుగారు తెల్ల బోయారు. మళ్లీ కోపంతో, "ఆ అప్రాచ్యుడితో మళ్లీ సంబంధం చెయ్యమంటావా? నీ కేమైనా బుద్ధీ, జ్ఞానం ఉందా? వాణ్ణి ఏంచేసినా పాపం ఉందా? పరమ దుర్మార్గుడు......." అని పావు గంటసేపు పంతులుగారు హనుమయ్యగారిమీద మండిపడ్డారు. ఆయనకు కోపం వచ్చిందంటె మరి ఆపుకోలేరు. భోజనాలయ్యేదాకా ఆయన వాళ్లని తిడ్తూనేవున్నాడు. బుచ్చిశాస్త్రి మౌనంగా వింటూనేవున్నాడు.

తాంబూలం వేసుకుంటున్నప్పుడు, బుచ్చి శాస్త్రి ప్రారంభించాడు. "అయ్యా పంతులు

# ఒరులేయవి యొనరించిన

గారూ! నేను మీ శ్రేయస్సుగోరే ఈ సంబంధం చెప్పాను. ఒకటి మీరు జమీందారులూ, వారూ మీ హోదాకి తగినవారే, ఆయనకీ ఒక్కర్తే కూతురు కట్న కానుకలు ఘనంగా ఇవ్వదల్చుకున్నారు. ఇహ రెండవ సంగతి. ఇన్నాళ్లూ మీ అమ్మాయి వారింట్లో నానా కష్టాలూ పడ్తోంది. ఇప్పుడు వారమ్మాయి మీ కోడలయిందంటే, వాళ్ల జుట్టు మీ లోకి వచ్చినట్టే. 'తన కూతుర్నెలా చూస్తారో?' అని హనుమయ్యగారు బెంగపెట్టుకుని, మీ అమ్మాయిని బాగా చూడటం ప్రారంభిస్తారు. మిమ్మల్ని వాళ్లెన్ని తిప్పలు పెట్టారో, అన్ని తిప్పలు వాళ్లిప్పుడు పడతారు........" అని బోధిస్తూంటే క్రమంగా పంతులుగారి మనసు మారసాగింది. చాలాసేపు ఆలోచించాక—

"నిజమేనయ్యా! ఈ దెబ్బతో హనుమయ్యకు బుద్ధివచ్చేటట్లు చేస్తాను. మా అమ్మాయిని వాళ్లెలా హింస పెట్టారో, తన కూతురుద్వారా తనకు తెలిసేట్లు చేస్తాను. పెళ్లిలో వాళ్లు పెట్టిన పేచీలన్నిటికీ ఇప్పుడు సమాధానం చెప్తాను. బంధువులందరిలోనూ తలవంచుకునేటట్లు చేస్తాను." అని ఉద్రేకంతో అన్నారు. అని, "అయితే ఇంతకూ హనుమయ్య ఏమాత్రం కట్నం ఇస్తాడు?" అని అడిగాడు.

"ఇంతని అనటంలేదుగాని, చాలా భారీగానే ఇవ్వ దల్చుకున్నారు. మీరు— ఇంత కావాలని అంటే, వారితో చెప్తాను" అన్నాడు బుచ్చిశాస్త్రి.

పంతులుగారు ఆలోచనలోపడ్డారు. ప్రతి విషయంలోనూ హనుమయ్యగారికి తను పాఠం చెప్పాలి. కట్నం గురించి ఆయన చేసిన హంగామాకి తను చక్కని పాఠం చెప్పాలి. ఒక విషయం మాత్రం రూఢిని అందరికీ తెలుసు. మనోరమ అంటే హనుమయ్యగారికి వెర్రి అభిమానం. ఆమె వివాహానికి ఆయన ఏ లోటూ రానివ్వరు. కాబట్టి కట్నం వేరే అడుగనక్కర్లేదు. "ఆయనకు తోచినంతే ఇవ్వమను" అన్నారు, కన్నుకొట్టూ, వెకిలిగా నవ్వుతూ,

"భేష్! అలా అన్నారంటే, మీకు కట్నమూ బాగా ముడ్తుంది. ఆయనకు బాగా బుద్ధి చెప్పి నట్లూ అవుతుంది." అన్నాడు బుచ్చిశాస్త్రి.

"అందుకేనోయ్ శాస్త్రుల్లూ, వాళ్లు ఏయే విషయాలలో మనతో పేచీలు పెట్టారో ఆ విష యాలన్నిటిలోనూ మనం పేచీలేకుండా పెళ్లి చేసుకోవాలి. అప్పుడు నలుగురిలోనూ వాళ్లకు తలకొట్టేసినట్లౌతుంది. అందరికీ మన సంగతి తెలుస్తుంది" అని తీర్మానించారు పంతులుగారు. బుచ్చిశాస్త్రి ఆయనతో ఏకీభవించాడు.

అసలు హనుమయ్యగారి బుర్రలో బుచ్చిశాస్త్రి అనేదాకా, పంతులుగారి సంబంధం తోచనేలేదు. సుమారు రెండేండ్లనుంచీ, తగిన సంబంధం కోసం వెతుకుతున్నారాయన. కానీ, ఆయన అంతస్థుకూ, హోదాకు తగిన సంబంధం దొరకనేలేదు. అప్పుడు బుచ్చిశాస్త్రి, "మీ అంతస్థుకూ, హోదాకూ తగినది పంతులుగారి సంబంధమేనండీ", అన్నాడు. అదివిని ముందర చిందులు త్రొక్కారు. "ఆ దగాకోరుతో మళ్లీ సంబంధం చెయ్యమంటావా? అతని నోటికి శుద్ధిబద్ధి ఉందీ, మంచీ, మర్యాదా ఏ కోశా నైనా ఉందీ? చెప్పావులే మహా, సంబంధం!...." అన్నారాయన చేతులెగరేస్తూ.

"బాబూ! ఒక్క విషయం మనవిచేస్తాను. మనం పిల్లనిచ్చేది, కొడుకైన సూర్యానికిగాని, తండ్రైన పంతులుగారికికాదు. సూర్యం, హిరణ్య కశిపుడి కడుపున ప్రహ్లాదుడిలా, పంతులుగారికి అన్నిట్లో వ్యతిరేకై పుట్టాడు. బుద్ధిమంతుడు, సాత్వికుడు, కల్లాకపటం లేనివాడు. మీ అమ్మా యిని నెత్తిమీద పెట్టుకుంటాడు. పెళ్లయ్యే దాకానే, మీకు పంతులుగారితో పని. ఆ తర్వాత అంతా సూర్యమే చూసుకుంటాడు" అని సూర్యం యొక్క గుణగణాల్ని వర్ణించి, మనోరమకు ఈడూ జోడూ కుదురుతుందని చెప్పాక హనుమయ్యగారు మెత్తపడ్డారు. సూర్యాన్నికూడా ఆయన ఎరుగును. మంచివాడే, పైగా పంతులుగారిది గొప్ప ఆస్తి. ఎలా లేదన్నా సూర్యం నాటాకు రెండు లక్షల రూపా యలు విలువచేసే ఆస్తి వస్తుంది. బుచ్చిశాస్త్రి చెప్పినట్లు, పెళ్లయ్యేదాకానే పంతులుగారితో అవసరం. తర్వాత అంతా సూర్యం ద్వారానే నడి పించాలి. అంతగా అవసరమైతే, కొడుకుని తండ్రినుండి వేరువేసి, తన ఇంట్లో ఇల్లరికం ఉంచవచ్చు. మనోరమను సూర్యం ప్రేమించాడన్న సంగతి ఆయనకీ తెలిసింది. సూర్యం ద్వారానే పంతులుగారికి తగిన పాఠం చెప్పచ్చు.

ఈ విషయంలో పంతులుగారి అభిప్రాయ మేమిటో కనుక్కోమని, హనుమయ్యగారు బుచ్చి శాస్త్రిని నియోగించారు. పంతులుగారికి తమ సంబంధం చేసుకోడానికి ఎంతమాత్రం అభ్యంతరం లేదని తెలిసాక, హనుమయ్యగారు ఒక మంచిరోజున, టాక్సీలో సతీసమేతంగా బయల్దేరి సింగిపురం

74 వ పేజీ చూడండి





# నికో
## క్రిమిసంహార సబ్బు
## పార్క్-డేవిస్ ఉత్పత్తి

మీ చర్మాన్ని, మొటిమలు, పొక్కులు, పేయడంనుంచి కాపాడి పరిశుభ్రంగా ఆరోగ్యంగా వుంచుతుంది. దీనితో నిత్యం తల రుద్దుకొంటే, దీని క్రిమిసంహారనురగ, చుండ్రు రాకుండా కాపాడుతుంది. నిరుపమానమైన నికో క్రిమిసంహార సబ్బు మీకు మూడు విధాల లాభం చేకూరుస్తుంది; అది పరిశుభ్రంచేయడం, క్రిములను నాశనంచేయడం, సంరక్షించడం. మీ చర్మానికి కావలసిన సంరక్షణ నిత్యంచేయండి.




NATIONAL PD 9163

—మొట్టమొదటి క్రిమిసంహార సబ్బు, నిత్య ఉపయోగానికి.

# ఆడవారూ-హాస్యమూ

'విశాఖ'

**వేం** సుభద్రని చూడ్డానికని వాళ్ళ అత్తగారింటికి వెళ్ళాం. అది అత్తగారింటికి కాపరానికెళ్లి సరిగ్గా నెలరోజులే అయింది. సుభద్రా దాని ఆడపడుచు లిద్దరూ సుభద్రావాళ్ళాయనా డ్రాయింగు రూములో వున్నారు, మేం వెళ్ళేక వాళ్ళతో కబుర్లు చెప్తూ కూర్చున్నాము.

సుభద్ర లోపలికి వెళ్లి కాఫీ ఫలహారం పట్టు కొచ్చింది. ఇంక మొదలు పెట్టాడాయన వేళాకోళం ఫలహారాన్ని అనేక రకాలుగా వర్ణించి అందుకే చదువుకున్న ఆడపిల్లలకి వంటరాదన్న విమర్శతో ముగించాడు. తలుపు కవతల ఉన్న అత్తగార్ని భర్తనీ చూసి తలదించుకుంది సుభద్ర. ముఖం ఎర్రబడింది. కళ్లలో నీరు నిలిచింది. అది గమనించిన సుభద్ర భర్త ఎగతాళిగా "అప్పుడే గంగాభవాని వచ్చేసిందా ! ఏదో హాస్యానికంటే ఆ మాత్రం సరిగ్గా తీసుకోలేవూ ? అందుకే మీ ఆడవారికి 'సెన్స్ ఆఫ్ హ్యూమర్' లేదన్నారు" అన్నాడు.

## తెగవేళాకోళం

ఇది విన్న వాకు మా చెడ్డకోపం వచ్చింది. ఎవరో వచ్చారయినను, వాళ్ల ముందు అంతలా వేళాకోళం చెయ్యవచ్చా అన్న విచక్షణ లేక వేళాకోళం చేసి అది అభిమానంతో బాధపడితే 'సెన్స్ ఆఫ్ హ్యూమర్' లేదనేశాడు. అసలు ఈ విమర్శకి కారణం ఆలోచించాలి. పెళ్ళయి అత్తగారింటికి వెళ్లిన క్రొత్తలో భర్తా, ఆడబడుచులూ క్రొత్తగా వచ్చిన ఆ వధువుని తెగవేళాకోళం చేస్తారు. కొంతమంది మోతాదులో ఛలోక్తుల్లా బాణాలు విసిరితే కొందరు మోటుగా హద్దులేకుండా కళ్ల నీళ్ళు వచ్చేంత వరకూ మాటల బాణాలు విసురుతారు. వాటికి ప్రతిగా జవాబు చెప్పిందా ఆ పిల్లకి జన్మాంతం కొన్ని రిమార్కులుండి పోతాయి. అందులో మా సుభద్రలాగా చదువుకున్నదయితే "చదువుకున్నానని అహంకారం. మగవాళ్లతో సరిసమానంగా మాటలంటూందా ఎవరేనా ? ఛీ. ఆడపడుచు అనీ, అత్తగారినీ మర్యాదేనా లేదు" వగైరా, అందుకే జవాబు చెప్పక, చెప్పనేరక, వాళ్ళు ఏమైనా అనగానే కోపమేనా తెచ్చుకుంటుంది, కన్నీరైనా కారుస్తుంది.

## తారుమారైతే కథ అడ్డం

ఎవరో ఇంకొక ఆడది ఇంకా అందంగా ఉందనీ, స్మార్టుగా ఉందనీ తెగ మెచ్చుకుంటున్న భర్తకి ఏమీ చెప్పనేరక కళ్ల నీళ్లతో నింపేసుకుంటుంది భార్య. ఆ ఎదుటి వ్యక్తిని పొగడడమే గాక భార్యని చులకనగా ఏదైనా అంటాడు.

"పోన్లెండ. దేముడిచ్చినదాని కేవరేం చేస్తారు" అని ముక్కు చీదేస్తుంది భార్య. అపళ్ళాన భర్త "ఏదో వేళాకోళానికన్నాను ఆ మాత్రం స్పోర్టివ్ స్పిరిట్ లేకపోతే ఎలాగ ? అన్నింటికీ రాగాలే" అని మళ్ళీ విసుక్కుంటాడు. ఇందులో ఆ భార్య తప్పేముంది ? ఇదే ఆ భార్య తిరిగి "ఆ మా కాలేజీలోనూ ఫలానా అబ్బాయి ఉండేవాడు నవమన్మథుడు. మీకు అతనిలాగా బట్టలు వేసుకోవడం కూడా తెలీదు." అని చెప్పితే ?. . . . జరగబోయేది వూహించుకోగలం. అందుకే అలా చెప్పనేరక భర్తకి ఎదురాడక తనని అన్నదానికి బాధపడి ఏడుస్తుంది భార్య.

అదీ గాక చిన్నప్పటినుంచీ మన ఇళ్లలో ఆడవారిని నవ్వనీయకుండా చేస్తారు. తెలిసీ తెలియని వయస్సులో దేనికైనా గట్టిగా నవ్వితే ఇంట్లో ఉండేవారు కోప్పడుతారు.

"ఏమిటే అంతలా నవ్వుతున్నావు. ఆడదానికంత నవ్వు పనికిరాదు. ద్రౌపది అలా నవ్వే భారత యుద్ధానికి కారకురాలయింది" అంటూ మొదలెట్టి తిడతారు. మయ సభలో నీరులేని చోట ఉందనుకుని పంచెని పైకెత్తుకుని నడచిన దుర్యోధనుడు తటాకమున్నచోట సమతల ప్రదేశమని తలచి మామూలుగా నడిచి ఆ నీటిలో పడటం చూసిన ద్రౌపది ఫక్కున నవ్వింది. ఈ అవమానాగ్నిని భరించనేరక సుయోధనుడు ప్రాయోపవేశం చేస్తానంటే శకుని తన మాటలతో మనస్సు మార్పిస్తాడు. దాని ఫలితమే మాయజూదం, భారత యుద్ధం అని మా అమ్మమ్మ పదేపదే చెప్పింది నాకు. అందుకే నవ్వకూడదని ఆంక్ష పెట్టేది.

## భార్యలకేనా? నిబంధనలు?

ఇంక ఇలా మొదలైనది ఇంక పెద్దవుతున్న కొద్దీ మరీ ఆంక్షలు వేస్తారు. దాంతో నవ్వడానికే భయం కలిగిస్తారు. వంటింటిలో పని చేసుకుం



"ఈ యింటి ఇల్లాలెవరోగాని....వండినవంటలన్నీ అద్భుతంగా చేసింది సుమండీ!..."
"ఆఁ ఆఁ...ఆడవాళ్లు వంటచేస్తే యిక తిన్నట్టే! ఇవాళ వంటలుచేసింది ఇంటావిడ గారు! ఇంటాయన!!"

టున్న భార్య పాకుడులో జారిపడితే దాన్ని భర్త వినోదంగా తిలకించి నవ్వొచ్చు. కానీ అదే స్త్రీ అలా చేస్తుందా తన భర్తే పడితే? భర్త తను పడ్డప్పుడు నవ్వి వేళాకోళం చేస్తే బాధపడి కళ్లనీళ్లు పెట్టుకుంటే 'ఆడవాళ్ళకి హాస్యానుభూతే లేదని' విమర్శలు. అసలే పడ్డ నొప్పితో బాధ పడుతుంటే విమర్శలు వేరే.

కానీ ఆడవారిలో హాస్యం, 'సెన్స్ ఆఫ్ హ్యూమర్' చాలా ఎక్కువగానే ఉంది. క్రొత్తగా పెళ్లయిన అబ్బాయికి మరదళ్ళి చూస్తే ఎందుకంత భయం? తమలపాకులు చుట్టి ఇస్తే వేసుకోడేం ? వక్కలకి బదులు చింతపిక్క లుంటాయేమోననేగా ! బావగార్ని కూర్చోమని ఈజీఛైర్ చూపిస్తే కూర్చోడేం ? కుర్చీ కర్రలాగేసి బట్ట మాత్రం ఉంచిందేమోననేగా ! పడితే నవ్వుతుందేమోనన్న భయం వల్లేగదా !

"బావా! బావా! పన్నీరు, బావని పట్టుకు తన్నేరు" అని పాడే మరదలు పిల్లలకి హాస్యానుభూతి లేకపోతే ఎలా బావగార్లనంత వేళాకోళం పట్టిస్తారు.

పెళ్లిళ్లలో ఆడవారుండే చోట చేరితే వినబడే ఛలోక్తులు మగవారిలో ఉండనే ఉండవేమోను. తలంబ్రాలు పోసుకుంటుంటే వినవచ్చే కొన్ని విమర్శలు "బియ్యం అంతా ఒక్కసారే పోసేటట్లుంది", "చుశావా తల ఎలా ఎత్తుకుందో పాపం ఆ పెళ్లికొడుకు తల వంచుకునే ఉన్నాడు" వగైరా.

"ఏవమ్మా చూసావా ఆ పెళ్లికూతురు అప్పుడే ఎలా పెళ్లికొడుకుతో మాట్లాడేస్తోందోను" అని రిసెప్షెన్‌లో ఒకావిడ అంటే.

"అబ్బే ! ఇంకేం లేదు. మనం వేరింటి కాపురం పెట్టుకోవాలి. త్వరగా ఇల్లు చూడండి అంటోంది" అని ఇంకొకావిడ.

సరి. దంపుళ్లపాటల్లో ఉండే హాస్యం చెప్పక్కర్లేదు కదా ! అత్తాకోడళ్ల పాటలు ఉదాహరణకి.

అత్తలేని కోడలుత్తమురాలు ఓలమ్మా
కోడల్లేనియత్త గుణవంతురాలు. ఓలమ్మా

అత్త :
కోడలా కోడలా కొడుకు పెళ్లామా
వచ్చి పాలమీద మీగడేదమ్మా
వేడి పాలల్లోన వెన్న యేదమ్మా ఆహూం

కోడలు :
అత్తా నీ చేత అరళ్లేగానీ
వచ్చి పాలమీద మీగడుంటుందా?
వేడిపాలల్లోన వెన్నయుంటుందా? ఆహుం

ఇలాంటి వెన్నో ఉంటాయి. ఇదే విజ జీవితంలో అత్తైనా గడుసరి, కోడలేనా గడుసరి ఉంటుంది. దాంతో ఒకరు అన్నవాటికింకోరు కళ్ల నీళ్లు పెట్టుకోవడం అంతే !

పెళ్లిళ్లలో పాడేపాటలు 'అత్తవారింటికి కొత్తల్లుడొస్తేను కొత్తసున్నం దెచ్చి మెత్తరమ్మా', వదినగార్లమీద పాడే 'వదినలందరు వచ్చిరి వయ్యారముగా మా వదినలందరూ వచ్చిరి' మొదలైనవన్నీ హాస్యరస భరితాలే కదా ! వీటిని పాడేటప్పుడానందించని వనిత లెవరు ?

మా పద్మా వాళ్ల ఇంటికి ఒకావిడ వచ్చేవారు.

75వ పేజీ చూడండి

# ఆడవారూ-సంగీతమూ

చక్రవర్తుల లక్ష్మీనరసమ్మ

నిద్ర మంచం మీంచి లేస్తూనే "నింగి నిదురపోయే, నేల నిదురపోయే, గాలి నిదురపోయే, లోకాలె నిదురపోయే" అంటూ సినిమాసాంగ్ ఆలాపించటం మొదలెట్టింది చెల్లి. అప్పుడే స్నానం చేసి దేవుడి గదిలో మేలుకొలుపులు పాడుకుంటున్న నాయనమ్మగారి చెవుల్లో పడిందా సినిమా సంగీతం. "ఛీఛీ నీ దుంపతెగా, వేళాపాళాలేకుండా ఏమిటా వాగుడు. ఇదేం విపరీతమో గాని ఎవరి నోటవిన్నా ఇవేపాటలు. ఈ ఈడుకు మా కాలంలో మేలుకొలుపులు, అష్టపదులు, తరంగాలు, మంగళహారతులు అవీ పాడేవాళ్ళం" అంటూ నత్లేరు మీదికి బండిలా లేచింది చెల్లి మీదికి.

నాయనమ్మగారు యథాలాపంగా మామూలు ధోరణిలో చీవాట్లు పెట్టినా ఆమె మాటల్లో ఏదో సత్యం కనిపించింది.

మొన్న ఒకరింట్లో పుట్టిన రోజు పేరంటం అయింది. ఆ పేరంటంలో ఒక అమ్మాయిని పాట పాడమంటే "ఆడే పాడే పసివాడ, అమ్మాలేని నిను చూడ" అంటూ అందుకుంది. శుభమా అని పుట్టిన రోజు పండగ చేసుకుంటుంటే అపశకునంలా ఇదేం పాటని వాళ్ళు మనస్సులో బాధ పడ్డారు పైకేమీ అనలేక.

అలాంటప్పుడు ఏ త్యాగరాజ కృతో, ఏ తరంగమో పాడితే ఎంత బాగుంటుంది చెప్పండి.

"ఆత్మయొక్క ధ్వనియే అత్యుత్తమమైన కళ" అన్నారు రాష్ట్రపతి రాధాకృష్ణ. "ఆత్మయొక్క సందేశం పరమాత్మను చేరటానికి కళయే సాధనం" అన్నాడు విశ్వకవి రవీంద్రుడు ఈ సత్యాన్ని సంగీత కళద్వారా రుజువు చేశారు త్యాగరాజు, మీరాబాయి మొదలగువారు.

మానవుని భావాలు మహోన్నతం కావాలంటే ఆనందానుభూతిని కల్గించటంలో కృత కృత్యమైన సంగీత కళే ఉత్తమ సాధనం. అందుకే భారతీయ కళాభిజ్ఞులు అరవై నాలుగు కళల్లో సంగీత కళకు విశిష్ట స్థానాన్ని ఇచ్చారు.

ఏ దేశంలో, ఏ భాషలో సంగీత కళ అభివృద్ధి చెందినా, అసలు సంగీతానికి మూలం భారత దేశంలోనే ఉద్భవించింది.

ప్రాచ్య దేశాలలో భారతీయ సంగీతమే రకరకాల రాగభంగిమలతో, విస్పష్ట ఉచ్చారణలతో పరిపూర్ణమై ప్రసిద్ధికెక్కింది. శిలలు కరగించి, మోడులు చిగురింప చేయగల మహత్తర శక్తిగలది సంగీత కళే. హృదయానికి ఆహ్లాదాన్ని, చైతన్యాన్ని కలిగించి మానవుని రసార్ద్ర భూతచేతస్కులుగా చేయగలిగేది సంగీత కళా మాధుర్యమే.... సరస్వతీదేవికి సంగీత సాహిత్యాలు రెండూ రెండు నేత్రాలు. "నాదము పరబ్రహ్మ స్వరూప" మన్నారు ఆర్యులు.

ఇటువంటి అమూల్యమైన కళకు ఆధునిక వనితలు తగిన ప్రాతినిధ్యాన్నివ్వటం ఎంతైనా అవసరం.

నేటి స్త్రీ ఆ నాటి వంట ఇంటి కుందేలు కాదు. అన్ని రంగాలలో అందె వేసిన చేయి. అలాంటప్పుడు



'ఏమమ్మా ! మీ ఆయనగారు ఆఫీసుపని ఇంట్లోకూడా చేస్తున్నారా ఏమిటి ?....'
'ఏబ్బే, కాదండీ ! మా చిన్నాడి స్కూలు పుస్తకాలకి అట్టలు వేస్తున్నారు ! అంతే !'

## ఆడవాళ్ళు-సంగీతం

సంగీత కళారంగంలో మాత్రం విశిష్టతను ఎందుకు సంపాదించుకో కూడదు ?

సంగీతమంటే శ్రేష్టమైన గీతమని అర్థం. ఈ రోజుల్లో అన్ని రకాల గీతాలు సంగీతంలోకే వస్తున్నాయి. కాఫీహోటళ్ళు, కిళ్లీ షాపులు మొదలు కొని పేరంటాలు, పెళ్లి చూపుల వరకు ఫిలిం గీతాలే ప్రబల ప్రచారంలో ఉన్నాయి. దీనికి కారణం అవి సులభంగా పట్టుబడటమే ! శాస్త్రీయ సంగీతం అలా సులభంగా వచ్చేది కదు. అతి ప్రయత్న, ప్రయాసల మీద గాని సాధించలేరు. కాబట్టి ప్రతివారు తమలోని సంగీతాభిలాషను చంపుకోలేక ఈ సులభ సంగీత వ్యామోహంలో పడుతున్నారు. అలాగని సినిమా సంగీతాన్ని నిరసించ మని చెప్పటం లేదు. నేటి ఫిలిం సంస్థలు కూడా శాస్త్రీయ సంగీతానికే చాలావరకు అగ్రస్థానం ఇస్తున్నాయి. వాటికి ఇచ్చే గౌరవాన్ని వాటికి ఇస్తూ సంగీత కళ యొక్క సహజ సంస్కృతిని సంరక్షించుకో వలసిన బాధ్యత మనపై ఉన్నది.

భారతీయ సంస్కృతి మహాసాగరం వంటిది. అందులో ప్రాంతీయ సంస్కృతులన్నీ మహా నదుల్లా సంగమించాయి. ఒక్కొక్క మహానది ఒక్కొక్క సంస్కృతి, ఒక్కొక్క విశిష్టత కలిగి ఉంది. దేశ సౌభాగ్యం దేశీయ కళల మీద ఆధార పడి ఉంది.

సంగీత కళా సాంస్కృతికపునరుజ్జీవనముకై ప్రభుత్వం వారు అనేక విధాలుగా కృషిచేస్తున్నారు. సంగీత అకాడమీలు స్థాపిస్తున్నారు. రేడియోల ద్వారా సంగీత పాఠాలు చెప్పిస్తున్నారు. వీటిని మనం సద్వినియోగ పడేలా చేసుకోవాలి.

గొప్పగొప్ప పాట కచ్చేరీలు అవీ చేసి పేరు ప్రతిష్ఠలు గడించే శక్తి కొందరు స్త్రీలకు మాత్రమే ఉంటుంది. కాని పతనమై పోతున్న కళలను పునరుద్ధరించి దానిని నిత్యజీవనానందానికి ఉపయోగించుకునే శక్తి స్త్రీలందరికీ ఉన్నది. మన స్త్రీ జాతి ఈ విషయాన్ని విస్మరించకూడదు.

నేడు పెళ్లి చూపులకు ఎవరైనా వస్తే "అమ్మాయికేమైనా సంగీతం వచ్చా ?" అని ప్రశ్నించటం మరచిపోరు. పేరంటానికి వెళితే ఏ మంగళహారతో పాడమంటారు. "పాడండి, పాడండి". అని పదిసార్లు బతిమాలించుకొని భయం, భయంగా గొంతు బిగబట్టి కీచురాగం తీస్తుందొక సోదరి. ఏదో ఒక పని చేస్తూ వచ్చీరాని కూనిరాగాలు తీసుకుంటూ ఎనర్జీ వేస్టు చేసుకొనే ఆడవాళ్ళ లెక్కేలేరు.

ఈ పరిస్థితిలో ఆడవాళ్ళు శక్తికొలది సంగీత సాధన చేయుటం అవసరం. పాటకచ్చేరీలు, రేడియో ప్రోగ్రాములు ఇవ్వలేకపోయినా ఏ పేరంటానికి వెళ్ళి నపుడో, పెళ్లి చూపులు జరిగినపుడో పాడమనగానే శక్తిమేరకు ధైర్యంగా పాడగల శక్తి ఉంటే చాలు.

స్త్రీ కంఠం సహజమార్దవం గలది. అది భగవంతుడు స్త్రీ జాతికి ప్రసాదించిన అమూల్య వరం. దానిని సద్వినియోగం చేసుకున్న స్త్రీ గృహిణిగా ఉంటూ జాతీయ సంస్కృతిని కూడా సముద్ధరించ గల్గుతుంది.

డెర్వ్లా మర్ఫీకథ-3

# ఆరు వేల మైళ్లు సైకిల్ మీద అబల సాహసయాత్ర!



**ఆరువేల మైళ్ల దూర ప్రయాణంలో నేను యెన్నో ఆపదలు అవాంతరాలు యెదుర్కొన్నాను. ఎట్టకేలకు ఏనుగులు పులులు చిరుతలు అడవులగల దేశం**

—భారత దేశానికి — చేరువలోకి వెళ్లాను నేపాల్ భూముల్లో పడ్డాను— ఇక్కడ నా మీద పడ్డది దుండగులు కాదు— వానలు ఎండలు, మంచు కాదు— ఏనుగు అనుకుంటున్నారు కదూ ? ఊహుఁ కాదు— పెద్ద ఆవిరి భూతం ఒకటి నా వెంట పడ్డది. చాలా పెద్దది అది. దాని వేగం చాలా ఎక్కువ— సైకిల్ మీద (అది వెంట బడ్డప్పుడు) ఉన్న నాకు పారి పోగల వేగం కాని తప్పుకోగల జాగాగాని లేదు.

నేను ఒక నదిమీద నున్న వంతెన దాటుతున్నాను. సాధారణంగా అది ఒక మూడు నాలుగు ఫర్లాంగు లుండే వంతెన. దాని మీదనే రైళ్ళ తతిమ్మా సైకిల్ లాంటి వాహనాలు నదిని దాటేస్తుంటాయి. నేను ఈ వంతెన మీద 'రోజె వాంటే' స్వారీ చేస్తున్నాను. నేను ఇంకా వంతెన మధ్యకి కూడా రాలేదు— "నార్తు ఈస్టు ఎక్స్‌ప్రెస్" నా వెంట పడ్డది. అది "భాఁ" మంది. నా గుండె లాగి పోయాయి. సైకిలూ ఆగిపోయింది 'బాబోయ్' ఇంకా మరో రెండు మూడు ఫర్లాంగుల దూరం వంతెన ఉంది. పట్టాల అటూ ఇటూ నా సైకిల్‌కు కాదు. నాకూ ఎక్కడా జాగా లేదు. దడ దడా వస్తోంది ఎక్స్‌ప్రెస్ !

వెంటనే వంతెనకు అటూ అటూ గల ఇనుప కమ్మీలు (కానాలు) పట్టుకున్నాను. కుడిచేత్తో కానామీద కెక్కాను— ఎడం చేతో నా సర్వస్వమూ అయిన ప్రాణ ప్రదమైన సైకిల్‌కి పట్టుకున్నాను. రైలు కమ్మీలకి కొట్టుకుని ఇద్దరం క్రిందపడి తుత్తునియలు కాసంత దగ్గరగా దాన్ని నా శరీరానికి— నన్ను ఇనుప వంతెన 'కానా'కి అదుముకున్నాను. కళ్ళు మూసుకున్నాను.

దడదడా నా గుండెల మీద నించే అన్నట్లు ఈ యాంత్రిక భూతం వెళ్ళిపోయింది— నా జెబ్బ వూడి పోయింది సైకిల్ బరువుకి— క్రింద పడి కళ్ళు తెరిచి అటూ ఇటూ చూసి, వూపిరి పీల్చుకుని— చెమటలు ఒత్తుకుని— సైకిల్ ఎక్కాను. "పదరా బాబూ !" అనుకున్నాను.

నేపాల్‌లో ఏనుగు మీద పడుతుందనుకున్నాను, —పెద్దపులి కబళిస్తుందనుకున్నాను— చిరుత వెంట తరుముతుందనుకున్నాను గాని రైలుబండీ మీద పడుతుందనుకోలేదు.

తర్వాత అడవులగుండా ప్రయాణం చేస్తున్నా సరే! ఆ ఉదయం వెంట్రుక వాసిలో చావు తప్పించుకున్నానేమో, నాకా ప్రయాణం కష్టమనిపించలేదు.

35 మైళ్ళు కారడవుల్లోంచి, ఎత్తు పల్లాల గడ్డు రోడ్ల మీద నుంచి కూడా సైకిల్ తొక్కేసరికి బాగా అలిసి పోయాను. ఏనుగు లొస్తాయని. భయమూ ఉంది. చూడాలని సరదా ఉంది కూడా!

అంతలో పొడుగ్గా ఉన్న గరిక పొలాలు గుండా వెళ్తున్నప్పుడు— నా ముందు పది గజాల దూరంలో 'మృత్యువే' నించున్నట్లుంది. పెద్ద చిరుతపులి ఎదురుగా ప్రత్యక్ష మయింది. సైకిల్ వెనక్కి తిప్పి పారిపోడానికి కూడా ఆ చిన్ని కాలిబాట నిండా ఇసుక ఎక్కువ.

## వచ్చేశాను!



పులి నన్ను పోల్చినట్లు లేదు. అటు తిరిగి ఒక ఆరుగజాల దూరం— ఆ దట్టమయినగడ్డి పొలంలోకి దూకి దూసుకు పోయినది.

ఇక అది వెంట బడుతున్నట్లే సైకిల్ నడిపించాను.

అహా ! చివరికి నా కల ఫలించింది! నాల



నెరవేరింది. నా స్వప్న లోకం ఇండియా వచ్చేశాను. మై గాడ్! నేను సైకిల్ మీద భారతదేశం—ఏనుగుల పులుల, వింత మనుషుల, విభిన్నతత్వాల ప్రాచీన దేశం— లోకి వచ్చేశాను.

ఇరవై ఒక్క సంవత్సరాలు నేను కన్న కలలు తీరాయి.

ఈ దేశాన్ని చూడాలని సైకిల్ మీద—ధైర్య సాహసాల మీద— నా పదో ఏట నించీ అనుకుంటూ ఇవాళ్టికి చేరాను, అనే తృప్తి నన్ను ఆవరించింది.

*   *   *

సైకిల్ గర్వంగా హాయిగా తొక్కుతున్నాను. గ్రామీణ స్త్రీలు, ఒయ్యారంగా వరుసలుగా నెత్తి మీద నీళ్ళ కుండలతో అటు ఇటూ వెళ్తూ అగుపిస్తున్నారు. తల మీద రెండేసి కుండలు, ముక్కున నత్తులు, గమ్మత్తయిన చీరెలు— వాళ్ళని చూస్తూంటే నాకు సంతోషం వేసింది.

"హా! మా విస్మార్ పెద్ద తలలు ఇప్పుడేం మనుకొంటాయి? నేను వాజమ్మను గాను. ధైర్యలక్ష్మిని. బండ మొండి ఘటాన్ని. నా పంతం నెగ్గింది."

నేను ఆకాశం మీదున్నాను. రేపు అంతా నన్ను మెచ్చుకుంటారు కూడా—

"ఇరవై ఏడు పౌన్లతో ఆరువేల మైళ్ళు సైకిల్ మీద—"

వీటి అన్నింటినీ మించి ధర్మశాలలోని టిబెట్టు శరణార్థ బాలురకు సేవచేయ గలగడం నాకు గర్వమనిపించింది. అయినప్పటికీ ఏనుగును చూడాలి అన్న నా కాంక్ష గమ్మత్తుగా నెర వేరింది. నేనొక దగ్గర ఒక నదిని దాటవలసి వచ్చింది. నా సైకిలుకి ఈత రాదుగా. ఎట్లాగా అని ఆలోచిస్తూ ఒడ్డునే నిల్చున్నాను. అంతలో ఎప్పుడు వచ్చిందో వెనుకపాటుగా ఒక పెద్ద ఏనుగు వచ్చి తొండంతో నా సైకిలు అందుకుంది. తిరిగి చూద్దును గదా, ఆ ఏనుగు నా సైకిల్‌ని తన కుంభస్థలం మీద కూచున్న తన మావిటీడికి అందిచ్చింది. మళ్ళీ తిరిగి తన తొండాన్ని చాపి వంకరగా మెట్టులాగ పెట్టింది. ఇటువంటి దృశ్యాన్ని ఇదివరకు చాలాసార్లు చూసి ఉండడం వల్ల ఏం చేయాలో వెంటనే గ్రహించాను. నా ఎడం కాలు తొండం మడత మీద పెట్టి ఏనుగు రెండు చెవులు గట్టిగా పట్టుకున్నాను. ఏనుగు తన యజమానికి నన్ను అందించింది. తన ప్రయాణంలో తటస్థ పడ్డ ఎంతోమంది మంచి భారతీయులలో ఈ ఏనుగు, ఈ యజమాని అతి ముఖ్యమైన వాళ్ళు అని చెప్పాలి. కాని నాకు ఒక దుండగీడు కూడా భారత దేశంలో సైకిలు తొక్కుతున్నప్పుడే తటస్థ పడ్డాడు. ప్రమాదం నుండి బయట పడ్డప్పటికీ, అదొక మరపురాని భయంకర సంఘటన.

ఇది పోయిన ఫిబ్రవరి నెలలో ఏకబిగిన సైకిలు మీద 25 మైళ్ళ దూరం వెళ్ళుతున్నాను నేను. సుమారు 30 సంవత్సరాల వయస్సు గల ఒక శిఖ్ఖు నా వెంట పడ్డాడు. అదొక నిర్జన మార్గం. అడపాతడపా వెళ్ళే మనుష్యులు తప్ప సందడి లేదు. మొదట ఈ శిఖ్ఖును, అతని పాగాని, గడ్డం చూసికాని, అతని సైకిలు వెనకాతల గల పెద్ద తెల్లని మూట చూసి గాని నేను అనుమానించలేదు. చూడటానికి పెద్ద మనిషిలాగే ఉన్నాడు. రెండు మూడుసార్లు నాతో మాట్లాడటానికి కూడ ప్రయత్నం చేశాడు. ఎనిమిది మైళ్ళ దూరం ఇలా గడచి పోయాయి. కాని నాకు రానురాను అతని మీద అనుమానం, కొంచెం భయం కూడా ఎక్కువైంది. నేను జోరుగా సైకిలు తొక్క ప్రయత్నించాను. వాడూ ఇంకా జోరుగా సైకిలు తొక్కినా వెనుక పడ్డాడు. కూతవేటు దూరాన ఎక్కడా మనుషుల్లేరు. ముందు కెళ్లిన కొద్దీ ఇంకా మార్గం గతుకుల మట్టిరోడ్డు, మరీ అడవి మార్గం అని నాకు తెలుసు. పోనీ వెనుదిరిగి పారి పోదామా, నేను బయలుదేరిన గ్రామం చేరవచ్చు అనుకున్నాను. ముందుకు వెళ్ళడానికైతే '15' మైళ్ళు వెళ్ళాలి. వెనక్కి అయితే ఏడెనిమిది మైళ్లలో మనుషులున్న ప్రదేశం చేరుకోవచ్చు. వెనక్కి తిరిగేను. కాని అప్పటికే చాలా ఆలస్యమై పోయింది. ఆ శిఖ్ఖు నా హిప పాకెట్ (వెనుక జేబు) ఉన్న పాస్‌పోర్టు లాక్కున్నాడు. పాపం! దాన్ని వాడు పర్సు అనుకున్నాడు కాబోలు.

సైకిలెక్కి పరుగెత్తేడు. నేనొక్క ఉదుటున వాని వెంటబడి నా పాస్‌పోర్టు కోసం కేకలేశాను. వాడు సైకిలు తొక్కుతూనే ఉన్నాడు. నా శక్తి కొలదీ జోరుగా సైకిలు తొక్కి వాడి పక్కగా వెళ్ళి కాలుతో వాణ్ణి వాడి సైకిల్‌ని కిందపడేటట్లు బలంపూన తన్నాను. ఇద్దరం కింద పడ్డాం. వాడికిది చాల అవమానం అనిపించింది. ఉగ్రుడై కళ్ళ వెంట నిప్పులు కక్కుతూ ఆ మూటలో నించి ఒక పెద్ద ఇనుపకడ్డీ పట్టుకొని నా మీదకు రాబోయాడు. నేను నా సైకిలుతో సహా వెనక్కి వెనక్కి తగ్గుతూ తప్పించుకో బోయాను. అంతలో అట్నించి మరొక సైకిలు మీద ఎవడో పురుషుడే వస్తున్నాడు. కని నేను సహాయం కోసం కేక వేసే లోపునే ఆ సైకిలువాలా వెనుదిరిగి కాళ్లకి బుద్ధి చెప్పాడు.

ఇక నా ఆత్మరక్షణకు "రోజినాంటే" తప్ప వేరే ఆయుధం లేదు. తలకి దెబ్బతగిలకుండా పక్కకు వంగి, సైకిలెత్తి అదే బల్లెంగా, అదే ఆయుధంగా ఆ శిఖ్ఖును ఎదుర్కొన్నాను. నా సైకిలు దెబ్బ వాడికి ఎక్కువ తగిలిందో కాని వెంటనే వాడు నా పాస్‌పోర్టు కూడా అక్కడ విసిరేసి తన సైకిలు ఎక్కి పారిపోయాడు. నిజంగా నా సుదీర్ఘమైన ఈ సాహసయాత్రలో నేస్తంగా కాక, శత్రువుగా తటస్థపడ్డ భారతీయుడు ఇతడొక్కడే. ఈ గండం గడవడం నిజంగా నా అదృష్టంగానే భావించాను. పద్నాలుగు మాసాలు సాహసయాత్ర చేసిన తరువాత లిస్మోర్‌లో మా ఇంట్లో కూర్చుని నా కథ రాస్తూ ఉంటే మిగతా అన్ని సంగతులకన్నా ఎక్కువగా నా కనుల ముందు శరణార్థ బాలురే మెదలుతూ ఉంటారు.

[పై వారంతో సమాప్తం.]

## వంటలు

### మొక్కజొన్న పొత్తులతో రకరకాలు

ఇది మొక్కజొన్నపొత్తుల కాలం. వీధివీధి మొక్కజొన్నపొత్తులు పెద్దపెద్దవి అమ్ముతూంటే చిన్నవాళ్లకూ, పెద్దవాళ్లకూకూడా కొనుక్కువచ్చి, కాల్చుకుని తినబుద్ధి. స్కూళ్ల ముందరైతే ఆడవాళ్ళు, మగవాళ్ళు కూర్చుని అప్పటికప్పుడు కాల్చిన పొత్తులు అమ్ముతుంటే, వాటి కమ్మని వాసనలు అందరిచేతా కొనిపిస్తాయి. కాలేజి స్టూడెంట్లకయితే సిగ్గు. ఒక్కొక్కరూ వచ్చి చాటుగా కొనుక్కుని తింటారు. బజారుకి పంపిస్తే చిన్న పిల్లలు కాల్చిన మొక్కజొన్న పొత్తులు కొనుక్కుని తినకుండా రారు. ఉత్తరదేశంలో కాల్చిన మొక్కజొన్నపొత్తులు ఇమ్మంటే పొత్తుకి నిమ్మరసం, ఉప్పు రాసి ఇచ్చేస్తారు. పుల్లపుల్లగా, ఉప్పఉప్పగా అదొక రుచి. పెద్దవాళ్ళుకూడా ఇక్కడ అవి కొనుక్కుందుకు సిగ్గుపడరు. ఈ మొక్కజొన్న పొత్తులతో రకరకాలుగా ఫలహారాలు చేసుకుని తినవచ్చును.

మసాలాకూర : కొంచెం లేత మొక్కజొన్న పొత్తులను చిన్ని చిన్ని ముక్కలుగా కోసి, నీళ్లతో పుడకబెట్టాలి. అవి బాగా ఉడికిన తర్వాత ఉప్పు కారము, ఉల్లిమసాలా వేసి దించేసుకోవాలి. చక్కగా ఉడికినతర్వాత నీళ్లలాంటిది ప్లేట్లో పోసుకుని ఈ ముక్కలను దాంట్లో ముంచుకుని తింటూ వుంటే చాలా బాగుంటుందది. కాని వీటికి పొత్తులు లేతవి కాకపోతే బాగుండదు.

**గింజల వేపుడు** : మొక్కజొన్నపొత్తు గింజలన్నీ ఒలుచుకుని, మూకుడులో నేతితోకాని, డాల్డాతో కాని వేయించుకోవాలి. వేగిన తరువాత ఉప్పు, కారమూ, ఉల్లిపాయ తరిగినముద్ద వేసుకుని తీసేసుకుని తినవచ్చును. ఇలా వేగించుకున్న వేడి వేడి గింజలు ఒకసారి తింటే మొక్కజొన్న పొత్తులను చూసేసరికే అప్రయత్నంగా గింజలు వలిచే బుద్ధేస్తుంది.

**పొత్తు అట్లు** : దీనికికూడా గింజలు వలిచేసుకోవాలి. మధ్యాహ్నం అట్లువేసుకుందామనుకుంటే ప్రొద్దున్నే ఈ గింజలని నానవేసుకోవాలి. బాగా నానకపోతే నలగడం కష్టం. బాగా నానిన తరువాత మామూలుగా మినప అట్లు వేసుకుందుకు రుబ్బినట్లే రుబ్బాలి. పెనంమీద వేసుకుంటే సులభంగా వచ్చేస్తాయి. లేత వేపులో తీసుకుంటే మెత్తమెత్తగా ఒక రుచి, బాగా వేగిన తరువాత అయితే కరకరలాడుతూ ఇంకో రుచిలోనూ వస్తాయి.

**మొక్కజొన్న గారెలు** : వీటికికూడా అట్లలాగే ప్రొద్దున్నే వలిచిన గింజలు నానవేసుకోవాలి. మామూలు గారెలకులాగానే గట్టిగానే రుబ్బుకోవాలి. వలిగేటప్పుడు కష్టమనిపించినా, తింటూంటే ఆ శ్రమంతా మరిచిపోవచ్చును సులభంగా.

— విశారద ★






# ఫిలిప్స్ నోవోసోనిక్ రేడియోలు

★ అసామాన్య శబ్దగ్రహణము
★ అధునాతనమైన సాంకేతికాలు
★ సొమ్ముకు తగిన కొత్త రకములు

**PHILIPS**
**MAESTRO**
B6CA37A



రు.898/-6 బ్యాండ్లు

**PHILIPS**
**TRANSISTOR ACE**
B5CA29T



రూ. 665/- 4 బ్యాండ్లు

**MAJOR**
B5CA17A



రూ. 645/-4 బ్యాండ్లు

**TRANSISTOR PORTABLE**
L4CA28T
రూ. 415/-
3 బ్యాండ్లు



**PHILETTA**
DE LUXE



రూ. 278/- 3 బ్యాండ్లు

**MINOR**
B4CA27A



రూ. 415/- 4 బ్యాండ్లు

అనుమతి పొందిన సబ్ డీలర్లు:

1. విజయ ఎలెక్ట్రానిక్సు, విజయనగరం.
2. వాణి రేడియో హోము, అనకాపల్లి.
3. శ్రీ వెంకటేశ్వర రేడియో హవుసు, చింతపల్లి.
4. మోడరన్ మ్యూజికలు అండ్ మెడికలు స్టోర్సు, పార్వతీపురం.

పన్నులు అదనము

విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు అనుమతి పొందిన డీలర్లు:

టెలిగ్రాం: సౌండ్

## వైజాగు రేడియో కో.,

ఫోన్లు: 120, 42

విశాఖపట్టణం, శ్రీకాకుళం.





# గిరికథ

***లలిత***

మద్రాసులోని ఎస్ప్లనేడ్, కలకత్తాలోని మరేదో వీధిపేరూ స్వాతంత్ర్యానంతరం నేతాజీ సుభాస్‌చంద్రబోస్ రోడ్‌గా (ఎన్. ఎస్. సి. బోస్ రోడ్) మార్పు చెందేయి. పరిణామశీలమైనది కాలం. దానికి మార్పు సహజం. గిరులు— వాటి పుట్టు (తెలియదు) పూర్వోత్తరాలు (తెలిసినంత వరకు) ముచ్చటించుకునే ముందు, గిరికి నగము, అచలము అన్న పేర్లెలా వచ్చాయో, రాకముందు గిరి కథ లెలా ఉండేవో తెలుసుకుందాం :

నగ—రవి—జయం : కర్మ సూత్రానికి కట్టు వడిన కర్మసాక్షి అనునిత్యమూ మేరువుకు ప్రదక్షిణం చేస్తూండగా, ఓర్వలేక, వింధ్య తన చుట్టూ తిరగమని కోరి, విఫల మనోరథయై, విన్నబోయి, అహం దెబ్బతినగా, హుంకరించి, పెచ్చు పెరిగి, సూర్య చంద్రాదుల గతులను నిరోధించింది.

లోకానికి వెలుగూ లేదు, వేడీలేదు ! తెల్లదనమూ లేదు, చల్లదనమూ లేదు ! ! వాటిల్లిన ఈ లోకోపద్రవాన్ని వారించాడు లోపాముద్రాపతి అగస్త్యుడు. తాను తిరిగి వచ్చేవరకు అణగి ఉండమని ఆనతిచ్చాడు అగస్త్యుడు. తరలి వెళ్లిన అగస్త్యుడు తిరిగి వచ్చే దెన్నడు ? వింధ్య తల ఎత్తుకుని నిలిచే దెన్నడు ?

కొండ నాలుక్కి మందువేస్తే, ఉన్ననాలిక వూడినట్టయింది వింధ్యపని. మేరు నగానికే, రవికీ జయం కలిగింది. వింధ్యకి శృంగ భంగమైంది. (కొవ్వున పోతరించిన పొట్టేలు కొండనుఢీకొంటే కలిగే ఫలమే శృంగ భంగం ! !)

నగమూ, రవీ పాత్రలుగా ఉన్న మరోకథ యథా మూషిక మూషికాః. ఒకానొకప్పుడు ఒక మునికి ఒక యెలుకపిల్ల దొరుకుతుంది. ఆలోచనా శక్తి లేని జంతు జాలానికి ఆపద లెదురవుతాయని, తన్నివారణార్థం ఎలుకను కలికిగా మార్చి, ఏ్ర పెల్లో సంబంధాలు వెదుకుతాడు.

అంబోధి గంభీరుడని, తన పెంపుడు కూతుర్ని వరించమని అతనిని అర్థిస్తాడు. "పాలు పొడుగునా నా జలాలు ఇంకింపజేసే సూర్యుడు నాకన్న మిన్న కన్నెను అతనికిచ్చి పెళ్లి చెయ్యడం ఉత్తమం—" అని విన్నవిస్తాడు, సముద్రుడు.

సరేనని, మునిరాజు దినరాజు నర్థిస్తాడు. "నేను మబ్బుల చాటు వాణ్ణి. అతని (మేఘుని) ముందు నా ప్రతాపాలు, తాపాలూ పని చెయ్యవు. తాపసీ ! అతన్ని సంప్రదించండి" అన్నాడు సరోజాప్తుడు.

తనను చెల్లా చెదురు గావించే వాయువు తన కంటె గొప్పవాడని మేఘుడు వెల్లడిస్తాడు. ఎంత వీచినా సుంతైనా చలింపని కొండ తనకంటె గొప్పదని వాయువు వాపోతాడు. కడవంత గుమ్మడి కత్తిపీటకి లోకువన్నట్టు తాను ఎలుకకి లోకునని తన బలహీనత దాపరికం లేకుండా గిరీంద్రుడు మునీంద్రునితో ముచ్చటిస్తాడు. ముని యథా ప్రకారం కలికిని యెలుకను గావిస్తాడు.

.....ఇవి గిరులకి పలుకూ, చలనమూ గల వాటి కథలు. నాడు కొండలకి రెక్కలుండేవి. అవియెరిగి ఇబ్బందులు కలిగించగా ఇంద్రుడు వజ్రాయుధంతో వాటి రెక్కలు ఖండిస్తాడు. వాటి నుంచి వాటికి అచలములని (చలనము లేవిని) నగములనీ (గమనము లేనివి) నామాంతరాలు వచ్చేయి.

రవి తూరుపు కొండల్లో ఉదయించి పడమటి కొండలలో అస్తమిస్తాడు. ఆ కొండలకి క్రమంగా ఉదయాద్రి, అస్తాద్రి అని పేర్లు.

అనుకరణ సహజాత్వం గల మానవుడు అనుకూల వసతులు కల్పించుకోడానికి ఆదర్శ ప్రాయమైనవి కొండగుహలు. వాటిని చూసి, అనుకరించి, తల దాచుకుందికి నెలవేర్పరచుకున్నాడు మానవుడు.

కొండల్ని పగలగొట్టి బాటలు నిర్మించుకున్నాడు. మర్త్యుడు బాటలు వేసుకోడానికి కొండల్ని పిండిచేస్తే, అమర్త్యులు కవ్వంగా వాడుకున్నారు.

ఉదధి రత్నముల చేత తనియక, ఘోర కాకోల విషానికి వెరువక, అమృతము వొడము దనక— యత్నమును విడువని, నిశ్చితార్థంబు వదలని నిపుణ మతులకు, పాల వెల్లి భాండము కాగా, కూర్మము కుదురు కాగా, వాసుకి రజ్జువు కాగా, అమృతం చిలకడానికి మందరము కవ్వమైంది.

సురుల ప్రయత్నం ఫలించి, వాళ్ళు కొండెక్కేరు. కొండంత ఆశతో పాటుపడ్డ అసురుల ఆశాజ్యోతి కొండెక్కింది. కొండని తవ్వి ఎలుకని పట్టినట్టు

యుంది వాళ్ళపని. వాళ్ళ గుండెల్లో అగ్ని పర్వతాలు బద్దలై 'లావా' ప్రవహించింది.

గిరికీ హరికీ యేదో అవినాభావ సంబంధం ఉంది. హరి, గిరి ! గిరి, హరి ! కూర్మావతారంలో హరి గిరిని మోశాడు. వరాహలక్ష్మీ నరసింహ స్వామిని సింహాద్రి మోసింది. రామావతారంలో కొండలు రాముని సముద్రం దాటించేయి. కృష్ణావతారంలో కృష్ణుడు గోవర్ధన గిరిని చిటికెన వ్రేలితో మోశాడు.

గిరిధరుడన్న పేరు గిరిని ధరించిన హరికే కాక గిరిచే ధరింపబడిన హరునకు కూడా అన్వయిస్తుంది, నిగ్రహంతో విగ్రహ వాక్యం నిర్మిస్తే!

రజత గిరిధరుని సతి "హిమగిరి తనయే హైమవతి" శైలరాణ్ణందన ! నగరాజకుమారి ! గిరిజ ! శైలజ. అచ్చ తెలుగులో వడకు గుబ్బలి కూతురు.

కూర్చుని తింటే కొండలు సైతం తరుగుతాయని, శివుడు కొండ తలకింద పెట్టుకున్నా నాలుగు రాళ్ళ కోసం భిక్షాటనం— అవలంబించేడు.

కొండలపై గల పుణ్యక్షేత్రాలలో తిరుపతి భద్రాద్రి విష్ణుక్షేత్రాలు, శ్రీశైలం, కోటప్పకొండ మొదలగునవి శైవ క్షేత్రాలు. మన పూర్వ శిల్పి సమ్రాట్టుల పనితనమంతా దేవాలయాలపై మలచిన బొమ్మలలో వ్యక్తమవుతుంది.

హిందువుల శిల్పం, సంపదా కొల్లగొట్టాలని తురుష్కులు తలపెట్టేరు. పాపభీతి, దైవభక్తీ లేకుండా ఎన్నో దేవాలయాలు నేలమట్టం చేశారు. వాళ్ళకి సింహాచలం దగ్గర శృంగ భంగం జరిగింది.

# గిరికథ

గోకులపాటి కూర్మనాథకవి దైవభక్తి వల్ల పాపం పరాజితయై పుణ్యానికి జయం లభించింది. "వైరి హర రంహ సింహాద్రి నారసింహ" అనే మకుటంతో సీసపద్య శతకం చెప్పగా, లెక్కకు మిక్కిలి కంచు తుమ్మెదలు పుట్టుకొచ్చి తురుష్కులని తుమ్మెదల మెట్టవరకు వెంట బెట్టేయి. తురకలు వెను తిరిగి చూడకుండా పలాయనం పఠించారు.

ఎంత బలవంతుడైనా విధికి బానిసే అన్న సూక్తి పై సంఘటన వల్ల బుజువవుతుంది. దైవం తోడ్పడితే రాజధర్మాన్ని ఉల్లంఘించినా ఫరవాలేదు. ఇందుకు తార్కాణం సర్కారు వారి సొమ్ముతో కంచెర్ల గోపన్న భద్రాచలంలో కట్టించిన రామాలయమే. అతని జన్మభూమి కొండపల్లి.

కంచెర్ల గోపన్న కొండ మీద గుడి కట్టిస్తే, కవికుల తిలకుడు కాళిదాసు ఆషాఢ మాసపు ప్రథమ దివసాన సానువుపై యక్షునిచేత అతని ప్రేయురాలికి మేఘ సందేశం బట్వాడా చేయిస్తాడు.

మహాకవి మేఘ సందేశం వ్రాయగా, కవి సమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు గిరికుమారునిచే ప్రేమ గీతాలు ఆలపింప జేశారు. ప్రభుత్వ ఆస్థాన కవి కీ. శే. శ్రీ పాద కృష్ణమూర్తిగారు "వేదాద్రి మహాత్మ్యం" విరచించారు.

కొండలకీ, సాహిత్యానికీ, కళలకీ మంచి అనుబంధం ఉంది. ప్రసిద్ధులైన కథకులు, నాటక రచయితలు, కవులు, నటులు, ప్రభువుల పేర్లు పరిశీలిస్తే వాటిలో కొండలు కనబడి తీరుతాయి.

రెండు పుణ్యక్షేత్రాలు కలసి యేర్పడిన నామధేయం గౌరవనీయులైన గవర్నరు మాన్యశ్రీ వి. వి. గిరిగారిది. శ్రీవారి పూర్తి పేరు వరాహగిరి వెంకటగిరి.

ఈ రచన మా ప్రాంతంలో నచ్చక పోయినా, ఇతర ప్రాంతీయులకి నచ్చినా "దూరపు కొండలు నునుపు" అన్నసామెత నిజమవుతుంది. రచన ఇంకా పొడిగిస్తే కొండవీటి చేంతాడవుతుంది.

"గిరికథ" సరి కొత్త పేరు కాదు. పాతదే అని మాత్రం గుర్తుండి, ఎవరి వల్ల ఆ పేరుకి ప్రఖ్యాతి లభించిందో తెలియకపోతే అది కొండ గురుతు.

ప్రప్రథమంగా గిరికథ చెప్పినవారు, సంగీత, సాహిత్య, నృత్య నిష్ణాతులు, బహుభాషాకోవిదులు హరికథా పితామహులు శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారు. ఆయన శత జయంతికి ప్రత్యేకంగా తపాలా బిళ్ళలు వెయ్యాలని సంకల్పించడం ముదావహం. ఆ సత్సంకల్పం సిద్ధించాలని అందరి ఆశయం. కొండంత దేవుడాయన. కొండంత పత్రి నేనెలా తేను ? చంద్రున కొక నూలుపోగు.

ఆ కళాపూర్ణునకు వినయ వినమిత ప్రణామములు. 



## భారీయెత్తున దేశరక్షణకు

## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

---

# దగ్గును పోగొట్టుకోండి

# దగ్గు

త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా దగ్గు పోవుటకు

# గ్లైకోడిన్

## టెర్ప్ వసాకా

గ్లైకోడిన్ ఉత్తమమైన దగ్గునివారిణి అనుటకు

6 కారణములు:

1. వివిధ రకముల దగ్గులకు నిశ్చయముగా పనిచేస్తుంది.
2. మంచి ఔషధములు చేరినది. డాక్టర్ల సమ్మతిని పొందినది.
3. చిన్నా పెద్దా అందరికి నచ్చే రుచిగలది.
4. సిఫార్సు చేసిన మోతాదు ఏ చెడునూ కలిగించదు.
5. 4 పొదుపైన సైజులలో లభిస్తోంది.
6. నమ్మకమైన అలెంబిక్ కంపెనీ తయారు.







**30 ఏళ్లకు పైగా దగ్గుకు యింటి మందుగా వాడబడుతోంది**

GTY.1282 TEL EVEREST



# అబ్బునాధం అచ్చుకండూతి

పెండ్యాల నాగాంజనేయులు

ఫెడేల్‌మని తలుపు తోసుకుని గదిలో ప్రవేశించాడు అబ్బునాధం- ఒకచేతిలో ఫ్లాస్కు, మరోచేతిలో సగం తెరచిన 'చంద్రవంక' వార పత్రికతో. వస్తూనే పత్రిక నేలకేసి కొట్టి "ఏమిటిది ?' అంటూ గర్జించాడు. మూడు రోజులుగా జ్వరంతో బాధపడుతున్న అతని రూంమేట్ సుబ్బుతాత అదిరి పోయాడు. నెమ్మదిగా పక్కనే పడిన పత్రికను తీసి చూశాడు.

ఆశ్చర్యం ! తను మొదటిసారిగా రాసిన 'గుడ్డివాడు' అనే కథ అచ్చయింది. బోలెడు సంతోషంతో "హార్రె ! నా కథ అచ్చయిందే !" అనేశాడు.

"మిత్రద్రోహి !" అని అరచాడు అబ్బునాధం.

"ఏమిట్రోయ్ దూర్వాసుడా ?" అర్థంకాక నవ్వుతూ అడిగాడు సుబ్బుతాత.

"చండాలుడా ! రాక్షసుడా ! పాపీ ! వంచకుడా ! మోసగాడా ! అబద్ధాలకోరా" గెంతుతున్నాడు అబ్బునాధం.

అబ్బునాధం ప్రవర్తన మరీ అయోమయంగా ఉంది సుబ్బుతాతకు.

"విషయ మేమిటో చెప్పకుండా అలా గెంతుతావే వేరా అప్పలసామీ?" విసుక్కున్నాడు సుబ్బుతాత.

"నువ్వింత గోముఖ వ్యాఘ్రానివనీ, మేకవన్నె పులివనీ, పయోముఖ విష:కుంభానివనీ తలచలేదురా సుబ్బిగా."

"ఒరే ఉగ్రనరసింహం ! నీ గొడవ నాకే సర్థం కావడంలేదురా ! జ్వరపీడితుణ్ణి. నామీద దయవుంచి ఆ కాఫీ నా ముఖాన పోసి నన్ను రక్షించరా" అని వేడుకున్నాడు సుబ్బుతాత.

"కాఫీయా !?! ఛీ ! ఇప్పటికే పాలుపోసి పామును పెంచి సర్పదష్టుడ నయ్యాను".

"ఈ చచ్చినాడికి కంఠతా వచ్చినవన్నీ నామీద ప్రయోగించి నా ప్రాణాలు తీస్తున్నాడేం ?" అనుకున్నాడు సుబ్బుతాత.

"కుంపట్లో ఏకులు దాచుకున్నట్లూ, కొరివితో తల గోక్కున్నట్లూ అయింది నాకు," అంటూ తలపట్టుక్కూర్చున్నా డబ్బునాధం.

"నాకీ జ్వరం తగ్గిపోతే బావుణ్ణు ! వెధవని గుండు గొరిగించి నిమ్మకాయలు రుద్ది యీ పైత్యం దింపేద్దును" అని ముచ్చటపడ్డాడు సుబ్బుతాత తనలో.

"ఇంత జిత్తులమారి నక్కవనీ, తేనెపూసిన కత్తివనీ నే నెప్పుడూ అనుకోలేదురా సుబ్బాయ్" అన్నాడు అబ్బునాధం పళ్ళు పటపట లాడిస్తూ.

"ఒరేయ్ విశ్వామిత్రం ! నేనేం చేశానురా ? నేనేదన్నా తప్పుచేస్తే క్షమించరా ! అసలు విషయం చెప్పరా !" అంటూ కాళ్ళబేరానికి దిగాడు సుబ్బుతాత.

గభాల్న వంగి, పత్రిక లాక్కుని "ఇదేమిట్రా?" అని ప్రశ్నించాడబ్బునాధం— పుస్తకంమీద చేత్తో కొడుతూ.

"నేను రాసిన కథ ....."

"అది సరేనోయ్ అమ్మమ్మా ! ఇదేమిటంటా ?"

"నా పేరు !"

"మరి నా పేరేం చేశావ్ ? అని అడుగుతున్నా!" తా డెత్తున లేచా డబ్బునాధం.

"నీపే రేమిట్రోయ్ శరభయ్యలింగం ? నేను రాసిన కథకి ?"

"ఆ ! అందుకేరా ! నువ్వు తుచ్చుడవై, అబద్ధాలకోరువై దేవుణ్ణి, దేవుడి ఎదుట చేసిన ప్రమాణాన్నీ ధిక్కరించావు అంటున్నా. అర్థమైందా ?" వికటంగా ప్రశ్నించా డబ్బునాధం.

నోరెత్తలేకపోయాడు సుబ్బుతాత. కొద్దిగా గతంలోకి తొంగిచూస్తే అబ్బునాధం మాట నిజమే నేమో ననిపించింది.

"ఏం ? నువ్వు కథ రాస్తే నీ పేరుతోబాటు నాపేరు కూడా రాయగూడదా ? నా పేరంత విషమైందా ? నేనంత పనికిరాని వాణ్ణయానా నీకు ?" అబ్బునాధం తుఫానులాగా చెలరేగాడు.

"ఒరే అబ్బునాధం ! నువ్వు మీ అక్కయ్య పెళ్ళికెళ్ళినప్పుడు ఏం తోచక ఈ కథ రాశాన్రా ? నువ్వు లేకపోవడంవల్ల ...." ఏదో ఒకవిధంగా తన దోషాన్ని కప్పిపుచ్చుకోవాలని సుబ్బుతాత తాపత్రయం.

అబ్బునాధం అంత తేలిగ్గా వదుల్తాడా ! చెడామడా దులిపేశాడు—

"ఆహా ! ఇదేమన్నా దస్తావేజా ? ప్రామిసరీ నోటా నాయనా నేనుండి సంతకం పెట్టడానికి ? బండెడు మురికిగుడ్డలు విడిచి నువ్వు మీవూరెళ్ళినప్పుడు నువ్వు లేవని నీ బట్టలు చాకలాడికెయ్యడం మానానా ? నా పద్దుతోబాటు నీ పద్దు కూడా రాశానే ! ఆమాత్రం విశ్వాసం లేదన్న మాట ?!" అని.

"అది కాదురా! నీపేరు రాయడం మర్చిపోయాను" తన ప్రయత్నం మానలేదు సుబ్బుతాత.

"మర్చిపోతావురా నువ్వూ ! మర్చిపోవూ ? ....

అసలెందుకు రాశావురా యీ కథ ?" అబ్బనాథం అడ్డప్రశ్న.

"ఏం లేదురా ! ఏమీ తోచకా .... కాస్త డబ్బు మీద ఆశ పుట్టేను."

"ఎందుకురా ఇన్నబద్ధాలు ? ఏం డబ్బులేక చస్తున్నావా ? నెలయ్యేసరికి ఇంటినుంచి వంద రూపాయలూ వస్తూనే ఉన్నాయిగా ! ఇంకా తక్కువైతే నన్నడుగుతూనే ఉన్నావుగా ?"

"ఎబ్బీ ! నిజంగారా ! నామాట నమ్ము ! డబ్బు కోసమే .... "

"కా .... దు. మళ్లీ వాగావంటే ముమ్మారు చెప్తాను. కాదు ! కాదు ! కాదు" అబ్బనాథం మూర్ఖత్వం చూస్తే నవ్వొచ్చింది సుబ్బతాతకు.

"మరెందుకు రాశాననుకుంటున్నావురా ?" అని ప్రశ్నించాడు చిరునవ్వుతో.

"అదీ నానోటే చెప్పిస్తావా ? వూ ! చెప్తా నయ్యా ! నీకు—నీ రచన, నీపేరు అచ్చులో చూసు కుని మురిసిపోవాలని దుర్బుద్ధి పుట్టింది. అవునా ?!" చేతులు తిప్పుతూ, గొంతెత్తి అరిచాడు అబ్బనాథం.

"ఛ ! కాదురా" సమర్థించుకోబోయాడు సుబ్బతాత.

"వాగకు ! నాకు మళ్లీ చిరాకు కల్గుతుంది! నీకు అచ్చు పిచ్చి పట్టింది. ప్రతి విషయంలోనూ నాతో భాగస్తుడవయ్యేవాడివి .... పేర్లు అచ్చు కొట్టించే విషయంలో స్వార్థపరుడి వయ్యావు. నీ ఒక్కడి పేరు అచ్చేయించుకున్నావు. అది చూసి నవ్వేదునన్నూ కూర్చోమన్నావు" కుండ పగలగొట్టి నట్లు చెప్పాడబ్బనాథం.

"ఇప్పుడేం చెయ్యమంటావురా ?"

"చేసిన పాపానికి పశ్చాత్తాపపడు. ఆంజనేయ స్వామికి క్షమాపణ చెప్పుకో ! నా పేరుకూడా వెంటనే అచ్చేయించి పాపపరిహారం చేసుకో" ఉపాయం చెప్పాడు అబ్బనాథం.

"నీ పేరు వెంటనే అచ్చేయించడమంటే ..." అంటూ నీరసంగా లేవబోయాడు సుబ్బతాత.

"అంటే .... వెంటనే నాకో కథ రాసిపెట్టి, రచన : అబ్బనాథం అనే పేరుతో పత్రిక్కు పంపించు. వూ ! ఈ కథ పంపేసిన తర్వాత, ఇక మీద నువ్వు చెయ్యబోయే రచనలన్నీ "అబ్బ నాథం— సుబ్బతాత" అనే పేర్లతో పంపిద్దాం" సంబరపడ్డాడబ్బనాథం.

సుబ్బతాతకి ఆలోచన నచ్చలేదు.

"నేను రాయడ మేమిట్రా శోభనాచలపతీ ! నువ్వే ఏదన్నా రాసి పంపించు" అన్నాడు మెమ్మదిగా.

పళ్లబిడ్డున్న అబ్బనాథం మళ్లీ నేకొక్కడు కొద్దిగా.

"అదుగో !......అందుకే నా పేరచ్చు పడకూడ దనే దుర్బుద్ధి నీకు పట్టిందీ అన్నాను" అని మళ్లీ నింది నోపాడు.

"అహా : నా ఉద్దేశ్యం.........." నసిగాడు సుబ్బితాత.

"ఏహా నోర్ముయ్ ! నేనెప్పుడన్నా కథలు రాయగా నువ్వు చూశావట్రా ? అపార్జుటియు సన్యాసి ! నోర్మూసుకుని వచ్చినట్టు కథ రాసిపెట్టు' ఆజ్ఞాపించాడబ్బనాథం.

"ఇప్పుడేం కథ రాయనురా? అసలే జ్వరంగా వుంది. ఏం రాయాలో ఆలోచించాద్దూ ?" తప్పిం చుకుందామని ప్రయత్నించాడు సుబ్బతాత.

"నువ్వేం రాశావు చెప్పు ?"

"ఏదో గుడ్డివాడి కథ"

"అయితే నాకు కుంటివాడి కథ రాసిపెట్టు"

"కుంటివాడి కథేమిట్రా సహ్రసనామం?"

"మరి గుడ్డివాడి కదేమిట్రా సర్వనామం?"

నవ్వు, కొంచెం చిరాకూ కల్గాయి సుబ్బతాతకు.

"అబ్బ ! చంపుతున్నావురా ! ముందు కాస్త కాఫీ ఇవ్వరానక్షత్రకం. అసలే నీరసంగాకూడా ఉంది" మళ్లా కాఫీకోసం దేబిరించాడు సుబ్బతాత. "ముందు కథ సంగతి తేల్చరా కాలకౌశికం ! తర్వాత కాఫీ ఏమిటి? రొట్టికూడా వెన్న రాయించి పట్టుకొస్తా" కొంచెం ఆశ చూపించాడు అబ్బనాథం.

"ఏమిట్రా ఆచారక్నా నీ మొండితనం? రోగం బాధపడుతుంటే కాఫీకూడా ఇవ్వకుండా ఏడి పిస్తావ్?" జాపగారిపోయాడు సుబ్బతాత.

"నేను కాఫీ ఇవ్వక కాసేపే ఏడిపించారా భగ వాన్నా ! నువ్వున్నావే. నువ్వు......... నీ పేరు మాత్రం అచ్చేయించుకుని నన్ను శాశ్వతంగా ఏడిపిస్తున్నావ్ !" ఎత్తిపొడిచాడబ్బనాథం ప్రతి మాట వత్తి పలుకుతూ.

ఇహ లాభం లేదనుకున్నాడు సుబ్బతాత.

"సరేరా ! కాగితాలూ, కలం ఇలా తగలెయ్" అంటో లేచి కూర్చుని గోడ నానుకున్నాడు.

## అందుకో పచ్చు...

రాజకీయవాదివి కావాలంటే
రవ రవలు పుట్టించడం రావాలి !
మినిస్ట్రు వవాలంటే
మిడి మిడి జ్ఞానమున్నా కావాలి !

పదిమందిలో నీ పేరు
పలుమార్లు దొర్లిపోవాలి !
ఏ పేపర్లో చూసినా ——
ఏదో ఓమూల నీపేరుండాలి !

అందుకు ముందుగా
అందరితలలో నాలుకలా
అహర్నిశలూ శ్రమించి
హుందాగా మెలగ్గలగాలి !

సర్టిఫికెట్ల ప్రసక్తే లేదు !
నపరాన్నతనుగూర్చునవ్యసిస్తే చాలు !!
కంశం అనేది బాగుంటే ——
కలలన్నీ ఇట్టే ఫలిస్తాయి !

పైకొస్తున్నవా డెవడో చూసి
పాదాభివందనం చేయాలి !
లక్ష్యణ్ణించి ఆతనికి ——
బాకాలా బహిరంగమవాలి.

అందరూ అసలు వాణ్ణి మర్చి
బాకానే బహు చక్కగా గుర్తిస్తారు !
అప్పుడు అసలు దశ ఆవిర్భవిస్తుంది
అందుతో ఆకాశా న్నందుకోవచ్చు !!

—శ్రీనివాస కాశ్యప.

అబ్బనాథం తెచ్చిచ్చాడు.

"ఆఁ ! అంత ఆర్జెంటేం నాన్నగారూ ! ముందు 'కుంటివాడి కథ' అని హెడ్డింగు పెట్టండి"

పెట్టాడు తాత— కాఫీ ఇవ్వమని సంజ్ఞ చేసా.........

"రచన అబ్బనాథం అని రాయరా !" అంటూ సుబ్బతాత నెత్తిన మొట్టాడబ్బనాథం.

అదీ రాశాడు సుబ్బతాత —"అబ్బ" అని తల తడుముకుంటూ.

చటుక్కున సుబ్బతాతని ప్రేమతో కౌగి లించుకుని, "మంచాడు మా సుబ్బినాన్న" అంటూ "ఒరేయ్ ! నానిగా ! ఇదిగో కాఫీ తాగి గబగబా కథ రాసేయ్. ఈలోగా నేను బజారెళ్లి రెండు రొట్టెలు—వెన్న, జామ్ పులిమించి పట్టుకొస్తా ! ఏమా !" అంటూ గ్లాసులో కాఫీ పోసి సుబ్బతాత ముందుపెట్టి పరుగెత్తుకపోయాడు అబ్బనాథం.

గుటుక్కున కాఫీ గొంతులో పోసుకుని, ఏం రాయాలో, ఎలా రాయాలో, కుంటివాడి కథేమిటో తెలియని సుబ్బతాత—

"దిక్కుమాలిన కథరాసి నా పీకలమీదికి తెచ్చుకున్నాను." అని విచారించి, నిట్టూర్చి, కాగి తాలన్నీ చెరగొట్టడం సాగించాడు.

* * *

ఒకళ్ళ ముక్కూ మొహం మరోడికి తెలియ కుండా ఇద్దరూ ఇంటర్మీడియటులో క్లాస్‌మేట్సు అయ్యారు. వీడి ముక్కలా ఉంటుంది. వీడి మొహ మిలా వుంటుంది,అని ఇలా మొదటి సంవత్సరంలో రెండో సంవత్సరం క్వార్టర్లీ పరీక్షలూ గడిచాక, ఎల్లిద్దరికీ ఒక్క రోజునే తెగా కష్టమూ వచ్చి కూర్చుంది. ఏవిటీ ?! అబ్బనాథం ఉన్నఫళంగా రూం ఖాళీ చెయ్యాల్సి వచ్చింది. పోతే— సుబ్బతాత మానవేంద్ర ముఖర్జీ విరచిత శాన్సోర్టెక్ హిస్టరీ సంపాదించడానికి చేసిన కడసారి ప్రయత్నమూ ఖాళీ అయింది.

ఎప్పుడూ ఏడ్చ టానికి, విచారించడానికి ఏకటి ప్రదేశాలు అనువైనవి కాబట్టి, ఇద్దరూ తెలుగు క్లాసుల్లో, చీకట్లో మరుగుపడిన ఆఖరు బెంచీల్లో మొదటిసారిగా ఒకరి పక్కనే మరొకరు కూర్చోడం తటస్థించింది. అప్పుడే ఒకళ్ళనొకరు పలకరించుకున్నారు. ఒకరి కష్టం మరొకరి చెవిలో వేసుకున్నారు ఒకరినొకరు ఓదార్చుకున్నారు. ప్రేమించుకున్నారు.

"మీకభ్యంతరం లేకపోతే నా రూములో మీరుండవచ్చు" అని కూశాడు సుబ్బతాత.

"అయితే నా హిస్టరీ నోట్సు మీరూ చదువు కోవచ్చు" అని పేలాడు అబ్బనాథం.

ఆ రోజు సాయంత్రమే కాలేజీ వదలగానే అబ్బ నాథాన్ని రూం ఖాళీచేయించి తన రూములో ప్రతి ష్ఠించాడు సుబ్బతాత.

వెంటనే ఇద్దరూ కలసి తమ ఇష్ట దైవమైన ఆంజనేయస్వామి కోవెలకెళ్లి "స్వామీ ! మేమిద్దరం ఇక నామురోనే ఉండి, వచ్చే ఒడుదుడుకులన్నీ, జరిగే కష్టసుఖాల్ని, పొందే సుఖసంతోషాల్ని సమా నంగా పంచుకుంటూ ప్రాణానికి ప్రాణమై, మానానికి మానమై, దేహానికి దేహమై, మనసులో మనసై, వీడే నేనై, నేనే వీడై, ఈ ఇంటర్మీడియేట్ అనే సాగరాన్ని ఎధిస్తామని నీ ఎదుట ప్రమాణం

# అబ్బునాధం

చేస్తున్నాం. [illegible] స్వామివారి వారి ఎదుట ప్రమాణంచేసి, ఆశీర్వాదం పుచ్చుకున్నారు.

అప్పట్నుంచీ అలాగే ఉండేవారు.

ఇద్దరూ ఒకే రకం టూత్ బ్రష్ వాడేవాళ్ళు. ఇద్దరూ ఒకే రకం టిఫిన్ తినేవాళ్ళు. ఒకేసారి ఒకేరకం భోజనం చేసేవాళ్ళు. ఒకే పక్కమీద నిద్రించేవాళ్ళు. వీడు సిగరెట్ కాలిస్తే వాడూ కాల్చాల్సిందే. వీడు శనివారం చేస్తే వాడూ శనివారం చేసేవాడు. ఒకడికి జ్వరమొచ్చి లంఖణం కడితే మరోడూ లంఖణం కట్టేవాడు. వాడికి పథ్యంనాడే వీడికీ పథ్యం. అబ్బో ఒక్కటేమిటి ? అవలంబించడాని కనువైనవన్నీ ఇద్దరూ సమానంగానే పంచుకున్నారు.

ఇలా ఉంటున్నప్పుడు—అబ్బునాధానికి చెప్పకుండా, అతను లేనప్పుడు గబగబా 'తగుదునమ్మా' అంటూ వో కథ రాసి కేవలం తనొక్కడి పేరూ గొప్పగా 'సుబ్బుతాత' అని అచ్చేయించుకుంటే కోపంరాదూ అబ్బునాధానికి ?

సుబ్బుతాత ఒక్కడూ అందలమెక్కి కూర్చుంటే మరి అబ్బునాధం గతేమిటి ? అని. అతని పేరు మాత్రం అచ్చుపడొద్దూ ? అతను మాత్రం అందలమెక్కి కూర్చోవద్దూ ? లేకపోతే ఇద్దరి మధ్య ఉండవలసిన సమానత్వం దెబ్బతినదేమో ? అందుకే న్యాయంగా కోపగించుకుని, కేకలేసి, తనకు రచనలు చేయడం చేతకాదు కాబట్టే, సైగా సుబ్బుతాత తనకు ద్రోహం చేశాడు కాబట్టి, అతడివేతో సినిమాలమీద వో 'కుంటివాడి కడ'నుంచి పత్రిక్కి పంపేశాడు. అప్పుడుగాని అతని మనసు శాంతించలా !

ఇంకా మంచివాడు గాబట్టి, సుబ్బుతాతనంతటితో క్షమించి, అతనికి సైద్య, ఫల, ఆహారాది సహాయాలతో జ్వరం నివారణ్ణి చేసి తొంటి వతె మెలగసాగాడు.

సరిగ్గా కథ పంపించిన పదమూడోనాడు అదే కథ మరో కొత్త కవరు తొడుక్కుని ఆనందంగా తిరిగి వచ్చింది. ఏ దిక్కుమాలిన క్షణాన వచ్చిందో గాని, మిత్రుల మధ్య సమసిపోయిందనుకున్న వైషమ్యం తిరిగి తలెత్తింది. తత్ఫలితం —

అబ్బునాధం తోక తొక్కిన త్రాచయ్యాడు.

సుబ్బుతాత పడుం విరిగిన పామయ్యాడు.

"మరోసారి నువ్వు దుష్టుడవనీ, కపటివనీ, కరడుగట్టి మూర్తీభవించిన స్వార్థానివనీ, నయవంచకుడవనీ నిరూపించుకున్నావు. ఈ దిగంబర సత్యానికి నీపే రచ్చేయించుకున్న నీ కథా, నా పేరుతో పంపిస్తే తిరిగొచ్చిన నా కథా ప్రత్యక్ష సాక్ష్యాలు" బుసలుకొడుతున్నాడు అబ్బునాధం.

పాపం ఏం చెప్పగలడు సుబ్బుతాత ? కాసేపు నోరుమూసుకుని, సహించి, కడుపులో దుఃఖం కళ్ళల్లో కెక్కి నీరుగారేసరికి --

'ఒరే అబ్బునాధం ! నన్నపార్థం చేసుకోకురా ! జ్వరంతో ఉండడం మూలంగా సరిగ్గా రాయలేకపోయానేమో !'' అంటూ అతడి నెత్తం పుచ్చుకున్నాడు. అతని చెయ్యి తోసిపారేసి,

"ఇన్నాళ్ళూ నీ మాటలు తేనె వూటలనీ, కళ్ళు కారుణ్యపూరితాలనీ నన్ను నమ్మించావు. కాని అవన్నీ నీటిమూటలనీ, విషపూరితాలనీ ఇప్పుడు గాఢంగా తెలుసుకున్నాను. ఇక నువ్వు నన్ను మోసం చెయ్యలేవు సుబ్బుతాతా ! మోసం చెయ్యలేవు" అంటూ తెలుగు సినిమాలో హీరో పడేటంత బాధా పడ్డాడు పాపం అబ్బునాధం.!

"ఈ ఒక్కసారి నా మాట నమ్మరా ! మళ్ళీ సరిదిద్ది నా ఖర్చులతో పంపించి, నీపేరచ్చేయిస్తాను" అంటూ నచ్చజెప్పబోయాడు సుబ్బుతాత.

"నాకు రచించడం చేతకాదనేగా నువ్వు నన్నిలా మోసపెడ్తోంది ?" అన్నా డబ్బునాధం రుద్ధ కంఠంతో.

"అబ్బె ! అంతమాటనకేదురా! నామాట విను" ఆ కథలంతే ! సరిదిద్ది .... "

"ఏమీ అక్కర్లేదు ! ఇకమీద నేనే రచిస్తాను'. అన్నా డబ్బునాధం గంభీరంగా.

"అది కాదురా ...."

"మాట్లాడకు ! ఇప్పటికే మనమధ్య సమానత్వం నశించింది. నశించిన సమానత్వాన్ని తిరిగి నెలకొల్పుతాననే ఆశపడ్డాను. మోసపోయాను. ఇక నీవల్ల కాదు. నువ్వు చెయ్యవు. నేనే దానికి పూనుకుంటున్నాను. ఇప్పుడే—ఈ క్షణమే—నేనే రచిస్తాను. నాపేరచ్చేయించుకుంటాను. అంతవరకూ నువ్వు నాతో మాట్లాడకు. మాట్లాడ్డానికి ప్రయత్నం చెయ్యకు. ఈ రూములో ఉన్నంతసేపూ మనం ఒకరి మొహం మరొకరు చూసుకోడానికిగానీ, ఒకరి వస్తువు మరొకరం వాడుకోడానిగ్గానీ వీల్లేదు. ఇదే నా తుది నిర్ణయం దీని కింక తిరుగులేదు." అంటూ అప్పటికప్పుడే తన సామానంతా ఒకవైపుకీ, సుబ్బుతాత సామానంతా మరోవైపుకీ తోసేసి పెద్ద దుప్పటితో గదిని రెండు ముక్కలు చేసేశాడు అబ్బునాధం.

అదృష్టవశాత్తూ ఆ రూముకు ముందువైపు నొక ద్వారం, వెనకవైపు మరో ద్వారం ఉన్నాయి.

ఏనాడూ స్వబుద్ధి నుపయోగించని అబ్బునాధం ఆనాటినుంచీ దాన్ని ఉపయోగించి రచన చెయ్యడం మొదలుపెట్టాడు. అహోరాత్రాలు లదేపని. రచిస్తున్నాడు. పత్రికలకు పంపిస్తున్నాడు. అవి తిరిగొస్తున్నాయి. అయినా అతడు ధైర్యంవీడక అలాగే తన విధి (సమానత్వం కోసం) నెరవేర్చుకుంటున్నాడు.

సుబ్బుతాత రోజూ ఆంజనేయస్వామి దర్శనం చేసేవాడు.

"స్వామీ ! మామధ్య తిరిగి సమానత్వం ఏర్పడేలా చూడు. మా ఇద్దరిమధ్య నడిచే మాయతెర తొలగించు. అబ్బునాధం రచన అచ్చేయించు" అని వేడుకునేవాడు. ఆంజనేయస్వామి ఏదో పత్రిక్కి ఎడిటరైనట్టు ! అబ్బునాధం రచన కోసం కన బడిన ప్రతి పత్రికా కొని చూడ్డం మొదలెట్టాడు రెండు నెలలు గడిచినా ఎక్కడా అబ్బునాధం రచన అచ్చయిన ఛాయలుగాని, తమ మధ్య నశించిన సమానత్వం తిరిగి ఏర్పడే సూచనలు గాని కన్పించలా ! యూనివర్శిటీ పరీక్షలు దగ్గర కొచ్చాయి. సరిగ్గా నెలరోజులే ఉన్నాయి. పరీక్షలంటే అన్నీ బట్టీ పట్టి కూర్చునే అబ్బునాధం రచనా వ్యాసంగం వీడలేదు.

సుబ్బుతాతకు రోజుకో యుగంలాగుంది. అబ్బునాధం దగ్గర శాన్ఫోర్డైజ్డ్ హిస్టరీ ఉండిపోయింది. వాడి రచన, పేరూ అచ్చయితే గాని వాడీ తెరా తొలగించడూ, ఆ హిస్టరీ బుక్కూ ఇవ్వడు. ఎలా ? తన మొర ఎవరాలకిస్తారు ? ఏ విద్యార్థి మాత్రం తన చదువు త్యాగంచేసి తనకు పుస్తకం ఇస్తాడు ?

ఇదే బాధతో, పరీక్ష పోతుందనే భయంతో ఒక్క ఆంజనేయస్వామినే కాక ఆ వూర్లో ఉన్న ప్రతి దేవుణ్ణీ ఆశ్రయించాడు. మొరపెట్టుకున్నాడు. ఇంకా -- రావిచెట్టుకు మొక్కాడు. జమ్మిచెట్టుకు ప్రదక్షిణలు చేశాడు. వేపచెట్టుకు పసుపూ, కుంకం పెట్టాడు.

ఈ దేవుళ్ళ వ్యాపకంతో అసలు చదువుకూడా మన్నా జాట్టాడు. ఎప్పటికప్పుడు కొత్త పత్రికలు కొంటూనే ఉన్నాడు. తిరగేస్తూనే ఉన్నాడు. అతడికేం లేదు. ఒక్క 'అబ్బునాధం' అని అచ్చులో కనబడితే చాలు. అదే అతని ఆశ— ఆశయం కూడాను.

ఓ రోజున —

కొత్తగా కొన్న పత్రికలన్నీ తిరగేసి, నిరాశ చెంది, నిట్టూర్చి, ఏడుపొచ్చి, కన్నీరు, మున్నీరుకాగా పక్కమీద వాలాడు.

మరి కాసేపటికి అబ్బునాధం తలుపులుతీసి, హుషారుగా ఈలవేస్తూ తన వాటాలోకి ప్రవేశించడం జరిగింది. మరి రెండు నిముషాల్లో వో పత్రిక తెరమీదుగా ఎగిరివచ్చి సుబ్బుతాతమీద పడింది.

ఉలిక్కిపడ్డాడు సుబ్బుతాత. 'చంద్రవంక' వారపత్రిక ! చేతిలోకి తీసుకున్నాడు. ఆహా ! దేవుళ్ళు తన మొరాలకించారు. మోడై పోతున్న తన విద్యావృక్షం తిరిగి చిగిర్చింది. వెంటనే పుష్పించింది. అంతలోనే ఫలించింది. నశించిన సమానత్వం తిరిగి అబ్బునాధంచే నెలకొల్పబడినట్టే ! తమమధ్య ఇన్నాళ్ళుగా నిలబడ్డ మాయతెర ఈరోజుతో తొలగిపోతుంది ! తిరిగి ఇద్దరూ మాట్లాడుకుంటారు! తనకు హిస్టరీ పుస్తకం ప్రాప్తిస్తుంది. బుద్ధిగా ఇద్దరూ కలిసి స్వామివారి ఎదుట ప్రమాణం చేసినవిధంగా ఇంటర్మీడియేట్ పాసౌతాన్ని చదువుతారు !

ఆహా, అచ్చులో 'అబ్బునాధం'!! పక్కగా ఎర్ర సిరాతో అండర్లైన్ చేశాడు కూడా. ఎంత అందంగా ఉందో !

'పత్రిక అందంగా ఉంటోంది. చంద్రవిస్వ గారు వేసిన ముఖచిత్రం 'కారుచీకటి' చాలా బాగుంది. శివకంఠిగారు రాస్తున్న సీరియల్ "నీరసుబ్రతుకు" రానురాను మరీ నీరసంగా ఉంటోంది. వారి కలంలో జాన గానిసోశారేమో ననిపిస్తోంది. నాకేప్రపంచంతో రాసిన వంటలు కొన్ని గొడ్డు కారంగానూ, మరికొన్ని కటిక తీయగానూ ఉన్నాయి. సంపాదకీయం సర్గాలేదు. 'పాఠకుల లేఖలు' శీర్షికకు మరోపేజీ కేటాయిస్తే బాగుంటుందని నా ఉద్దేశం. మీకు నా ధన్యవాదాలు.'' అని 'పాఠకుల లేఖలు' అనే శీర్షికతో అచ్చయింది. ★

---

టీచర్ : ఏరా ! రామూ ఏనుగులు ఎక్కడ కనిపిస్తాయిరా?

రాము : అసలు పోతే కదండీ కనుపించటానికి ?

ఎం. రామమోహనరావు (తెనాలి)

---

# అర్జున విషాద యోగం

**కలువకొలను సదానంద**

సృష్ట్యాదినుండీ మానవుడు ఏదోఒక ఈతి బాధకు లోనవుతూనే ఉన్నాడు. అనుభవంమీదట — ఎప్పటికప్పుడు తద్బాధా నివారణార్థం ఏదేనొక ఉపాయం వెతుక్కుంటూనే ఉన్నాడు. ఇది ప్రకృతి సహజ సిద్ధాంతం.

ఈతి బాధలు పలు రకాలు. అతివృష్టి, అనావృష్టి, మిడతల దండు, కరువు కాటకాలు, వరద బీభత్సాలు, భూకంపాలు, అగ్నిప్రమాదాలు, మత్కుణ మశకాది కీటకాద్యనేక ఈతి బాధలటుండనిచ్చి, ప్రస్తుతం నా పాలిట దాపురించిన ఈ సరికొత్త ఈతి బాధకు ఏమని నామకరణం చేయాలో తోచడం లేదు.

స్తంభములవంటి కాళ్ళు, పెద్ద కడుపు, ఒక తోక, చేటలవంటి చెవులు, పొడవైన తొండము, మొనదేరిన రెండు దంతములు, చిన్న కన్నులు — ఇవన్నీ కలిస్తే — అది ఒక ఏనుగు. నా పాలిటి బాధకు బ్రహ్మదేవుడు చేసిన రూపకల్పనా విధాన మెట్టిదనిన:

సుమారు ఐదుంబాతికడుగుల ఎత్తు గలిగి, నఖశిఖ పర్యంతము బ్యాటరీ సెల్లులా పొందికగాను, కసాయి దిమ్మెలా బలిష్ఠంగాను ఉన్న విగ్రహము, విశాలము, ఉన్నతమూ అయిన వక్షము, ఆరంగుళాల వ్యాసము, ఒకటిన్నర అంగుళాల ఎత్తు గల ఒక హ్రస్వ స్తూపాన్ని జ్ఞప్తికి తేగల కంఠ వేదిక, ఆ వేదికపై అమరి పూర్ణచంద్రుని బోలిన వదనము, తద్వదనానికి సమచతురాకారాన్ని సమకూర్చుతూ — దిగువ భాగాన ప్రక్కల కుబికిన దవడలు, ఎగువడలు, ఎగువ భాగాన నడిపాపిడినుండి ఇరువైపులకు పాయలైన క్రాపింగు, సులోచనాల లోచనాలలో నాటకీయత, నాసికా నిర్మాణంలో శిల్పం, పెదవుల గీతలలో విచిత్రలేఖనమూ — ఇవన్నీ కలిస్తే అది ఒక ఈతి బాధ! ఈ ఈతిబాధకు వ్యవహారంలో ఉన్నపేరు — యోగానందం. యోగానందంగారు సదా ఒదులైన తెల్లటి పైజామాతోనూ, నిగనిగలాడే సిల్కు లాల్చీలలోను జీవనం చేస్తూ ఉంటారు.

యోగానందం అతని తండ్రి కొక్కడే తనూజుడు. మూడు ఇండ్లు, నాలుగెకరాల మాగాణమూ అతని ఆస్తి. ఉల్లాసం అతని ద్వితీయ కళత్రం. నాటక కళాత్మక కీర్తి కన్యకపై అతనికి మిక్కిలి మోజు.

తాను దాదాపు పదిహేను సంవత్సరాలుగా కళోద్ధారక నాట్యమండలిని నడుపుతున్నాడని యోగానందోక్తి. యువతీయువకు లెల్లరు కళోద్ధారక నాట్యమండలి ఒరవడిలో మేటి నటులై, గొప్ప భవిష్యత్తును నిర్మించుకొనవలెనని యోగానంద సూక్తి. చాలకాలంవరకు అతని నాట్యమండలి ఉదంతం నాకు తెలియనే తెలియదు. ఆ తటాకంలో నుండి పాత నీరు తరలిపోతూ ఉండడం, క్రొత్తనీరు వస్తూ ఉండడం, కొన్ని పర్యాయాలు అది నిర్జీర్ణమై ఎండిపోవడం జరుగుతుండేవి. ఎట్టకేలకు — ఎండి బీటలువారిపోయిన ఆ చెరువులోకి మరలింపబడిన సెలయేళ్ళు ఆరు. ఆ ఆరుగురు వరుసగా — నేను, మణి, శంకరం, రాజా, నారాయణ, చిట్టి. ఏడాది క్రిందటి ఘట్టం అది.

స్కూలుఫైనలు పూర్తిచేసి, ఉద్యోగాల సిద్ధి కోసం రెండేండ్లుగా నిరుద్యోగవ్రతి మాచరిస్తున్న తరుణంలో — యోగానందంగారి వ్యవహారదృష్టి మామీద ప్రసరించింది. ఆ దృక్కులలో ఆకర్షణ కూడ లేకపోలేదు. అతడు ముందు మా ఊరిని పొగిడాడు. తరువాత మాబోటి ప్రజ్ఞావంతులైన యువకులు పూనుకుంటే మా ఊరిపేరు మారుమూలల మార్మోగి పోగలదని సెలవిచ్చాడు. మేమందరం మిత్రులం. ఒండొరులను 'ఒరే' అనుకుంటాము. యోగానందం కూడ మమ్మల్ని






'ఒరే' అనే సంబోధిస్తాడు. మేము మాత్రం అతని పట్ల బహువచన ప్రయోగమే చేస్తాం. కారణం ఏమంటే—అతడు నలభై ఏండ్లవాడు. మా బాల్యం నుండీ మే మెరిగిఉన్నవాడు.

యోగానందం నాతో అన్నాడు—"ఒరేయ్ అర్జునరావ్ ! ఇప్పుడు సినిమాల్లోని పెద్ద నటులంతా ఎవరనుకున్నావు ? ... ఒకప్పుడు మీవంటి కుర్రవాళ్ళేనూ ! సినిమానటుడు కావాలనుకున్న వాడికి నాటకరంగం నిచ్చెన వంటిది. మంచి నటుడి కుండవలసిన లక్షణాలన్నీ నీలో ఉన్నాయి. మనం అందరం కలిసి ఒక నాటిక నేర్చుకుందాం. నాటకపోటీల్లో పాల్గొందాము. నీకు ఒకటి చెబుతున్నాను. నిజానికి నటనలో మన జిల్లావాళ్ళను మించినవాళ్ళు ఆంధ్ర మొత్తంలోనూ లేరనుకో అయితే మనం చేయవలసిం దేమంటే—అందరమూ కలిసి కృషిచేసి, ఈ సత్యాన్ని కాస్త ఋజువు పర్చడమే. శంకరం, మణి వాళ్ళంతా ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. అదీ ఉత్సాహమంటే ! .... మరి, నువు సాయంకాలం వచ్చేసెయ్యి సుమా !...."

అతడు ప్రతి ఒక్కరితోనూ ఈ మాటలే అన్నాడు.

అందరూ పనీపాటా లేనివాళ్ళు గనుక, కాలాన్ని ఏదోవిధంగా గడపాలి గనుక, అన్నిటికంటే ముఖ్యముగా యోగానందంగారి మచ్చిక నాగుబాముకు నాగస్వరం వంటిది గనుక—నేను నా మిత్రులు పిలున్నప్పుడల్లా యోగానందం సాన్నిధ్యంలోనే మెలగటొచ్చాము.

మణి మాకొక వినోది. వైపరీత్యాన్ని చక్కగా వ్యాఖ్యానించడం వాడికొక కళ. యోగానందం లేనప్పుడు ఒకసారి నాతో యిలా అన్నాడు మణి—"ఒరే ! నువు యోగానందం కంటె పెద్దవాడివనుకో ! అప్పుడు ఆయన కలకాలం జీవించే ఉద్దేశంతో ఆయన్ని ఎలా దీవిస్తావు ?"

"ఎలా ఏమిటీ ? కలకాలం జీవించాలి అనో, దీర్ఘాయుష్మాన్భవ అనో అంటాను ...."

"నేనైతే అలా అనను, 'నీ నోరు కలకాలం వాగుతూనే ఉండాలి' అని దీవిస్తాను."అన్నాడుమణి.

గుండె కొట్టుకోవడం ఆగిపోతే మనిషి చచ్చి నట్లే ! నోరు వాగడం మానితే—యోగానందం మృతుడైనట్లే !

అతడు నాటకాన్ని గురించి కొంత, నటనను గురించి మరికొంత, నాటకరంగం కోసం నటుడు చేయవలసిన త్యాగాన్ని గురించి కొండంత మాట్లాడుతాడు.

నటుడికి తల్లి, తండ్రి, గురువు, దైవం, భార్యాపుత్రులు, నిద్రాహారాలు అన్నీ నాటకరంగమే ! అవివాహితుడైన నటుడికి పెండ్లి నిశ్చయమౌతుంది. ముహూర్తం నిర్ణయింపబడుతుంది. ఆ ముహూర్త సమయంలోనే పెండ్లికుమారుడికి రిహార్సల్సు ఉంటుంది. "నాన్నా ! ఈ ముహూర్తంలో సూత్రధారణ చేయలేనందుకు క్షమించాలి. నాకు రిహార్సల్సు ఉంటుంది. వేరే ముహూర్తం చూడండి" అని అతడు నిర్మొహమాటంగా చెప్పేయాలి.

ఒక ఇంట్లో నటుడు, అతని భార్య యిద్దరు మాత్రమే ఉంటున్నారు. అతని భార్య నిండు చూలాలు. ఆనాడు పొరుగూరిలో ప్రదర్శింపబడనున్న నున్న నాటకంలో అతనికి వేషం ఉంది. తీరా అతడు బయలుదేరబోతుండగా—అతని హృదయేశ్వరి "అమ్మ ! అబ్బ ! ఉం !" అంటుంది అప్పుడు. నటుడు ఆగకూడదు. వెనుదిరిగి చూడకూడదు అడుగు ముందుకే !

"ఈనాటి ప్రదర్శనలో రంగస్థలంపైద నీ శరీరం కనిపించిందంటే—ప్రేక్షకాగారం నుండి నిన్ను రివాల్వరుతో కాల్చేస్తాను" అని నటుడికి ఆకాశరామన్న ఉత్తరం వస్తుంది. అయినా అతడు తుపాకీగుండుకు అదరకూడదు, బెదరకూడదు.

ఇదంతా—యోగానందంగారి పాఠం.

త్వరలోనే—స్త్రీపాత్ర లేని ఒక సాంఘిక నాటికలో నారాయణ తప్ప తక్కినవారందరమూ పాత్రధారులమైనాము. నారాయణకు ఎందుకో నటన అంటే భయం ఆవరించింది. అయినా—పాత్రధారణ కంటె తక్కువగానటువంటి బాధ్యత అతనికి లేకపోలేదు. అతడు సద్యఃకల్పన చేసి చక్కగా పాటలు పాడగలడు. సన్నివేశాలనుబట్టి నాలుగు పాటలు వ్రాయడం నా వంతు, నేపథ్యంలో నుండి నాటికి గాత్రానువాదం చేయడం నారాయణ వంతు.

సాయంకాలం నాలుగున్నర కాగానే—ఒక్కొక్కరే యోగానందంగారి ఇంటి అరుగుపీదికి చేరుకునేవాళ్ళం. యోగానందం అయిదు గంటలకు తన పనులన్నీ ముగించుకుని వచ్చేవాడు. అతని కోసం ప్రత్యేకించబడిన గదిలో రాత్రి పది, పదకొండు గంటల వరకు రిహార్సల్సు, గురుబోధ జరిగేవి. రిహార్సల్సు జరుగుతున్నప్పుడు ప్రముఖ సినిమా తారాగణమంతా మా వాళ్ళల్లోనే కనిపించేది. వీరిలో చాలమందికి స్వాతిశయం కూడా తోడైంది. రాజు అప్పుడే 'రక్త కన్నీరు' ఏకపాత్రాభినయం సాధన చేస్తున్నాడు. మణి ఒకానొక ప్రఖ్యాత సినిమానటుడి భంగిమలు, హావభావాలు ప్రదర్శిస్తున్నాడు. శంకరం—కళోద్ధారక నాట్యమండలికి తాను సహాయ కార్యదర్శినని కొన్ని చోట్ల చెప్పుకుని ఉన్నాడు. ఈ అందరూ ఒక ఎత్తు. చిట్టిగాడు మాత్రమే ఒక యెత్తు. వాడి అండాకార శరీరం యొక్క నిలుపు పొడుగు లంటుంది. "ఒరేయ్ చిట్టీ ! నువ్వు చూడ ముచ్చటగా ఉన్నావోయ్ !" అంటాడు మణి.

చిట్టి నిరాడంబరంగా నవ్వుతాడు. "అంటే





# అర్జున విషాదయోగం

—హార్ట్ కేళాగున్నా నన్నవాంటే ! బాబా ?"

వెక్కివెక్కి ఏడుస్తూ మాటలాడే ఒక స్కూలు కుర్రవాడి పాత్ర చిట్టిది. చిట్టిబాబు ఏడుపు చూచినవారికి ఏడ్పుయొక్క ప్రయోజనం హాస్యమే ననే స్థిర సంకల్పం కలుగక మానదు. చిట్టి సముద్రపుఘోషలా, పైశాచిక భాషలా ఏడుస్తాడు. ఆ సమయంలో అతడు చూడకుండా రాజు జాలా జలంతో కనుకొలకులనుండి చెక్కిళ్ళమీదికి చారలు గీచుకుని, విచారంగా కూర్చుంటాడు. మణి రెప్ప లార్పకుండా ఏదైనా ఒక లక్ష్యంవైపు సూటిగా రెండు నిమిషాలపాటు చూస్తాడు. వాడి కన్నుల నుండి అశ్రువులు జలజలా రాలుతాయి. నాటకంలో తన మాటలు అయిపోగానే చిట్టిబాబు తిన్నగా వచ్చి, ఏడుస్తూన్న బిడ్డల్ని ఓదార్చే తల్లిలా—"పిచ్చి నాన్నలారా ! వూరుకోండి !" అంటూ ఆ యిరువురి కన్నులు, చెంపలు చేతితో, అవసరమైతే తన చొక్కాతో తుడుస్తాడు. "అయితే, నావల్ల మీకు యిబ్బందే ! ప్రతిరోజూ యిలా ఏడుస్తూనే ఉంటారా ?" .... అందరూ కలిసి చిట్టిని అభినందిస్తారు. చిట్టి మాటిమాటికీ పై ప్రశ్నే అడుగుతూ ఉంటాడు. యోగానందంగారి సాంగత్యం మమ్మల్ని పూర్తిగా మరో లోకంలోకి విసరివేసిందనడానికి—చిట్టి ఒక నిదర్శనం !

సర్వకాల సర్వావస్థల్లోను మా మస్తకాకాశంలో నాటకాన్ని గూర్చిన ఆలోచనావీచికలే వీస్తూ ఉండేవి. ఇదంతా యోగానందంగారి ఉపదేశ ప్రభావమే ! అతడు కోరేది కూడ అదే.

ప్రతి సభ్యుడు కళాద్ధారక నాట్యమండలి అభ్యున్నతి కొరకు ప్రతి మాసమూ రెండేసి రూపాయల చొప్పున చెల్లించుకునే పద్ధతి కూడ రూపొందింపబడింది. నిరుద్యోగులమైనా, రెండేసి రూపాయలిచ్చుకోవడం మాకు పెద్ద సమస్యగా కనుపించలేదు. మణి మాత్రం ఏకాంతంలో ఇలా వాపోయాడు.—"హే భగవాన్ ! చదువు పూర్తయినా, నెలసరి బడిజీతం కట్టవలసిన అగత్యం తప్పలేదు కదా ?"

.... ఇట్లుండ కతిపయ దినంబులకు యోగానందం బొక ఉత్సాహజనితంబగు సమాచారం బొండు మాకెరింగించె.

మూడు నెలలలో—రెండువందలమైళ్ళ దూరాన గల ఒక పట్టణంలో నాటికపోటీలు జరుగనున్నవి. ఉత్తమ ప్రదర్శనానికి మొదటి బహుమతి నూట పదహార్లు, రెండవ బహుమతి అర్ధనూట పదహార్లు ఇవిగాక ఉత్తమ నటీనటులకు గూడ బహుమానాలుండగలవు. "నూటపదహార్లు మనవేసార్ !" అన్నారు సభ్యులందరూ ముక్తకంఠంతో. "ఆ ఉత్తమ నటుడు మీలోనే ఉన్నాడోయ్ !" అన్నాడు యోగానందం.

మేము ప్రదర్శించే నాటిక, అందులోని పాత్రధారులు మొదలైన వివరాలతో కూడిన దరఖాస్తు, దానితోబాటు ప్రవేశరుసుము ఐదు రూపాయలు పై పోటీ నిర్వాహకులకు పంపుకోవడం జరిగింది.

తరువాత—ఆ మూడు నెలలూ ఒక మహా యజ్ఞంలా గడిచింది. ప్రతి ఒక్కడికీ నాటకం ఆద్యంతమూ కుండలీకరణాలతో సహా నోటికి వచ్చేసింది. "ఒరే అర్జునరావ్ ! ఇంత శ్రద్ధ, పట్టుదల భారత కథా పఠనంపట చూపినంటే—ఈ మూడు నాలుగు నెలలో పద్దెనిమిది పర్వాలూ కంఠస్థమైపోయి ఉండేవి ...." అన్నాడు మణి.

పోటీలు యింకా మూడువారాలుందనగా — పోటీ కార్యక్రమాన్ని తెలియజేసే సావనీర్ వచ్చింది. ముఖ్యంగా యోగానందంగారి ఉత్సాహానికి అవధులు లేవు. కాని, ఎంతకూ తీరని సందేహాలు కొన్ని మాకున్నాయి. ఆ పట్టణం ఉన్నది.—రెండు వందలమైళ్ల దూరంలో. పోను రాను రైలు ఛార్జీలకు, తిరిగి యిల్లు చేరేంతవరకు భోజనపు ఖర్చులకు ప్రతి ఒకడికీ పాతిక రూపాయలైనా కావాలి. పాతిక రూపాయలు మాకు గగనకుసుమం, మాకు ఇన్ని సందేహా లుండగా—యోగానందం ఉత్సాహాతిశయం చూచి ఆశ్చర్యపడ్డాము.

అయితే—యోగానందం ఈ సమస్యను చూడి పింజంత తేలికగా విడదీసేశాడు. "నేనుండగా మీకు భయం ఎందుకండ్రా—టిక్కెట్టు లేకుండా మిమ్మల్ని తీసుకుపోయి, తీసుకువచ్చే పూచీ నాది. తరువాత—బస, భోజన మంటారా ? ఆ వసతులంతా ఉచితంగా వాళ్ళే చేస్తారు. అయినా, తిండి వాళ్ళు పెట్టినా పెట్టకపోయినా మన కసవసరం. నే నున్నానుకదా ? అంతే ! ఖర్చుల్ని గురించిన బెంగ మీకు వద్దు." ఇంకేం ? మాకు ఆ చింత కూడ తీరిపోయింది.

మేము రైలెక్కేనాటికి— యోగానందంవద్ద మా సంస్థయొక్క మూలధనం— ప్రవేశ రుసుము, తపాలా ఖర్చులకు పోను— ఏభై రూపాయలుండాలని అంచనా. యోగానందం తన పరపతిని నుపయోగించి ఎక్కడినుండో రైల్వేపాసు తెచ్చుకున్నాడు. మిగిలిన వారిలో ఎక్కువమంది రైల్వే ఉద్యోగుల [illegible]



## త్వరలో ప్రారంభం!

'నేను సైతాన్ చేతుల్లో బానిసను'

# "పేరులోనే కలదు పెన్నిధి!"

"నామధేయం నస్థారకం" అంటూ సంస్కృతభాష, పేరుమీద విశ్వాస రాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించగా పేరు గొప్ప ఊరు దిబ్బ అంటూ తెలుగుభాష సదరు తీర్మానాన్ని బలపరుస్తుంది కాని సంఖ్యా శాస్త్రం మాత్రం పేరులోనే కలదు పెన్నిధి అంటుంది.

ఏ వ్యక్తికి అయినా అతని పేరుకు యే సంఖ్య వస్తుందో ఆ సంఖ్య యొక్క మంచి చెడ్డల మీద ఆ వ్యక్తి జీవితం ఆధారపడి ఉంటుందని సంఖ్యా శాస్త్రం చెబుతుంది.

ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క సంఖ్యను శాస్త్రం నిర్ణయించింది. మన దేశ భాషలకు సంబంధించిన అక్షరాలకు దీర్ఘం ద్విత్వం మొదలైన మార్పులు వస్తూ ఉంటాయి కాబట్టి ఈ విషయంలో ఇంగ్లీషు అక్షరాలను వాడడం సులభంగా ఉంటుంది. ఇంగ్లీషు అక్షరాలకు నిర్ణయింప బడిన సంఖ్యలు. [బలాలు]

| | |
|---|---|
| A, I, J. Q, Y | 1 |
| B, K, R | 2 |
| C, G, L, S | 3 |
| D, M, T | 4 |
| E, H, N, X | 5 |
| U, V, W | 6 |
| O, Z | 7 |
| F, P | 8 |

చూచే విధానం

K A M A R A J

2 1 4 1 2 1 1 = 12

పేరుకు సంఖ్యను నిర్ణయించేటప్పుడు ఒక విషయాన్ని ముఖ్యంగా గమనించాలి. ఏ పేరుతో ఒక వ్యక్తి అధిక సంఖ్యాకులచేత పిలువబడుతూ ఉంటాడో ఆ పేరునే తీసికోవాలి గాని, బారసాల నాడు మాత్రం పెట్టిన పేరును గాని, దస్తావేజుల్లో మాత్రం ఉండే పేరునుగాని తీసికొనకూడదు. కొంత మంది పేర్లకు అనేక విధాలుగా మార్పులు వస్తూ ఉంటాయి. కొంత మంది పేర్లలో కొంత భాగానికి పొడి అక్షరాలతో ప్రసిద్ధులవుతూ ఉంటారు.

ఉదా : పూర్తి పేరు— పూసపాటి విజయరామ గజపతిరాజు, వాడుకలోని పేరు— పి. వి. జి. రాజు.

మరి కొంత మంది పూర్తిగా పేరులోని పొడి అక్షరాలతోనే వ్యవహరింప బడుతూ ఉంటారు.

ఉదా : పూర్తి పేరు— శ్రీరంగం శ్రీనివాసరావు వాడుకలోని పేరు— శ్రీశ్రీ.

మరి కొంతమంది తమ పేరులో కొంత భాగం తోనే గుర్తింప బడుతూ ఉంటారు.

ఉదా : పూర్తి పేరు— గుమ్మడి వెంకటేశ్వరరావు, వాడుకలోని పేరు— గుమ్మడి.

మరి కొంత మంది అసలు పేరుతో నిమిత్తం లేకుండా కలం పేరుతోనో మరొక పేరుతోనో వ్యవహరింప బడుతూ ఉంటారు.

ఉదా : అసలు పేరు— పిళ్లా కృష్ణమూర్తి. వాడుకలోని పేరు— విరాజీ.

పేరులో మార్పు యే కారణంచేత వచ్చినా మారిన పేరుతోనే ఒక వ్యక్తిని అత్యధిక సంఖ్యాకులుగా ప్రజలు గుర్తిస్తూ ఉంటే ఆ పేరునే తీసికోవాలి గాని అసలు పేరును గాని, పూర్తి పేరును గాని తీసికొనకూడదు అంటే వాడుకలోని పేరును మాత్రమే తీసికోవాలి.

సంఖ్యలకు ఫలితాలు

1. — మిక్కిలి మంచిది.
2. — మంచిది.
3. — చాలా మంచిది.
4. — సామాన్యం
5. — మిక్కిలి మంచిది.
6. — చాలా మంచిది.
7. — మంచిది.
8. — చెడ్డది.
9. — చాలా మంచిది.
10. — చాలా మంచిది.

'మహేష్'

11. — మంచిది కాదు.
12. — మంచిది.
13. — సామాన్యం.
14. — సామాన్యం.
15. — మంచిది.
16. — మంచిది కాదు.
17. — శుభా శుభ మిశ్రమం.
18. — మంచిది.
19. — మిక్కిలి మంచిది.
20. — అంత మంచిది కాదు.
21. — చాలా మంచిది.
22. — అంత మంచిది కాదు.
23. — మిక్కిలి మంచిది.
24. — చాలా మంచిది.
25. — మంచిది.
26. — చెడ్డది.
27. — చాలా మంచిది.
28. — మంచిది కాదు.
29. — మంచిది కాదు.
30. — చాలా మంచిది.
31. — సాధారణం.
32. — చాలా మంచిది.
33. — చాలా మంచిది.
34. — మంచిది.
35. — చెడ్డది.
36. — చాలా మంచిది.
37. — చాలా మంచిది.
38. — మంచిది కాదు.
39. — చాలా మంచిది.
40. — సాధారణం.
41. — చాలా మంచిది.
42. — చాలా మంచిది.
43. — మంచిది కాదు.
44. — చెడ్డది.
45. — చాలా మంచిది.
46. — చాలా మంచిది.
47. — మంచిది కాదు.
48. — చాలా మంచిది.
49. — సాధారణం.
50. — చాలా మంచిది.

ముందు చెప్పబడిన విధంగా ఒకవ్యక్తి పేరుతో గల అక్షరాలను బట్టియే సంఖ్య వచ్చిందో ఆ సంఖ్యకు గల ఫలితం మీద ఆ వ్యక్తి జీవితం ఆధారపడి ఉంటుంది. కొంత మంది ప్రముఖ వ్యక్తుల పేర్లకు వచ్చిన సంఖ్యలకు యే ఫలితాలు చెప్పబడినవో పరిశీలించిన యెడల సంఖ్యల స్వభావాన్ని సులభంగా అర్థం చేసికొన వచ్చును.

ఉదా :

G A N D H I

3 1 5 4 5 1 = 19

N E H R U

5 5 5 2 6 = 23

L E N I N

3 5 5 1 5 = 19

L I N C O L N

3 1 5 3 7 3 5 = 27

K E N N E D Y

2 5 5 5 5 4 1 = 27

R O O S E V E L T

2 7 7 3 5 6 5 3 4 = 42

N A S S E R

5 1 3 3 5 2 = 19

(లింకన్, కెన్నెడీలకు గల పోలికలలో ఇది కూడా ఒకటి)

పేరులో రెండు మూడు స్వతంత్రమువైన భాగాలు గాని పొడి అక్షరాలు గాని ఉన్నట్లయితే వాటికి విడిగా సంఖ్యలను సాధించి ఆ సంఖ్యలను కలపాలి గాని మొత్తం ఒకే సంఖ్యగా కలపకూడదు.

ఉదా : (1) నీలం సంజీవరెడ్డి.

N E E L A M

5 5 5 3 1 4—23—2+3=5

S A N J E E V A R E D D Y

3 1 5 1 1 6 1 2 5 4 4 1 = 34 = 3+4=7

—

మొత్తం పేరుకు వచ్చిన సంఖ్య. 12

(2) సుచేతా కృపలాని

SUCHETA

3 6 3 5 5 4 1=27=2+7=9

KRIPALANI

221813151=24=2+4=6

మొత్తం పేరుకు వచ్చిన సంఖ్య. 15

(3) ఎల్. వి. ప్రసాద్

L—3= 3

V—6= 6

PRASAD

8 2 1 3 1 4 = 19=1+9—10=1

మొత్తం పేరుకు వచ్చిన సంఖ్య. 10

విడిగా పేరులోని భాగాంకు వచ్చిన సంఖ్యలు మొత్తంగా పేరుకు వచ్చిన సంఖ్యా కూడా మంచివై ఉండుట ఉత్తమం. కనీసం మొత్తం సంఖ్య అయినా మంచిదై యుండాలి. పేరును బట్టి వచ్చిన సంఖ్య పుట్టిన తేదీ ఒకటై ఉండడం చాలా మంచిది.

ఉదా: నెహ్రూ పుట్టిన తేదీ 14=1+4=5

పేరు: N E H R U

5 5 5 2 6=23 =2+3=5

పుట్టిన తేదీ, పేరును బట్టి వచ్చిన సంఖ్య వేరువేరు అయితే అటువంటి వ్యక్తి జీవితములో ఒడుదుడుకులు, అభివృద్ధికి ఆటంకాలు మొదలైనవి రావచ్చును. కాని పుట్టిన తేదీ, పేరుకు వచ్చి సంఖ్య మిత్రత్వము కలవి అయినా బాగా ఉంటుంది. పుట్టిన తేదీ సంఖ్య 8 (తేదీలు 8, 17, 26) అయినట్లయితే పేరు సంఖ్య కూడా 8 రావడం మంచిది కాదు. పుట్టిన తేదీని యెలాగునా మార్చ లేము కాబట్టి పై తేదీలలో పుట్టిన వారు తమ పేర్లకు ఒక మంచి సంఖ్య వచ్చేటట్లు మొత్తం పేరు గాని, పేరులో అక్షరాలుగాని మార్చుకోవడం మంచిది.

ఏ వ్యక్తి అయినా, తను ఏ రంగంలో కృషి చెయ్యదలచుకొన్నాడో దానికి సంబంధించిన సంఖ్యను యెంచుకోవడం కూడా మంచిది.

ఉదా : రాజకీయాలకు 1

వ్యాపారానికి 5

సైనిక వ్యవహారాలకు 9

కళలకు 2, 6

మత వ్యవహారాలకు 3

ఇటువంటివి అన్నీ ఆయా సంఖ్యలకు అధిపతులైన గ్రహాల మీద ఆధారపడి ఉంటాయి. సంఖ్యాధిపతులైన గ్రహాల స్వభావం మిత్రత్వము గల సంఖ్యలు సంఖ్యల యొక్క ప్రత్యేక ఫలితం, కొంత మంది ప్రముఖ వ్యక్తుల జీవితాల్లో సంఖ్యా శాస్త్రం నిర్వహించిన పాత్ర మొదలైన వాటిని గూర్చి మరొకసారి వివరిస్తాను.

ఈ పైన చెప్పిన విషయాలు అన్నీ వ్యక్తుల పేర్లకే కాకుండా, సంస్థల పేర్లకు వస్తువుల పేర్లకు కూడా వర్తిస్తాయి.



11—9—64



# కుక్కపిల్ల

ప్రొద్దు వాటారుతోంది. సూర్యుడు పశ్చిమాన ఎర్రగా రక్తపు రంగులో కన్పిస్తున్నాడు పెదబాబు గారి మిగిలిన కుక్కలన్నీ సూర్యుడి డ్యూటీ అయిపోతోంది గదా యిక 'మన డ్యూటీ' ప్రారంభం అనుకుంటూ ఇంటిచుట్టూ తిరుగుతున్నాయి. నాకు మట్టుకు చాలా బద్ధకంగా ఉంది. 'సూర్యుడు అటు మునుగుతున్నాడూ అనగానే కుక్కలకి బద్ధకం ఎక్కడి దక్కడ మాయమైపోవాలి' అనేది అమ్మ. నిజానికి శ్రద్ధగా కాపలా కాయడంలో మా అమ్మనే చెప్పుకోవాలి. రాత్రింబవళ్లు ఆ 'క్లబ్' చుట్టూ తిరుగుతూ కొత్తవాళ్లెవరైనా వస్తే మీద పడినంత పని చేసేది. నేను కూడా ఆవిడ అడుగుజాడల్లోనే నడుస్తాను. కాని ఇవాళ ఎంచేతో ఈ పచ్చగడ్డిమీంచి లేవ బుద్ధవటంలేదు. ఇంట్లో పెదబాబుగారూ, ఆయన సతీమణి, రాజబాబూ లేరు. అమలాపురంలో కాబోలు బంధువులింట్లో పెళ్లికి వెళ్లారు. రేపటిదాకా రారు. ఇంట్లో కాపలాకి నాతోబాటు ఆరు కుక్కలూ, వెంకన్నా ఉన్నాయి.

చీకటి పొగలా వూరంతా నెమ్మదిగా పరుచుకొంటోంది. మనస్సు ఏదో ఆలోచిస్తోంది. ఇలాంటి సాయంత్రాలు నేను ఎన్ని చూసి ఉంటాను ? నేను చూసిన సాయంత్రాల సంఖ్య మటుకు ఆట్టే లేదుగానీ గడించిన అనుభవం యెక్కువేనని నా అభిప్రాయం. ఇంత చిన్న వయసులో ఇంత అనుభవం సంతరించుకున్న కుక్కలు ఈ ప్రపంచంలో ఎన్నో ఉంటాయంటే నేనన్నమ్మను.

ఇవాళ ఇలానే బద్ధకంగా ఈ పచ్చగడ్డిమీద కాళ్లు చాచుకు పడుకుని పాత జ్ఞాపకాలు నెమరు వేసుకోవాలనిపిస్తోంది. మనసులో పాత సంగతులు ఒక్కటొక్కటే జ్ఞాపకం వస్తున్నాయి.

*　　*　　*

నేను రాజోలులో (అన్నట్టు రాజోలు చాలా మందికి తెలీదు గాబోలు. శివకోడు పక్కనే ఉంటుందిలెండి.) 'ఆఫీసర్స్ టెన్నిస్ కోర్టు' పక్కనే ఉన్న ఓ పాడుబడ్డ కట్టడంలో పుట్టానట.

నేను పుట్టేటప్పటికి యిప్పుడున్న ఆఫీసర్స్ క్లబ్ ఉండేదిగాదు. అప్పుడు పిల్లల హైస్కూలు కూడా భారంవారి వీధి అవతల ఉండేదిగాదు. కొట్లలాంటి గదుల్లో పాఠాలు చెప్పేవారు. నేను పుట్టినప్పటి సంగతులు మా అమ్మే చెప్పింది. చిన్నప్పటి సంగతులు ఎంత ఆలోచించినా జ్ఞాపకం రావెందుకో మరి. కాని, వయసు పెరిగేకొద్దీ పరిశీలనాశక్తి పెరుగుతుంది. సంఘటనలు మనసులో జ్ఞాపకం ఉండిపోతాయి. నా జీవితంలో మొట్టమొదట జరిగినట్టు జ్ఞాపకం ఉన్న ముఖ్య సంఘటన.....

ఇంకో వారం రోజుల్లో క్లబ్ ప్రారంభోత్సవం ఉందనగానే మాకు తెలిసిపోయింది. ఆరోజు సాయంత్రం కొత్తగా కట్టిన క్లబ్ బిల్డింగ్

'నియార్కస్'

బయట నేల తడిపి మడత కుర్చీలు పరిచారు రోజూలానే. ఒక్కొక్కరూ వచ్చి ఆసీనులయ్యారు. చీకటిపడేవరకూ ఇష్టాగోష్ఠి చెయ్యడం రివాజనుకోండి. నేను కొంచెం ఎడంగా కూర్చుని వాళ్లు మాట్లాడేది అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను. మా కుటుంబం మొత్తం అలా వూళ్లోకి షికారు బయల్దేరారు. వాళ్లకి వీళ్లు చేసే సంభాషణ బొత్తిగా నచ్చదు. 'మనకు అర్థం కాని విషయాల్లో తలదూర్చడం అవివేకం అంటుంది అమ్మ. సోదరులు ముగ్గురూ 'అవు' నంటారు కాని నేను 'తెలీని విషయాలు తెలుసుకోడానికి ఎందుకు ప్రయత్నించకూడ' దంటాను. వాళ్లు నా మాట లెక్కచేసేవాళ్లు కాదనుకోండి.

సరే .... వాళ్లు అనేక విషయాలమీద చర్చలు సాగించారు. ఇంతలో రామశాస్త్రిగారు (ఆయన క్లబ్ సెక్రెటరీ) 'ఏమండీ క్లబ్ ప్రారంభోత్సవానికి ఫలానా ఆయన్ని పిలుస్తున్నాం' అన్నారు. అందరూ క్లబ్ ప్రారంభోత్సవం గురించి చాలా సేపు మాట్లాడారు. వాళ్ల మాటలవల్ల మరో వారం రోజుల్లో క్లబ్‌ని తెరవడానికి ఎవరో పెద్ద మనిషి వస్తారనీ, అప్పుడో ఉత్సవం చేస్తారనీ అర్థమయింది. నేను అలా వింటూండగా అక్కడికి ముగ్గురు కుర్రాళ్లు వచ్చారు. వాళ్లు నాకు కొంచెం తెలిసిన వాళ్లే. ఇద్దరు కామేశ్వర్రావుగారనీ ఓ ప్లీడరుగారి అబ్బాయిలు. మరో అతనేమో డాక్టరు రామారావుగారి అబ్బాయి. 'ఏమిటోయ్ శేషూ ! యిలా వచ్చావ్ ?' అన్నారు శాస్త్రిగారు.

"ఏమండీ... క్లబ్ ప్రారంభోత్సవం రోజున 'కుక్కపిల్ల దొరికింది' డ్రామా వెయ్యాలని నిశ్చయించుకున్నాం'' అన్నాడా అబ్బాయి. 'భేష్. 'రిహార్సల్స్' బాగా వెయ్యండి. అలాగే వేద్దురుగాని' అన్నారు రామశాస్త్రిగారు. పక్కనే కూర్చున్న హెల్త్ ఇన్‌స్పెక్టర్ సూర్యనారాయణగారు నవ్వుతూ 'ఇదుగో శేషూ ! మీ 'డ్రామా' లో కుక్కలు కావాలి కదూ ! పాపం, అక్కడ కూచుంది చూడు దాన్ని కూడా వేసుకోవోయ్ !' అన్నారు. అందరూ నవ్వుతూ నావంక చూసేసరికి గాభరాగా అక్కడ్నించి తప్పుకున్నాను.

'కుక్కపిల్ల దొరికింది' లో నేను నటించిన ఆ సమయం మర్చిపోలేను. 'వేదిక' మీద ఉన్నది చాలా తక్కువ కాలమైనా సాటి కుక్కల ముందు ప్లీడరుగారబ్బాయి తన్ను ఎత్తుకుని దీపాలకాంతితో వెలిగిపోతున్న వేదిక మీదకు తీసుకువెళ్తుంటే ఏ కుక్కపిల్లకి గర్వంగా ఉండదు ? వెనక వరసలో నిలబడి రెప్పలార్పకుండా నావంకే చూస్తున్న అమ్మవంక ఠీవిగా చూసి నవ్వాను.

ఈ సంఘటన తర్వాత చాలారోజులు మామూలుగానే రోజులు గడిచిపోయాయి. ఓరోజున మాత్రం జన్మలో మరిచిపోలేని ఓ సంఘటన జరిగింది.... భారంవారి వీధిలో ఉన్న కుక్కలకీ మా ప్రాంతం జనకాలకీ ఆజన్మ వైరంట. నాకు తెలీక ఓరోజు సాయంత్రం క్లబ్ పరిసరాలు వదలి షికార్లు కోసం భారంవారి వీధికేసి చాలా దూరమే వెళ్లాను. ఈ పేటలో కూడా పెద్ద పెద్ద ఇళ్లున్నాయే అని విస్తుపోతూ నడుస్తుండగా హఠాత్తుగా, ఎక్కడనుంచి వచ్చిందో ఓ భయంకరమైన మృగం నా మెడ పట్టుకుంది. ఓ క్షణంలో ఎలా మూగాయో ఆ పేటలో కుక్కలన్నీ నా ప్రాణం తీయాలని సంకల్పించుకున్నాయి. నేను ఎలాగో గింజుకుని వాటి బారినుంచి తప్పించుకుని పిక్కబలం చూపుతుంటే ఆ పాడు కుక్కలు వదలకుండా వెనక పడ్డాయి. ఇక ప్రాణంమీద ఆశ వదిలి కళ్లు మూసుకు పరుగుపెడుతూ సెంటరుదాకా వచ్చేసరికి అక్కడ స్కూల్నుంచి వస్తున్న పదిమంది కుర్రాళ్లు రాళ్లు పట్టుకుని ఆ దాడికి అడ్డం నిలబడ్డారు. ప్రాణం రక్షించబడింది. ఒకసారి కృతజ్ఞతాపూర్వకంగా వెనక్కి చూసి అదే పరుగు పెట్టాను. 'క్లబ్' దగ్గర కొచ్చేసరికి 'చావు తప్పి కన్ను లొట్టబోయిం దంటారే' అలా అయిందన్నమాట.

ఆ తర్వాత నేనెప్పుడూ భారంవారి వీధి వైపు కాలు కదపలేదు.

ఈ పై సంఘటన జరిగిన రెండు వారాల క్కాబోలు నాకు స్థానచలనం కలిగింది. 'స్థానచలనం' అంటే ఆవూరు వదిలానని కాదు. పేట మారానన్నమాట. నేను 'క్లబ్' లో కొందరు పెద్ద మనుషుల గురించి చెప్పానుగాని, పొగాకు ఇన్‌స్పెక్టర్ శేఖరంగారి గురించి చెప్పలేదు. ఆయన క్లబ్‌లో ఎప్పుడూ మౌనంగా ఉండేవారు. మాటలు వినడం వరకు ఆయన వంతు. పేకాట బాగా ఆడగల రనుకుంటాను. నేను చూస్తుండగా ఆయన చాలాసార్లు 'షో' 'షో' అంటూ ముక్కలు బల్లమీద పరుస్తూ డబ్బు వసూలు చేసుకుంటూండగా చూశాను. ఆయనంటే నాకు రామశాస్త్రిగారన్నా, కామేశ్వర్రావుగారన్నా ఉన్నంత మంచి అభిప్రాయం లేదుగానీ పెద్దమనిషన్న దృష్టితో గౌరవంగా చూసేవాడిని. నేను క్లబ్ పరిసరాల్ని వదిలి ఆయన ఇంటికి బదిలీ అవుతానని కలలో గూడా అనుకోలేదు.

అసలు సంగతేమిటంటే—ఆయన భార్యకి కుక్కలంటే చాలా ప్రీతిట. ఆవిడ కుక్కపిల్లనొక దాన్ని తెమ్మని చాలా పోరు పెడుతోందట. ఆవేళ 'కుక్కపిల్ల దొరికింది' నాటికలో పాల్గొన్న కుక్కపిల్లల్లో నన్ను ఆవిడ ఎంచుకుందిట— బొద్దుగా, అందంగా ఉన్నానని. త్వరలో నన్ను ఇంటికి తెమ్మని ఆయనకి చెప్పినా తనకు కుక్కలంటే పడదు గాబట్టి ఆయన పొడిగిస్తూ వచ్చారు. 'ఇవాళ తప్పకుండా తీసుకురమ్మని 'ఫైనల్ ఆర్డర్' ఇచ్చేసింది.' అన్నా రాయన నిట్టూరుస్తూ.

'సరే, ఇవాళే తీసికెడుదురుగాని .... పాపం మంచి కుక్కపిల్లండీ .... అన్నారు రామశాస్త్రిగారు. 'ఒరే సోములూ వీరి యింట్లో దీన్ని దిగబెట్టిరా' అన్నారు.

సరే. ఆ రాత్రే నేను స్థలం మారాను. వెళ్లేముందు అమ్మ కన్నీళ్లతో సాగనంపుతూ కుక్కల విధులు కొన్ని చెప్పినవే చెప్పింది. 'మా కందరికీ పేరు తేవాలి. వెళ్లిరా' అంది వదల్లేక వదుల్తూ. కొత్త విశేషాలు చూడబోతున్న ఆనందంలో 'అలాగే' అని తలూపి సోములుతో ముందు క్కదిలాను.

నేను మారిన ఇల్లు బాగానే ఉంది. ఆ ఇంట్లో నాకు అన్నీ నచ్చాయి గానీ నచ్చనిది యజమానురాలు ఒక్కటే. ఆవిడ లావుగా, తెల్లగా, 'ఇన్‌స్పెక్టరు' గారి కంటే కొంచెం ఎత్తుగా ఉండేది. ఎప్పుడూ కసురుకుంటూ మాట్లాడేది. సోములు నన్ను దింపుతూ 'అమ్మగారూ'! మీరు తెమ్మన్నది ఈ పిల్లనే కదండీ' అనగానే నా నెత్తిమీద ఒకటి వేసి 'ఆ—దీన్నే. ఎన్నాళ్లకి పంపించారు బాబూ !' అంది విరసనగా. సోములు వెళ్లిపోయాక కొంచెం భయంగా 'సోఫా' కిందకి దూరి దాక్కున్నాను.

'నీపే రేమిటి ?' అందావిడ 'సోఫా' కింద నుంచి నన్ను బైటికి లాగి. 'నా కెవరూ పేరు పెట్టలేదు' అన్నా పేరు లేనందుకు కించపడుతూ. 'ఏం పేరు పెడదాం మరి !' అని తనలో తను అనుకుంటూ కాసేపు ఆలోచించి 'ఆఁ .... నిన్ను టామీ అని పిలుస్తాను' అంది నెత్తిమీద ఇందాకటిలానే కొడుతూ. నాకు బాధ కల్గింది. ఆవిడ కొట్టినందుకు కాదు గాని ఆ పేరు పెట్టినందుకు. మొరుగుతూ నా నిరసనని ఆవిడకి తెలియజెయ్యబోయాను. కాని, ఆవిడ వింటుందా ? 'టామీ' .... 'నీపేరు టామీ' .... 'టామీ' .... 'టామీ' అని చెవులు పట్టుకు లాగడం మొదలెట్టింది. నాకు తలకాయనొప్పి వచ్చింది. ఈవిడ ఇలా ప్రవర్తిస్తోం దేమిటి' అని. కాని చేసేదేమీ లేక అలా తల వంచుకు ఉండిపోయాను.

కొన్నిరోజుల్లో బ్రతుకు దుర్భరంగా తయారయింది. ఆ యజమానిని ఆవిడ కీలుబొమ్మలా ఆడించడం నాకు చాలా దుఃఖాన్ని కల్గించేది. ఆవిడ గీచిన గీటు దాటగూడదు ఆయన.

* * *

క్లబ్‌కి ఎలా వెళ్లనిచ్చేదో గాని ఎనిమిది గంటల తర్వాత ఒక్క నిమిషం ఆలస్యం అయితే ఆవిడ అలిగేది. మూహం ముడుచుకు కూర్చునేది. ఆయనతో రెండు రోజులు ముభావంగా ఉండేది. పాపం ఆయన చేతకానితనానికి నాకు ఆయనంటే జాలి ఎక్కువయిపోయింది. ఒకానొక సంఘటన నా కాయన పట్ల జాలిని ద్విగుణీకృతం చేసింది. అదేమిటంటే...

భారతీదేవి (ఇది ఆవిడ పేరులెండి) ఓరోజు వారపత్రికలో 'కుక్కల పెంపకం' అన్న వ్యాసం చదివింది. అందులో కుక్కల్ని ప్రతి రోజూ సాయంత్రం షికారుకు తీసుకు వెళ్లడం చాలా మంచిదనీ, వారాని కోసారి పశువుల ఆస్పత్రికి తీసుకు వెళ్లాలనీ ఉందిట. దాన్తో గొడవ మొదలైంది. ఓరోజు ఆవిడ భర్తతో సాయంత్రం క్లబ్‌కి వెళ్లడానికి తయారవుతూంటే, 'ఏమండీ — మీరు మన టామీని రోజూ సాయంత్రాలు షికారుకు తీసుకు వెళ్లాలి' అంది. 'రోజూ సాయంత్రం షికారుకీ, వారానికోసారి ఆస్పత్రికీ కుక్కల్ని తీసుకువెడితే గాని కుక్కల పెంపకంలో శ్రద్ధ వహించినట్టు కాదని పత్రికలో రాసిఉంది చూశారా !' అంటూంటే ఆయన తెల్లబోయాడు. 'అది గాదు భారతీ' ... అనబోయా డాయన. ఆవిడ వింటుందా ? 'పిల్లేదండీ. 'క్లబ్' కి వెళ్లేముందు ఓ అరగంట దాన్ని అలా తిప్పి తీసుకురండి. ఏం మునిగిపోదు' అంది అంతలోనే రుసరుస లాడుతూ. ఆయనేమంటాడు పాపం !

ఇలా ప్రారంభమయ్యాయి దుర్దినాలు. దిగాలుగా గొలుసుకు నన్ను కట్టి తల వంచుకు రోడ్డుమీద నడిచిపోయే ఆయన్ని చూస్తే ఎవరికైనా జాలి వేస్తుంది. నాకు మానవ భాష వచ్చి ఉంటే 'మీరంటే నా కెంతో సానుభూతి ఉం' దని చెప్పే వాడిని. అప్పుడప్పుడూ వెనక్కి తిరిగి 'క్షమించ' మన్నట్టు ఆయనవంక చూసినా ఆయన గమనించేవాడు కాదు. 'దీనివల్ల గదా నాకిన్ని కష్టాలు' అన్నట్లు నావంక చూసేవారు. 'నేనేం చెయ్యగలను ?'

మా కుటుంబం అప్పుడప్పుడూ నన్ను చూడ్డానికి వచ్చేది. నా కష్టాలు చెబితే వాళ్లు నవ్వే వాళ్లు. 'ఇటువంటి యిళ్లలో మనలాటి కుక్కలకి ఆశ్రయం దొరకడం పూర్వజన్మలో చేసుకున్న పుణ్యం' అనే వాళ్లతో ఇక నేనేం మాట్లాడగలను ?'

మీకు సాయంత్రాలు జరిగే షికారు గురించి చెప్పానుగాని వారానికోసారి పశువుల ఆస్పత్రికి వెళ్లే తంతు గురించి చెప్పలేదు. అది నా పాలిట శాపంగా పరిణమించింది. భారంవారి వీధి ప్రాంతాల కుక్కలకీ మా ప్రాంతపు కుక్కలకీ ఉన్న వైరం సంగతి ఈపాటికి ప్రస్తావించే ఉంటాను. నా దురదృష్టంకొద్దీ ఆ పశువుల ఆస్పత్రి ఆ దారినే అఘోరించింది. మొదటి యాత్రలో నాకు ఆ ప్రాంతాల కౌడీ కుక్కలు తగల్లేదు గాబట్టి బతికిపోయాను. కాని రెండోవారం దాడి జరిగింది. పది పదిహేను కుక్కలు ఆకాశం ఎగిరిపోయేలా అరుస్తూ నామీదికి వచ్చేసరికి ఆయన హడలిపోయాడు. నాకూ ప్రాణాలు పైకి వచ్చేశాయి. కాని, ఆవేళ ఆస్పత్రి చేరే దారిలో గానీ, ఇంటికి తిరిగిపోతున్నప్పుడుగాని అవేమీ దౌర్జన్యానికి దిగలేదు. నావెంట ఓమనిషి ఉండడం ఆశ్చర్యాన్ని కలిగించింది

౮౮ వ పేజీ చూడండి

# వినాయ

పి. గణప



వెండి వినాయకునికి అభిషేకం

వినాయక చతుర్థి అన్నమాట క్రమంగా కొంతకాలానికి వినాయక చవితిగా మారిపోయింది. ఈ పండుగ మనదేశంలో అంతట విశేషంగా జరుపుతారు! వినాయకుడు విద్యాధి దేవత. విఘ్ననివారకుడు. ఇందుచేత విద్యార్థులు మరింత శ్రద్ధాభక్తులతో వినాయక పూజ చేసుకుంటారు.

ఆ నాడు పొద్దున్నే లేచి తలంట్లు పోసుకుని మట్టితో చేసిన విఘ్నేశ్వర ప్రతిమ బియ్యపు రాశి మీద ఉంచి ఆవాహన చేసి పూజచేస్తారు. కలువలతో తామరల పూలతో వినాయకునిపై పాలవెల్లి కట్టడానికి చిన్నవారెంతో ఉబలాటపడుతారు. ముఖ్యంగా 21 రకాల పత్రులంటే విఘ్నేశ్వరునికి చాలా ప్రీతి. గరిక, ఉమ్మెత్త, తులసి, మామిడి, గన్నేరు మొదలయిన పత్రులు ఇంకా రకరకాల పువ్వులు పిల్లలెంతో శ్రద్ధ పట్టి జాగ్రత్త చేస్తారు. ఇంకా నేరేడు, వెలగ మొదలయిన ఫలజాతులు కూడా వినాయకుని పూజ కోసం సేకరిస్తారు.

వినాయకపూజను గూర్చి మన ప్రాచీన పురాణాలలో వేరు వేరు గాథలు కనిపిస్తున్నాయి. పూర్వకాలంలో రాక్షసులు శివుణ్ణిగూర్చి ఘోర తపస్సుచేసి కొన్ని గొప్ప వరాలు సంపాదించుకున్నారు. ఆ గర్వంతో విర్రవీగి కన్నుమిన్ను కానక దేవతలను హింసించడం ప్రారంభించారు. వారు ఆ యాతనలు పడలేక పరమేశ్వరుని వద్ద మొర పెట్టుకున్నారు. ఆయన విఘ్నపతిని సృష్టించి రాక్షసుల తపస్సులకే కాక తలపెట్టిన ప్రతిపనికి విఘ్నాలు కల్పించమని ఆదేశించాడట. దానితో ఆ దుర్మార్గుల ఆట కట్టింది. ఇది లింగపురాణంలో వినవస్తున్న గాథ. కనకనే విఘ్నాలు పోగొట్టుకోవడంకోసం వినాయకపూజ మన కొక సంప్రదాయంగా మారింది.



గణపతిపూజ చెయ్యాలి!

# ...క చవితి

...శాస్త్రి

**చాలా ప్రాచీన కాలంలో ప్రతి చవితి నాడు వినాయకపూజ చేసేవారు. కాని క్రమ క్రమంగా హస్త నక్షత్రంతో కలిసిన భాద్రపద శుద్ధ చవితి నాడే ఆ పూజ కెక్కువ ప్రాముఖ్యం కలిగింది!**

శివపురాణంలో కథ ఇంకొక విధంగా కనబడుతున్నది. పార్వతీదేవి చెలికత్తెలు జయ విజయ. శివునికున్నట్టే ఆమెకు కూడా పరిచారకు లుండాలని ప్రార్థిస్తారు. ఆమె దాని కంగీకరించి అభ్యంగనస్నానం తలపెట్టి నలుగుపిండితో ఒకబొమ్మ చేసి ప్రాణప్రతిష్ఠ అయిన తరవాత ద్వారంలో కావలిగా ఏర్పాటు చేస్తుంది. అతడే వినాయకుడు. అంతలోనే శివుడు లోపలికి రాబోతుంటే అతడు అడ్డగిస్తాడు. పరమేశ్వరుడు కోపించి అతని శిరస్సు ఖండించి లోపలికి వెళ్లిపోతాడు. పార్వతీదేవి జరిగినవృత్తాంతం విని మిక్కిలి దుఃఖించి తన కుమారుణ్ణి తిరిగి బ్రతికించవలసినదని ప్రార్థిస్తుంది. ముక్కంటి దాని కంగీకరించి ఉత్తరంవైపు తలపెట్టి నిద్ర పోతున్న ప్రాణి శిరస్సు ఖండించి అతికించవలసినదని ఆజ్ఞాపిస్తాడు. శివుని పరిచారకులు ఉత్తరదిశగా శిరస్సునుంచి నిద్ర పోతున్న ఒక ఏనుగ తల తెగగొట్టి ఆ మొండానికి అతికిస్తారు. వినాయకుడు అప్పటినించి గజాననుడయినాడు. పార్వతీ పరమేశ్వరు లిద్దరు వినోదార్థమై ఏనుగుల రూపు ధరించినప్పుడు వినాయకుడు జన్మించినట్టు ఇంకొక కథ వినబడుతున్నది.

వినాయక చవితి అక్షతలు వేసుకోకుండా చంద్ర దర్శనం చేస్తే నీలాపనిందలు మీద పడతాయని ఇంకొక నమ్మిక మనవారిలో ఉన్నది. ఈ అక్షతలు వేసుకునే ముందు స్యమంతకోపాఖ్యానం వినాలి. స్యమంతమణి అపహరించినట్టు అన్యాయంగా శ్రీకృష్ణునిమీద ఒక నీలాపనింద పడుతుంది. అది తొలగించకోవాలని ఆయన నానా శ్రమపడి తిరిగి ఆ మాణిక్యం సత్రాజిత్తు కిచ్చివేస్తాడు.

విఘ్నేశ్వరుడు ఒకనాడు మూషిక వాహనం మీద వూరేగుతూండగా చంద్రుడాతని ఆకారం చూచి కలకల నవ్వినాడట! అందువల్లనే అతని కటువంటి శాపం వచ్చినదని వేరొక పురాణ గాథ విన వస్తున్నది.

గణాధిపతి పూజతోనే కాని మనవారే శుభ కర్మ ప్రారంభించరు అంతే కాదు. ఆయన విద్యల కన్నింటికి ఆదిదైవతం. లేఖన సంప్రదాయము, బ్రహ్మచర్యము కూడా ఆయన వల్లనే ప్రారంభమయినవని విజ్ఞులు కొందరంటారు. కనకనే మహాభారత రచనా సమయంలో లేఖకుడుగా ఉండవలసినదని వేదవ్యాస మహర్షి గణపతిని ప్రార్థించాడు. నన్నయ్య ఈ కథ రచించక పోయినా సంస్కృత భారతంలో దక్షిణాది పాఠంలో ఈ గాథ కానవస్తున్నది. వినాయకునికి సిద్ధి, బుద్ధి అని ఇద్దరు భార్యలున్నట్టు మరి కొన్ని పురాణాల పేర్కొంటున్నాయి. కనకనే ఆయనకు సిద్ధి వినాయకుడన్న పేరే ర్పడింది.

చాలా ప్రాచీన కాలంలో ప్రతి చవితి నాడు వినాయక పూజ చేసేవారు. కాని క్రమక్రమంగా హస్త నక్షత్రంతో కలిసిన భాద్రపద శుద్ధ చవితి నాడే ఆ పూజ కెక్కువ ప్రాముఖ్యం కలిగింది.

పూర్వం భారత సంస్కృతి విశేషంగా వ్యాపించిన ఆసియా ఖండంలో విఘ్నేశ్వర పూజ బాగా వ్యాప్తి చెందినట్టు కొన్ని నిదర్శనాలు కనిపిస్తున్నాయి. చైనా, జపాను, ఇండోనీషియాలలో వినాయకుడొక దైవతంగా వెలసి పూజలందుకొన్నాడు. జపానులో వినాయకునికి 'బినాకియా' అన్న పేరు వచ్చింది.

ఈ దేశాలలో నేటికి కూడా ఎన్నెన్నో వినాయక విగ్రహాలు కనిపిస్తున్నాయి. బౌద్ధులు కూడా గణపతి నొక ప్రధాన దైవతంగా భావించడమే దీని కొక ప్రదాన కారణం కావచ్చును. ఇంక భారత దేశంలో చాలా పురాతన కాలంనించి వినాయక పూజా సంప్రదాయం పాదుకొన్నది. క్రీస్తుశకం ప్రారంభం నించి దీనికి గట్టి నిదర్శనాలు కొన్ని కనిపిస్తున్నాయి. ఋగ్వేదంలో ఉన్న 'గణానాంత్వా గణపతిగం హవామహే' అన్న మంత్రం వేదం వినాయక పూజలో వినియోగిస్తున్నారు.

వినాయకచవితి మన కొక పెద్ద పండుగ. తెలుగు దేశంలో వినాయక పూజతో కలకల లాడని గృహముండదు.



'గుంజిళ్లు తియ్యాలి'

ఫొటోలు : ఎస్. రామకృష్ణ.

పిల్లలుంటే అలా దేవుళ్లాడుతూ కూర్చునే వాళ్లమా?''

''బాగానే ఉంది. నీ సమర్థింపు. మొట్ట మొదటి నుంచీ సుధని పెంచుకుంటావనీ, కృష్ణుణ్ణి పెంచుకుంటావనీ వాళ్లకై వాళ్లే అంటూంటే నిజమే కాబోలని నమ్మి కూర్చున్నాం. వాళ్ల ఇష్ట ప్రకారం పడి ఉండి వాళ్ల అడుగులకు మడుగు లొత్తి వాళ్ల సెత్తినాలన్నీ సాగనిస్తే చివరికి అంతా తీసికెళ్లి గంగలో కలిపారు— మన బుద్ధి తక్కువేముంది ? నమ్మించి మోసం చెయ్యటం కాదూ ఇది ? నువ్వు చెప్పనాయనా !'' అంది సావిత్రి మధుని మధ్యవర్తిగా పెట్టుకొంటూ.

మధు క్షణం ఆగి అన్నాడు— ''నా జవాబు నీకు నచ్చదులే అత్తా ! మనిషి బొత్తిగా అభిమానం లేకుండా బ్రతకడం నేను సమర్థించలేదు. మీ ఇంటి వ్యవహారాలు పిల్లల సంగతులూ మీరి ద్దరూ చూసుకో వలసినవే గానీ ఒకరి మీద పెట్ట వలసినవి కావు. ఏదో స్వార్థానికి ఆలోచించి బరు వైన బాధ్యతలన్నీ వదిలేసుకున్నారు. కాదంటావా?''

ఇంకా ఇప్పుడేమంటే ఏం ఉంది? నా బొంద''

''ఇంతకీ పెద్దత్తావాళ్లు ఏమయ్యారు ? గదికి తాళం పెట్టి ఉంది.''

''మా నెత్తిమీద చేతులు పెట్టి దేవుడి దగ్గ రికి పోయారు.'' కసిగా అంది సావిత్రి.

సీతాపతి మందలించాడు— ''చాల్లే వూరుకో. వాళ్లిష్టం వాళ్లది. ఇప్పటికైనా కళ్లు తెరిచి నందుకు సంతోషించు.'' మధుకేసి చూస్తూ చెప్పాడు— ''సత్యన్నారాయణ దంపతులతో వ్రతం చేయిస్తారట. తిరపతి వెళ్లారు మొన్న.

సావిత్రి కాస్త గొంతు తగ్గించి అంది— ''నేను చెప్తే అక్కసు అనుకుంటావో ఏమో గానీ ఉన్న మాట అంటున్నాను. ఆ సత్తిన్నారాయణ పెళ్లాం మహా గడుసుది. ఆ కోడలి ముందు అత్తా మామల నోళ్లు మూత పడాల్సిందే. వచ్చి నెల్లాళ్లు కాలేదు. అప్పుడే కీచులాడుకొంటున్నారు. ఆస్తి కోసం వచ్చింది గానీ నిజమైన అభిమానం ఎలా ఉంటుంది ?— కృష్ణుడైతే మాత్రం అంతే కాదా? అంటావేమో ! స్వయానా తమ్ముడి బిడ్డ ఇంటి పేరిటి వాడూ— బొడ్డు కోసిన్నాటినుంచీ ఆయన ఒళ్లో పెరిగిన వాడూనూ— వీడికీ వాడికీ భేదం లేదూ ?''

మధు కొంచెం నవ్వాడు. ''పోనీ ఆ మంచి చెడ్డలు క్రమంగా వాళ్లకే తెలిసి వస్తాయిలే అత్తా ! ఇంతకీ కృష్ణుడు ఊళ్లో లేడట.''

''అయ్యో రాత ! ఏ రేవుకెళ్లినా ముళ్ల కంపే నాకు. ఆ నాటికీ ఈ నాటికీ వాడికి కుదురు రానే లేదు. వాడి తిరుగుళ్లే వాడివి. చదువు లేదు గదా ? ఉద్యోగం లేదు గదా ? ఇంటికి వచ్చాడని సంతోష పడుతోంటే నెమ్మదిగా ఓ పదో పరకో చిక్కించుకుని ఎటో పోతాడు— మొన్న నెల్లాళ్ల కిందట— నలభై రూపాయలు పట్టుకు పోయాడు. సినిమాల్లో జేరుతున్నానని ఇంకా డబ్బు పంపమని ఉత్తరం రాశాడు. చెప్పొద్దూ ? ఆ ఉత్తరం కాస్తా చించి ముక్కలు చేశాను. రౌడీ వెధవ !'' కోపంతో కన్నీళ్లతో సతమతమై పోయింది సావిత్రి.

మధుకి చాలా బాధ కలిగింది. తనని ఎంత ఆప్తుడిగా భావించక పోతే చిన్నత్త అంత మనసిచ్చి మాట్లాడుతుంది ?— చిన్నత్త మనో వేదనంతా చిటికెలో తీసివేయ గలిగితే. . . . ?

''మరి వాడెలా బాగు పడతాడంటావు అత్తా ?'' బాధ పడేవాళ్లు బాధ ఎదటి వాళ్లు పంచుకుంటే గానీ వాళ్లకు తృప్తి ఉండదు.— ''కృష్ణుడు ఇలా తయారవుతాడని ఎన్నడూ అనుకోలేదుసుమా !''

''ఏది అనుకున్నాం గనక ? బొత్తిగా ముందు చూపు లేక పోయింది. సుధకి ఆ పెళ్లి జరగటం కృష్ణుడిలా భయంభక్తీ లేకుండా ఆకతాయి వెధవ కావటం అన్నీ ఆ పెద్దాయన మూలంగానే జరి గాయి. ఆయన్ని నమ్మి మేము సర్వ నాశనమై పోయాం. చేసుకున్నవాళ్లకి చేసుకున్నంత మరి. మిమ్మల్ని అలో లక్ష్మణా అని ఏడిపించాం గామూ?''

సావిత్రి కొంగుతో కళ్లు ఒత్తుకుంది

''అవేం మాటలత్తా ? ఆ నాడు మా దుర దృష్టం కొద్దీ అలా జరిగింది. అంతే.''

దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్న సీతాపతి మధు మొహంలోకి చూశాడు— ''చిన్న ఉద్యో మేదైనా సంపాదించి పెట్టగలవు కృష్ణుడికి ?''

సావిత్రి మధూ కూడా తెల్లబోయారు.

ఆ ఆలోచనే తనకు రానందుకు విస్తుపోయి సావిత్రి సంభ్రమంగా భర్తకేసి చూసి మధుని కాళ్లు పట్టుకున్నంత పని చేసింది. ''బాబ్బాబు ! నువ్వేదో పెద్ద ఉద్యోగస్థుడివట కదూ ? ఏదో చిన్న పని చూసి పెడుదూ ! కాస్త నీ పేరు చెప్పుకు బ్రతుకుతాడు. బాగుపడి ఇంటి పట్టుకైనా జేరతాడు.

ఒక వుద్యోగి : ఏమండీ పోస్టు మాస్టరు గారూ ! నాకు తపాలు సరిగా చేరడం లేదండి. మీకు జాబు కూడా రాశాను.

పోస్టు మాస్టరు : మీ వుత్త రమే నాకు చేర లేదండీ.

పాలగిరి కరంతుల్లా (రంగస్వగిరిగెడ్డ)

తను చిన్నత్తకి సహాయం చేయగలననే నమ్మకం మధుకి సంతోషాన్నిచ్చింది— ''తప్పకుండా చూస్తానత్తా ! అసలు వాడెక్కడున్నాడో పిలిపించి నా దగ్గిరికి పంపితే ప్రయత్నం చేస్తాను.''

''అదిగో. అలా దాటేస్తేకాదు. వాణ్ణి నీకు అప్పగిస్తాను. ఎలాగో బ్రతుకుతెరువు చూపించు. నువ్వు 'వూ' అంటే గానీ నాకు నమ్మకం లేదు.''

''అందాకా ఏదో చిన్న పని ఇప్పించావంటే తర్వాత ప్రయివేటుగా చదువుకుని పరీక్షకి కూర్చుంటాడు.'' సీతాపతి కూడా ప్రాధేయ పడుతున్నట్టు మాట్లాడటంతో మధు కొంచెం కోపం వ్యక్త పర్చాడు— మీరింతగా చెప్పాలా మామయ్యా ? కృష్ణుడు పాడయ్యాడంటే నాకు సంతోషమా ? నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. తప్పకుండా వాడికేదైనా పని చూసి పెడతాను. నమ్మరేం నా మాట ?''

'' ఎంతమాట నాయనా ! నీ చలవ వల్ల ....!''

'' అన్నిటికీ నువ్విలా బాధ పడకు చిన్నత్తా ! పెద్ద దానివి. నువ్వే ఇలా కంగారు పడితే ఇక పిల్లల మాటేమిటి చెప్పు ? రోజు లెప్పుడూ ఒక్కలాగే వుండవు. సుధ కాపురం చక్కబడచ్చు. కృష్ణుడు జ్ఞానం తెచ్చుకుని ఇంటికి చేరనూ వచ్చు. నువ్వు కన్న బిడ్డలు నీకు బరువా అత్తా ? ఎవరో తీసుకో లేదని బాధ పడతావేం ? మమ్మల్ని చూస్తున్నావు కావూ ? ఏం సిరిసంపదలు పెట్టుక బ్రతుకుతున్నాం ? అలాగే నీకూ మంచి రోజులు వస్తాయి.''

'' ఎంత చల్లని మాట చెప్పావు మధూ ! ఏదో కడుపు మంట చల్లారక అనుకున్నాను గానీ .....''

దిగులుగా చూసింది సావిత్రి.

'' అమ్మా ! '' చావిట్లో నిలబడి పిల్చింది సుధ.

'' ఏమిటే ? వంటయిందా ? ''

'' ఆ, కాఫీ ఇదిగో . . . . . .''

'' అయితే తీసుకురా ! మన మధు దగ్గిర నీకు సిగ్గెందుకూ ? ''

సుధ గాజు గ్లాసుతో కాఫీ తీసుకుని గదిలో అడుగు పెట్టింది.

'' అక్కడ పెడతావేమమ్మా ! నువ్వే బావకియ్యి.''

సీతాపతి కూతుర్ని హెచ్చరించాడు. సుధ సిగ్గు పడుతూనే కాఫీ గ్లాసు మధు కందించింది.

సుధ తన కోసం స్వయంగా తెచ్చిందన్న భావం మధుని మ్రాన్పడిపోయేలా చేసింది. — సుధ తనని అభిమానిస్తున్న దనటానికి ఆ సాక్ష్యం చాలు. అయోమయంగానే కాఫీ గ్లాసు అందుకున్నాడు.

ఆ కాఫీ అతి పవిత్రమైన అమృతంలా అని పించింది. మారు మాట్లాడకుండా తాగేసి గ్లాసు తిరిగి సుధకే అందించాడు.

'' అయితే అబ్బాయ్ ! నువ్వు భీష్ముడిలా వుండి పోతావా ఏమిటయ్యా !? '' సావిత్రి నవ్వుతూ మధు పెళ్లి సంగతి ఎత్తింది.

'' నేనేం శపథాలు చెయ్యలేదుగా అత్తా ! అన్నీ జరగటం లేదూ ? అదీ అలాగే జరుగుతుంది.''

మిట్ట మధ్యాహ్నం అయ్యే వరకూ కబుర్లు సాగిపోయాయి — '' ఇక అన్నాలు వడ్డించు. పన్నెండు కావస్తుంది.'' అన్నాడు సీతాపతి.

సావిత్రి ఆశ్చర్యంగా చూసింది — '' నిజంగా మధు మనింట్లో తింటాడూ ? హాస్యానికన్నాడేమో అనుకున్నాను. నాలుగు బంగాళా దుంపలన్నా వేప మన్నాను కాను. ఎంత దయ వచ్చిందయ్యా నీకు ? ''

'' నువ్వేం కంగారు పడకత్తా ! ఏది వుంటే అదే పెట్టు. చిన్నప్పుడంతా పప్పుచారే కాచేదానివిగా ?''

'' పప్పుచారే మరి. చిన్నప్పుడు ప్రేమతో పెట్టక పెట్టక పోయినా ఇప్పుడు ప్రేమగానే వడ్డిస్తానులే. లేచిరా ! '' సావిత్రి వంటింట్లోకి వెళ్లి పోయింది.

కొన్ని సంవత్సరాల తర్వాత తిరిగి ఆ ఇంట్లో అంత సామరస్యంగా భోంచేస్తోంటే మధు కళ్లలో నీరు చెమర్చినట్టయింది. — వడ్డనలో సుధ కూడా అక్కడక్కడా కలగ జేసుకుంది. మౌనంగా సుధ తనని తప్పించుకు దూరంగా పోవటం లేదనీ సాధ్య మైనంత వరకూ తన పరిసరాల్లో వుండటానికి ప్రయత్నిస్తోందనీ అర్థం చేసుకున్న మధు సాదరంగా సుధ మొహంలోకి చూడబోతే నెమ్మదిగా తలదించేసు కొంది సుధ.

* * *

"పువ్వులేం కోసుకో లేదా ?"

తృళ్లిపడి తలెత్తిన సుధ చూపులతో తడ బడింది. "నేను నీతో మాట్లాడుదామనే వస్తు న్నాను సుధా! నువ్వు తోటలోకి వెళ్లావని మీఅమ్మ చెప్పింది."

సుధ మౌనంగా నిలబడి పోయింది. సుధ మొహం కళా విహీనంగా వుంది. గర్వంగా ఎదటివారిని ధిక్కరించే ఆ చూపుల్లో ఏదో దీనత్వం గోచ రిస్తోంది. రేగిన జుట్టు వేళ్లతో అణచుకుంటూ ఎటో చూస్తూ — గాంభీర్యం సడలి పోయిన కంఠస్వరంతో అంది—

"నాతో ఏం మాట్లాడతావు బావా నువ్వు?"

మధు క్షణం మాట్లాడలేక పోయాడు —

"అలా పైకి వెళ్లి కూర్చుందామా సుధా ?"

అన్నదే తడవుగా వెనక్కి తిరిగింది సుధ — ప్రక్కనే నడుస్తూ అన్నాడు మధు — "సుధా నువ్వు నాతో ఎన్నడైనా ఇంత సౌమ్యంగా ప్రవ ర్తించావా ?"

సుధ తల తిప్పి చూసింది — "క్షమించు బావా! ఆ గతాన్ని నాకు జ్ఞాపకం చెయ్యకు."

మధు గుచ్చి అడుగుతూన్నట్టు ప్రశ్నించాడు —

"మర్చి పోవాలని ప్రయత్నిస్తున్నావా ?"

"కాక నేను చేయగలిగిందేముంది ?"

విస్మయంతో అన్నాడు మధు — "సుధా! జరిగిందానికి నిజంగా నువ్వు బాధ పడుతున్నావా ?"

సుధ మాట్లాడ లేదు. మౌనంగా మామిడి చెట్టు మొదట్లో కూర్చుంది. మధు ఒక్కసారి తోటంతా దృష్టులు సారించాడు. ఏ చెట్టునీ, మొక్కనీ పిందిగాని పువ్వుగాని కన్పించలేదు. తోటంతా చాలా వరకు పాడై పోయింది. మధు కించిత్తు బాధగా అడిగాడు —

"తోట చివర దశకు చేరి పోయినట్టుంది సుధా! ఎవరూ సంరక్షణ చేయుటం లేదా ?"

"అంత మంచి మనస్సు ఎవ్వరికీ లేదు బావా !"

"....................."

"తోట నీకోసమే బెంగ పెట్టుకొంది."

"వృధా శ్రమ ! ఈ తోటలో కాలు మోప టానికైనా నాకు హక్కు లేదే! పిచ్చి తోట కెందుకా ఆడియాశ ?"

"అది సహజం. ఒక వస్తువు దూరమై అందకుండా పోయినప్పుడుగాని దాని విలువ తెలిసి రాదు. అప్పుడు ఎంత ఆక్రోశించినా ప్రయోజనం లేదు. అవునంటావా ?"

"చిత్రంగా మాట్లాడుతున్నావు సుధా !"

"ఎందుకు చిత్రం ?" చటుక్కున తల ఎత్తింది. సుధ — "ఈ నాటికీ మా మూర్ఖత్వం మాసి పోలేదనా ?"

మధు ఆశ్చర్యంగా చూశాడు.

"నా గురించి నీకేమీ తెలీలేదా బావా ?"

"నీ గురించా ? అంటే నువ్వు ఇక్కడ వుంటున్న సంగతేనా ?"

"అవును. నేను గతిలేక పుట్టింటికి చేరిపోయా ననీ నా ఆశలన్నీ మాసిపోయాయనీ — నా గర్వ మంతా నశించి పోయిందనీ ....."

"సుధా !" మందలింపుగా అన్నాడు మధు. "ఎందుకంత పిచ్చిగా మాట్లాడుతావు ?"



"లేదు బావా! ఇప్పుడు నాకు పిచ్చి లేదు. ఒకప్పుడు వున్నమాట నిజమే. కాని అది పూర్తిగా పోయింది."

"సుధా! నువ్విలా మాట్లాడుతోంటే నాకెంతో బాధగా వుంది."

"నాకష్ట సుఖాలకు బాధపడే నువ్వు వున్నావన్న జ్ఞానం మొదట్లోనే లేక పోయింది బావా! నీవిలువ గ్రహించ గలిగిన నాటికి అంతా నాశక్తికి మించి పోయింది."

"సుధా !" సుధ అంత నిరభిమానంగా మాట్లాడు తుందంటే మధు తనని తనే నమ్మలేక పోయాడు.

"ఇప్పుడు నువ్వు నాకోసం బాధ పడటం ఏమీ సమంజసంగా లేదు. నువ్వువివాహితవనీ — నీకు భర్త వున్నాడనీ మర్చి పోతున్నావా ?"

సుధ పేలవంగా నవ్వింది — "అవి అతితే తేలికగా మరుపు వచ్చే విషయాలా ? కాని బావా! నేను అధర్మంగా అసమంజసంగా మాట్లాడుతున్నా నని నాకూ తెలుసు — నిన్ను ధిక్కరించిన నేను ఏ విధంగానూ సుఖపడటం లేదని నీకు చెప్తేగాని నాకు తృప్తి ఏది ?"

"సుఖానికి ఒక అవధి లేదు. ఉన్నంతలో సంతృప్తిగా బ్రతకటానికి ప్రయత్నించటం తెలివి గలవాళ్ల లక్షణం."

"ఒడ్డున నిలబడి మాట్లాడేవాళ్ల తీరు."

"సుధా! నువ్వు ఒక్క మనిషి పట్ల రెండు అభి ప్రాయాలు ఏర్పర్చుకో గలవా ?"

సుధ కొంతసేపు మౌనం వహించింది

(సశేషం)



గాబోలు .....

కాని, మరునటి వారం నేను ఏం జరిగినా ఆస్పత్రికి వెళ్లగూడదని నిశ్చయించుకున్నాను. ఇంటినుంచి బయటికి వచ్చేక మరేం జరగనీ ఒక్క అంగుళం ముందుకు కదల్నని భీష్మించాను. అసలే ఆయన అర్భకుడు. ఇంత పట్టుబడుతుంటే అంత దూరం ఎలా నడిపించుకు వెళ్తాడు.? 'భారతీ! ఇది మొండి కేస్తోంది.' అన్నాడాయన నిస్పృహతో 'రెండు అంటించి లాక్కెళ్లండి' అందావిడ మాటల్ని కార్యరూపంలో పెడుతూ. అయితే నేనేనా తక్కువ తిన్నది ? అసలే ఆవిడతో విసుగెత్తిపోయి ఉన్నానేమో మీదబడి కరవబోయాను. దాన్తో ఆవిడ ఝుడుసుకుని 'ఛీ ! పాడు కుక్క ! కరుస్తోంది చూడండి నన్ను· విశ్వాసంలేని జంతువు. ఈ వెధవ కుక్క మనకొద్దు. అక్కడే పారేసి రమ్మనండి.' అంది కోపంతో. ఈవిడచేత మాటలు పడ్డందుకు చాలా నొచ్చుకున్నా హాయిగా నా పాత ప్రదేశంలోకి పోతున్నందుకు మనసు పైమరచిపోయింది. ఆయన 'క్లబ్' కి వెళ్లేటప్పుడు వెంట నన్ను అక్కడ వదలడానికి గొలుసుకు కట్టి తీసుకు వెడుతూంటే ఆయనకూ, నాకూ ఆనందంగానే ఉంది—అటువంటి యజమానురాలిని వదిలినందుకు—ఆయన ప్రాణం సుఖపడేలా చేస్తున్నందుకూ.

'క్లబ్' లో ఆయన విషయం అందరికీ చెప్పి నన్ను వదుల్తుంటే మా అమ్మా, సోదరులూ చాలా బాధపడుతూ పక్కన నిలబడ్డారు.

'మా కందరికీ చెడ్డపేరు తెచ్చావు' అంది అమ్మ కోపంగా. నేను శాయశక్తులా ప్రయత్నించాను—నేను చేసిన పని మంచిదేనని చెప్పడానికి. వాళ్లు వింటేగా ? 'ఒక్కసారి కరిచి ఉండాల్సింది !' అని నేను అంటూంటే 'చాల్లే .... చేసింది చాలక' అని గసిరింది అమ్మ. ఇక నేనేం మాట్లాడను ?

తర్వాత అక్కడి నా జీవితంలో ఒక్క అను



"ఏమోయ్! డాక్టర్‌గారబ్బాయ్! మాష్టారు గారు, మీ నాన్నగార్ని పిల్చుకు రమ్మన్నారుగా మీ నాన్నగారేమన్నారేంటి?"

"ఏమంటారు ? నేను రావాలంటే ఐదు రూపాయలు ఫీజు అవుతుందని చెప్పమన్నారు."

# కుక్కపిల్ల

47 వ పేజీ తరువాయి

భవం తప్ప చెప్పాల్సినవి మరేంలేవు. ఆ సంఘటన నా మనసులో చెరగని ముద్ర వేసింది. ఆ సంఘటనని ఎప్పుడు తలచుకున్నా చాలా బాధగా, గుండెల్ని పిండినట్టుగా ఉంటుంది. అది జరగడానికి నేనూ ఓ కారణాన్నేమో అనే శంక నన్ను ఎప్పుడూ పీడిస్తూనే ఉంటుంది. ఐతే ఇప్పుడు నేను చెయ్యగలిగిందేమీ లేదు. తలుచుకు బాధపడ్డం తప్ప.

ఆవేళ సంత రోజు. సంతలో విశేషాలు చూసుకుంటూ వెళ్లి కసాయివాడు ఏమరిపాటుగా ఉన్నప్పుడు వాడిని తెలివిగా మోసం చెయ్యగలిగినందుకు నన్ను నేను అభినందించుకుంటూ వంతెన దాటి 'జనన మరణాల ఆఫీసు' ప్రాంతాలకి వచ్చేటప్పటికి ఇద్దరు అందమైన పిల్లలు ఎదురయ్యారు. అమ్మాయికి ఎనిమిదేళ్లుండవచ్చు. అబ్బాయికి ఆరేళ్లు దాటి ఉండవు. చాలా ముచ్చటగొలిపేలా ఉన్నారు. నన్ను చూడగానే ఆ కుర్రాడు ఆగి, నన్ను పట్టుకుని 'అక్కా ! ఈ కుక్కపిల్ల ఎంత ముద్దొస్తోందే !' అన్నాడు మురిసిపోతూ. 'అవునురా! పట్టుకు వెళదామా ఇంటికి!' అందా అమ్మాయి.

'అమ్మ ఏమీ అనదుగా ?' అన్నాడా చిన్న పిల్లాడు. 'ఊహూఁ .... ఎందుకంటుందేం ?' అని ఆ చిన్నపిల్ల నన్ను ఎత్తుకుని ముందుకు నడిచింది. అలా వాళ్లిద్దరూ నన్ను వాళ్ల ఇంటికి తీసుకువెళ్లారు. వెనకాల మావాడు వచ్చి నన్ను పెంచుకోబోతున్న ఇల్లు గమనించి వెనక్కు వెళ్లాడు. ఆ ఇల్లు మునుపటి ఇల్లంత విశాలంగా లేదు గాని పూలమొక్కలతో కళగా కలకలలాడుతూ ఉంది. నాకు బాగా నచ్చింది. ఇంట్లో అన్నీ శుభ్రంగా ఎక్కడి వక్కడ ఉన్నాయి. 'అమ్మా ! అమ్మా ! యిలా రావే ! ఏం తెచ్చామో చూడు.' అన్నాడా కుర్రవాడు.

వాళ్ల అమ్మగారు వచ్చారు. తెల్లగా, కళగల ముఖంతో ఇంత బొట్టు పెట్టుకు వచ్చిన ఆవిడ పట్ల నాకు చాలా గౌరవం కలిగింది.

'ఇదేవిట్రా ! కుక్కపిల్లొకటా మనకు తోడు.' అందావిడ నవ్వుతూ నావంక చూస్తూ.

'ఆఁ ఆఁ. కాదనమ్మా. ఇదొక్కటే పెంచుకుందామమ్మా. చూడు, ఎంత బావుందో ....' అన్నాడా కుర్రాడు.

'సరే—నాన్నగారి నడిగి ఆయన ఒప్పుకుంటే ఉంచండి.'

వాళ్ల పెద్దమ్మాయి (హైస్కూల్లో చదువుతోంది) కూడా నన్ను ఉంచాలని పట్టుబట్టడంతో వాళ్ల నాన్నగారు కూడా ఒప్పుకున్నారు. ఇక్కడ కొన్ని నెలలు చాలా హాయిగా గడిచాయి.

అవి వేసవి శెలవులు. పెద్దపిల్ల ఎస్. ఎస్. ఎల్. సి పరీక్షలు వ్రాసి, ఫలితాలకు ఎదురుచూస్తోంది. వాళ్ల నాన్నగారు పెళ్లిసంబంధం ఖరారు చేసుకురావడం అతి కష్టంగాని సాధ్యంగాలేదు.. 'పదివేలు కట్నానికి కానీ తగ్గరని, పెళ్లికొడుకు ఇంజనీరింగు చివరి సంవత్సరంలో ఉన్నాడనీ మాటల సందర్భంలో నాకు అర్థమైంది. బడిపంతులు ఉద్యోగం చేసేఆయనకి అంత డబ్బు పుట్టించడం సమస్య అయినప్పటికీ పొలం ఉన్నది కాస్తా అమ్మేసి ఈ సంబంధమే ఖరారు చేసుకోవాలని ఆయన పట్టుబట్టారు. పెళ్లిచూపులు, తాంబూలా లిచ్చుకోవడం లాంటి తంతు జరిగిపోయింది. శుభలేఖలు కొట్టించడం, పెళ్లికి పందిరి వేయించడం, నానా హంగామాతో ఇల్లంతా కళకళలాడుతూ ఉంది.

ఉండగా ఇంట్లోవాళ్లందరికీ చావుదెబ్బలాంటి సంఘటన జరిగింది. ఆరాత్రి వాళ్లింట్లో దొంగలు పడ్డారు.

ఆవేళ రాత్రి ఊళ్లో ఏవో ఉత్సవాలు జరుపుతున్నారు. ఓచోట హరికథ జరుగుతుంటే నేనూ మరో నలుగురం వెళ్లి ప్రొద్దుపోయేదాకా అక్కడ కూర్చున్నాం. రాత్రంతా రోడ్లమీద తిరుగుతూ 'క్లబ్' ప్రాంతాల్లో గడిపి, ఎండ బాగా ఎక్కాక ఇంటికి తిరిగి వెళ్లాను.

అప్పుడు తెలిసింది ఘోరవార్త. చిన్నపిల్లలు ఇద్దరూ దిగాలుపడి వరండాలో కూర్చున్నారు. పెద్దపిల్ల గదిలో కూర్చుని వెక్కివెక్కి ఏడుస్తోంది. నా మొహం వాళ్లకి చూపించ బుద్ధికాలేదు. వెనక్కి వచ్చేశాను. దారిలో జనం చెప్పుకుంటున్న మాటల్ని బట్టి ఎంత దారుణం జరిగిందో అర్థమైంది. రాత్రి వచ్చిన దొంగలు పెట్టె తెరుస్తున్న సమయంలో ఆయనకి మెలకువ వచ్చిందట. కానీ దొంగల్లో ఒకడు చేతిలో కర్రతో బలంగా తలపై మోదడంతో ఆయన స్పృహతప్పి పడిపోయారు. ఆవిడనీ స్పృహతప్పేలా కొట్టి విలువైన వస్తువులన్నీ సంగ్రహించి అదృశ్యమైపోయారు..... ఈ ఘోరం తలచుకుంటూంటే దుఃఖం ఉప్పెనలా ముంచుకువచ్చింది.

'రాత్రి యజమాని ఇల్లు వదిలి వూళ్లోకి పోవడం స్వామి ద్రోహం కదా ? .... తల వంచుకుని వెనకదారి పట్టాను. 'క్లబ్' చేరి ఈ వార్త అందరి చెవిన వేసేసరికి అందరూ ఆ కుటుంబంమీద చాలా జాలిపడ్డారు. 'ఇందులో నీ తప్పేం లేదు. నీకు మటుకు ఇలా జరుగుతుందని ఏం తెలుసు. నువ్వేం కలగనలేదు కద !' అని నన్ను ఓదార్చబోయారు. కాని, నాకు వూరట చిక్కలేదు. ఎంతసేపూ ఆ చిన్న పిల్లల దుఃఖం గుర్తుకువచ్చి గుండె తరుక్కుపోయింది.

నాలుగైదు రోజులు గడిచాయి. ఈ నాలుగైదు రోజుల్లోనూ ఆ యింటి యజమానికీ, యజమానురాలికీ ఎలా ఉందో నన్న ఆందోళన పీడిస్తున్నా అటువైపు వెళ్లడానికి మొహం చెల్లలేదు. చాలా దిగులుగా రోజులు గడపసాగాను .... ఒకరోజున మనశ్శాంతికోసం వూరికి చాలా దూరం ఒంటరిగా నడిచిపోతున్నాను. "రాధ" (పెద్దమ్మాయి పేరు అనూరాధ) గురించి ఆలోచనలు రాసాగాయి. 'పాపం డబ్బంతా పోయింది గదా, ఇక ఆ 'ఇంజనీరు' ఈమెను పెళ్లాడ్డానికి అంగీకరిస్తాడా ? అంగీకరించడు కాబోలు. ఆమె ఎంత బాధపడ్తోందో....' ఆలోచనలతో గుండె బరువెక్కిపోయింది. ఇలా ఆలోచిస్తూ మలుపు తిరుగుతూ రెండడుగులు వేసేసరికి ప్రమాదం జరిగిపోయింది.

ఏదో గట్టి పదార్థం ఒంటికి తగిలినట్టు మట్టుకు జ్ఞాపకం· స్పృహతప్పిన కాస్సేపు అలా రోడ్డుమీదే పడిఉన్నాను. కళ్లు తెరిచి చూసేసరికి నా పక్కన ఒక అబ్బాయి ఓంగి కూర్చుని నావంకే ఆదుర్దాగా చూస్తున్నాడు. కళ్లు తెరవ

గానే 'ఏయ్ డ్రైవర్ కళ్ళు తెరిచిందోయ్. బ్రతికే ఉంది. ఇలారా' అని అరిచాడు ఆనందంగా. తెల్లటి డ్రస్సులో, బూట్సు వేసుకున్న ఆ కుర్రాడు చాలా బావున్నాడు. ధనవంతుల బిడ్డ అని చెప్పకనే తెలుస్తోంది.

'ఇంకొంచెం 'స్పీడు' గా వస్తే చచ్చిపోయుండేదండీ....' అంటూ వచ్చాడు డ్రైవరు కారు ప్రక్కనించి. నా ప్రక్కన నిలబడి ఆ అబ్బాయి చెయ్యి పట్టుకుని లేవదీస్తూ. 'లెగండి బాబూ ! పోదాం. దీనికేం దెబ్బ తగల్లేదు' అన్నాడు. ఆ అబ్బాయిని. 'ఈ కుక్కపిల్లని కూడా ఎక్కించు. ఇంటికి తీసుకుపోదాం. నేను దీన్ని పెంచుకుంటాను.... ఎలా చూస్తూందో చూడు. చాలా మంచి కుక్కపిల్ల' అన్నాడు. 'డ్రైవర్' చాలా క్రూరుడిలా ఉన్నాడు. 'ఇంకా నయం ! ఇలాంటి కుక్కలేం ఖర్మ బాబూ మీకు ? ఇంటినిండా మంచి మంచి జాతికుక్కలున్నాయిగా ! చాలవూ !' అని కోపంగా నావంక చూశాడు. ఆ అబ్బాయి మటుకు డ్రైవరు మాట వినలేదు.

'ఇదుగో. ఇది రాకపోతే కార్లో నేనూ యింటికి వెళ్లను' అన్నాడు.

నాకు ఆ కుర్రాడి పట్టుదల చూసి ముచ్చట వేసింది. 'కుర్రాడంటే యిలా ఉండాలి' అనుకున్నాను. 'డ్రైవర్' ఇక విధిలేక నన్ను కూడా ఆ అబ్బాయితోబాటే ఆ ఖరీదైన 'కారు' లో ఎక్కించి ముఖం చిట్లించి కూర్చున్నాడు. కారు కదిలింది.

కొన్ని వందలమైళ్లు వెళ్లాక మా కారు ఒక క్రొత్త వూళ్లో ఆగేవరకూ హాయిగా మెత్తటి పరుపులమీద కూర్చున్నాను. మధ్యలో మా మధ్యేం సంభాషణ జరగలేదు గాని, ఆ అబ్బాయి నా తల నిమురుతూ కూర్చున్నాడు.

ఆ వూరిపేరు 'చింతలపల్లి' అని నాకు తరవాత తెలిసింది. ఆ అబ్బాయివాళ్లు రాజులు. వాళ్ల నాన్నగారు చాలా ప్రసిద్ధిపొందిన ధనవంతులు. పెదబాబుగారి మేడ చూస్తేనే నాకువాళ్ల భాగ్యం అర్థమైంది. వాళ్ల మేడలాంటి భవనాన్ని ఈ ప్రపంచంలో నేనెక్కడా చూళ్లేదు.

కారు ప్రహరి లోపలికి వెళ్లి ఆగాక నన్ను ఎత్తుకుని ఆ అబ్బాయి కారు దిగాడు. ఎదురుగా కన్పిస్తున్న స్తంభాలకి కట్టివున్న కుక్కలు నా దృష్టి నాకర్షించాయి. ఆ రెండు 'అల్సేషియన్' జాతి కుక్కలూ వదిలితే నన్ను మింగేద్దామన్నంత భయంకరంగా చూస్తూ అరుస్తున్నాయి. ప్రక్కనే రెండు పొట్టి జాతికుక్కలు కూడా శాయశక్తులా అరుస్తూ ముందు కాళ్ల మీద లేస్తున్నాయి. ఓ విచిత్రమైన కుక్క ఒంటి నిండా మచ్చలతో భీకరంగా చూస్తూ బాబుకి తోకాడిస్తూ నిల్చుంది.

వీటిని గమనించకుండా బాబు లోపలికి నడిచాడు. (ఆ కుర్రాడి పేరు 'రాజబాబు' ట) తిన్నగా మేడ మెట్లెక్కి ఓ విశాలమైన గదిలోకి వెళ్లి ఆగాడు. ఆ గదిలో ఓ స్త్రీ 'సోఫా' లో కూర్చుని పత్రిక చదువుకొంటోంది. 'అమ్మా ! ఈ కుక్కపిల్ల చూడు' అన్నాడా అబ్బాయి నన్ను తివాచీమీద దింపి. నన్ను చూసీ చూడగానే ఆవిడ చటుక్కున లేచి నిలబడ 'ఛీఛీ' అంది. నేనేదో చూడరాని వస్తువునైనట్టు. 'ఇలాంటి పాడు కుక్క ఎక్కడ దొరికిందిరా ?' అంది 'డ్రైవర్' ని పిలిపించి 'ఏయ్ డ్రైవర్ ! ఎందుకు మోసుకొచ్చావ్ దీన్ని ?' అంది గుడ్లురుముతూ.

'చెప్పానండమ్మగారూ ! మీరు తిడతారని. అబ్బాయిగారు వింటే గదండి !' అన్నాడతను వినయంగా.

'అమ్మా ! ఏమైనా సరే, నేను దీన్ని వదలను. దీనికి 'సీజర్' అని పేరు పెడతాను. 'సీజర్.... సీజర్!' పేరు నీకు బావుందా ? సీజర్ !' అన్నాడా అబ్బాయి నన్ను ఎత్తుకుంటూ. బావుందన్నట్టు తోక వూపాను. రాజబాబు అమ్మగారు ....

'సరే. మీ నాన్నగారు దీని సంగతి కనుక్కుంటారులే' అని కోపంగా వెళ్లిపోయింది.

తరువాత నేను చాలా ఆలోచనలో పడ్డాను. పెదబాబుగారు వచ్చేవరకూ రాజబాబు పర్యవేక్షణలో నాకు బాగానే గడచినా నా మనసులో వాళ్ళ నాన్నగారు ఏమంటారో నని భయంగానే ఉంది. ఇంతలో వాళ్ల నాన్నగారు రాజబాబును పిలిపించారు. 'ఒరే బాబూ ! నీకీ పాడు కుక్కేమిటిరా ? కొత్త 'సిల్కీసిడ్నీ' నొకదాన్ని బెంగుళూర్‌నించి తెప్పిస్తాను. దాన్ని వదిలేసి రమ్మను. నామాట వినమ్మా.' అన్నారు. లాలిస్తూ. కాని, బంగారుకొండలాంటి రాజబాబు 'ఊహూం, నాకు 'సీజర్' కావాలి' అన్నాడు పట్టుదలగా. ఇక వాళ్ల నాన్నగారు ఏమీ అనలేక 'సరే నీ యిష్టం. కానీ, దాన్ని మా గదుల్లోకి రానిస్తే కాళ్లు విరగ్గొడతాను' అని కోప్పడ్డారు.

ఆ రోజునుంచీ నేను రాజబాబు నీడనయ్యాను. ప్రతి క్షణం అతనితోనే అడుకునేవాడిని. నాకు సమస్త సదుపాయాలు ఎంతో జాగ్రత్తగా చూసేవాడు. ఇది మిగిలిన కుక్కలకి దుస్సహం అవడం నాకు అర్థమైంది.

ఇలా రెండు వారాలు గడిచాయి.

ఒకరోజు ఇంట్లో ఏమీ తోచక అలా వీధిలో తిరుగుతున్నాను. అటూ ఇటూ పరికిస్తుండగా అంతకుముందు నేను చూడని ఓ కుక్క కన్పించింది. కొందర్ని చూడగానే ఎందుకో మంచి అభిప్రాయం వెంటనే ఏర్పడుతుంది. పలకరించి స్నేహం చేసుకున్నాను.

'నిన్నిప్పుడు రాజబాబు చాలా ప్రేమగా చూస్తున్నాడు కదూ' అంటే 'అవు' నని చెప్పాను.

'ఇంకెన్నాళ్లలే....' అని తన నడం ఆశ్చర్యం కలిగించింది. కాని, ఆ కుక్క చెప్పిన కథ విన్నాక నా గుండెలో రాయి పడ్డట్టయింది. రాజబాబు తన్ను గూడా ముందు కొంతకాలం పెంచి, తోటమాలికి యిచ్చేశాడట. మోజు తగ్గిపోయాక.

'ఇంట్లోవాళ్లందరికీ నచ్చే పని ఒకటి చేస్తేగాని నీకిక అక్కడ స్థానంలేదు' అని చివరి మాటగా చెప్పేసి ఆ కుక్క తరువాత కలుద్దామని కదిలిపోయింది.

తను చెప్పింది సమంజసంగా తోచింది. ఐతే ఆచరణలో పెట్టడం ఎలా ?

మర్నాడు సాయంత్రం రాజోలునుంచి ఎవరో డాక్టరుగారి కుటుంబం వచ్చింది. పెదబాబుగారి స్నేహితులట. సకల మర్యాదలు జరిపి చాలా ఆప్యాయంగా ఆహ్వానించారు. సాయంత్రం అయిదారు గంటలవుతోందగా మేడమీది తివాచీ గదిలో వాళ్ల మాటలు విందామని నేనూ చేరాను. వాళ్ళు సగం గురించి, సినిమాల గురించి మాట్లాడుతోంటే వినక నేను యిటూ అటూ చూస్తోండగా నా చూపు ఓ బలిసిన పందికొక్కుమీద పడింది.! దొంగలాగా రహస్యంగా కాబోలు మూటల్లో మునిగిపోయి పక్కన 'సాస' ర్లో పాలు ఈ పందికొక్కు తాగుతుండడం గమనించడంలేదు. నాలో రక్తం ఉరకలు వేసింది. ఆ పాడు జంతువుని చీల్చి చెండాడి అందరి అనుగ్రహం సంపాదించాలని నిర్ణయించుకుని, భగవంతుణ్ణి తలుచుకుని తటాలున ముందుకు దూకి ఆ దుష్టప్రాణి మెడ పట్టుకు విసిరాను.....

'అమ్మోయ్' .... 'ఏయ్ ఫీనా ! ఫీనా !" అని కేకలూ, నడకనుంచి ఏడుపు వినరావడంతో ఒక క్షణం ఆగి ఆ పందికొక్కు ఏం చేస్తోందో ఒకసారి చూశాను. నా ఆశ్చర్యం అవధులు దాటింది.

ఆ జంతువు 'ఫొ ! ఫొ' మని మహాగ్రహంతో అరుస్తోంది.

నాకు మూర్ఛ వచ్చినట్టయింది. ఇంకా జేసి ఇది పిల్ల కుక్కపిల్లనాట. పాలు తాగుతోంటే పందికొక్కుగా పొరబడింది. ఓ కుక్కని చూశా !

## నా పెళ్లి....

### తుంగతుర్తి విశ్వనాథం.

అయ్యో !
ఎవరా పెళ్లాడి
ఇటు వస్తారా ఒకసారి
నా జాతకం చూస్తారా కడసారి
ఉందా నాకు కాంతాయోగం?
వదుల్తుందా నాకు ఈ దుర్యోగం
అవుతుందా నాకు వివాహం ?
హరిస్తోంది నన్ను ఈ దాహం
ఏమిటో ఈ పెళ్లిళ్లు
ఎలా పడతాయో మూడు ముళ్లు
అర్థం కాదు నాకుమాత్రం
తెలుసా మీకు సూత్రం
నాన్నకు కావాలి కట్నం ముల్లె
అమ్మకు కావాలి పల్లెటూరిపిల్లే
చూచాను పిల్లల్ని నేను కోట్లు
మెచ్చుకైనా లేవు వారిలో లోట్లు
నచ్చరేదు మా వారికి
మెచ్చలేదు వాళ్లెవరిని
పిచ్చెత్తుతోంది నాకు
పుచ్చుకుంటాను విషపాకు
అదుగో వస్తోంది నా ప్రేయసి
అంద చందాలు చిందే సరసి
అడుగుతాను నా హృదయేశ్వరిని
అంగీకరిస్తుందేమో నా గాంధర్వాన్ని
ఆఁ! ఉందా అభ్యంతరం?
వేరేలేదే గత్యంతరం
చెప్పమంటాను గణపతినే పెళ్లి
ఎప్పుడౌతుందో నా పెళ్లి !?

వా నెత్తిమీద ఒకేసారి రెండు చేతిసంచులూ, ఒక గొడుగూ పడ్డాయి. తెలివి తెచ్చుకుని పక్కనే ఉన్న 'సోఫా' కిందికి దూరాను.

ఆ అమ్మాయి ఆ కుక్కపిల్లని ఎత్తుకుని ఒళ్లంతా నిమురుతూ ఏడుపు మొదలెట్టింది. వాళ్లమ్మ గారూ, మా యజమానురాలూ 'నిర్మలా!' ఏడవకమ్మా ! ఏం అవలేదులే. ఆ కుక్కని ఈ ఇంట్లో ఇంక ఉంచముగా' అని వోదార్చడం మొదలెట్టారు. ఇక మా యజమానురాలు 'ఒరే వెంకన్నా ! ఈ పాడు పక్కని దొడ్లో కట్టేసెయ్యి. రేపు గోదావరి అవతల పారేసి రమ్మంటాను' అంటోంది. వెంకన్న వచ్చి సైగ చెయ్యగానే 'సోఫా' నుంచి బయటకు వచ్చాను.

# కుక్కపిల్ల

నేను బయటకు వెంకన్నతో వెళ్లిపోతోండగా కూడా కొంప మునిగిపోయినట్టు 'భౌ!భౌ' మని మొరుగుతూనే ఉందా కుక్కపిల్ల..... 'ఇదుగో! వదుల్తే నిన్నేం చేసిపారేస్తానో తెలుసా' అంటూ....

ఆ రాత్రి అమావాస్య కాబోలు చీకటిగా, చాలా చీకటిగా ఉంది. ప్రపంచంలో చైతన్యమంతా స్తంభించినట్టు అంతా నిశ్శబ్దంగా భయంకరంగా ఉంది. దిగులుగా స్తంభం పక్కన కూర్చున్నాను. నాలుగు వైపులా తలుపులువేసి వెంకన్న నన్ను కట్టకుండానే వెళ్లిపోయాడు. సాయంత్రం సంఘటన తలచుకుంటే నవ్వూ, విచారమూ కలుగుతున్నాయి. ఇక నా గతి ఎక్కడో అనుకుని దిగులు పడుతూండగా ....

ఎక్కడో—కొద్ది దూరంలోనే చిన్న చప్పుడైంది.... ఎవరో దూకినట్టు. చెవులు రిక్కించుకు విన్నాను. మా అమ్మ అభిప్రాయం ప్రకారం. కుక్కలు ఏదేనా చప్పుడు వింటే గొంతెత్తి ఇల్లెగిరిపోయేలా అరవాలి. కాని, నేను బొత్తిగా ఒప్పుకోను. బుర్ర ఉపయోగించాలి గాని, అరచి ప్రయోజనం ఏమిటి ?

ఇంతలో ఆ యింట్లో ప్రవేశించే దురూహతో ఆ 'వ్యక్తి' కిటికీ కమ్మీలు వంచుతున్నాడు. చాలా బలవంతుడిలా ఉన్నాడు. చాలా తక్కువ కాలంలో పని ముగించి శరీరాన్ని అతనవతలికి చేరవేశాడు. నాకు దానిలో దూరి అతని వెనక పడడం సులభంగా నెరవేరింది. మేడ మెట్లు ఎక్కడం కూడా అతని వెనకాల చాలా జాగ్రత్తగా చేశాను. ఏ చిన్న శబ్దం వచ్చినా పసిగట్టి కాలికి బుద్ధి చెప్పడూ ?

భోషాణం ముందు కూచుని ఆత్రుతగా తెరచి వేయడానికి ప్రయత్నిస్తున్న ఆకారాన్ని చూస్తూ నిలబడ్డాను. ఏం చెయ్యాలి ? పక్క గదిలోనే యజమాని నిద్రిస్తున్నారు. అరిస్తే తుపాకి పట్టుకురారూ ? కాని వచ్చేవరకూ ఈ మహానుభావుడు ఇక్కడే ఉంటాడా ?

'ఏది అయితే అదే కాని' మ్మని ఇల్లెగిరిపోయేలా అరుస్తూ ఆ దొంగ కాలు శాయశక్తులా పట్టుకున్నాను. అతను విడిపించుకోడానికి ప్రయత్నిస్తూ హడిలిపోతుండగా మరు క్షణంలో ఆ గదిలో దీపం వెలిగి పెదబాబుగారు తుపాకీని గురిపెట్టారు.

ఇక ఆ తర్వాతేం జరిగిందీ చెప్పనక్కర్లేదు. మర్నాడు నన్ను గోదావరి అవతలి తీరానికి పంపలేదని సులభంగా వూహించుకోవచ్చు. యజమానికీ, యజమానురాలికీ ప్రీతిపాత్రుణ్ణయ్యానని వూహించడం కష్టం కాదనుకుంటాను.

రోజులు హాయిగా, తేలిగ్గా దొర్లిపోతున్నాయి. రాజోలు వెళ్లి అందర్నీ ఒకసారి చూసి రావాలన్న కోరిక తప్ప వేరే కోరికలూ ఆశలూ లేవు. ఇంత ఆదరంగా చూసే యజమానులవద్ద రాజబాబు పెరిగి పెద్దవాడవుతూంటే చూసి ఆనందిస్తూ ఈ గడ్డిలో పడుకుని ఎంతకాలమైనా హాయిగా దొర్లించవచ్చు ......

చీకటి లోకాన్ని పూర్తిగా కప్పివేసింది. నల్లటి... పొగలాంటి .... కాటుకలాంటి చీకటి .... కాని, ఇంత నలుపునీ ధిక్కరిస్తూ ఆకాశంలో చంద్రుడు నక్షత్రాలతోబాటు మనోజ్ఞంగా నవ్వుతున్నాడు.

పెదబాబుగారి యింట్లో కుక్కలన్నీ నిశ్చింతగా గస్తీ తిరుగుతున్నాయి.

(శ్రీ శ్రీ పద్యం, 'ఉడ్‌హౌస్' గద్యం ('ది మిక్సర్' చదివాక.)





# రూ. 500.00
# పుస్తకాలు ఉచితం!

మా
ఇంటింటా స్వంత గ్రంథాలయ
ప్రణాళిక (హెచ్.ఎల్.పి.)
అతి త్వరలోనే
**శత శతోత్సవం**
చేసుకోబోతున్నది

నాలుగంకెలను అయిదంకెలను చేసి
ప్రణాళిక చరిత్రలో కొత్తపుట తిరగవేసే
**10,000 నంబరు**
**చందాదారును**
**గౌరవించదలచింది**

## ఆ భాగ్యశాలి మీరే కావచ్చు!






Regd. 212864



1960 మే లో ఓంప్రథమంగా ఆరంభించినది లగాయతు అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వస్తున్న మా సుప్రసిద్ధ 'ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళికకు నేడుమొదలు సెప్టెంబరు 30 లోగా ఏనాడో ఒకనాడు ఏదో పుణ్య గడియల్లో, ఎవరో ఒక అదృష్టశాలియైన తెలుగు పుస్తక ప్రియుడు తప్పకుండా 10,000 నంబరు చందాదారుగా నమోదు కావడం మాటికి ముమ్మాటికీ ఖాయమేనని వెనుకటి అనుభవం చెప్పకచెప్పక ఘంటాఘోషంగా చెబుతున్నది.

ఆ భాగ్యశాలి అయ్యే కావచ్చు: లేదా అమ్మే కావచ్చు. అది సన్నిహిత భవిష్యత్తే నిర్ణయిస్తుంది, అది అసలు అయ్య అయితే ఏమి. అమ్మ అయితే ఏమిగాని ఆ వ్యక్తి నిజంగా మహామహా అదృష్టశాలి అనుకోవాలి. ఆ అదృష్ట శాలికి—ఆ 10,000 నంబరు చందాదారుకు

**రూ.500 ల పుస్తకాలు ఉచితం**గా ఇచ్చి గౌరవిస్తాము.

ఈ భూరి బహుమతేకాక వరసాగ్గా మరికొన్ని పారితోషిక బహుమతులు కూడా ఉంటాయి. ఇవాళ మొదలు కొత్తగా చేరేవారిలో ఒక్కొక్క శతమానం తిరగవేసే పుణ్య పురుషులకు కూడా పుస్తకరూపంగా రూ. 20ల బహుమతులు కొన్ని ఇస్తాము.

ఈ బహుమతి పుస్తకాలన్నీ, మియంతట మీరుగా, మావద్ద ఉన్న 2700 పైచిలుకు పుస్తకాలనుంచి మీ ఇష్టానుసారంగా ఏరుకోవచ్చు. ఆ ఎన్నికలో సర్వస్వాతంత్ర్యం మీదే.

హెచ్. యల్. పి.కి చందాదారు కావడం సర్వాత్మనా లాభసాటి సదుపాయం అని ఏనాడో రూఢియైన సంగతి.

ఇప్పుడు అది మరిమరీ లాభసాటి సదుపాయం.

ఏమో. ఎవరి అదృష్టం ఎలా ఉందో; చూడండి!

వివరాలకు తరువాయి పుటలు చూడండి.

**ఆఖరు గడువు సెప్టెంబరు 30**

మీ స్వయంవరానికి

ఇదిగో

మా కొత్త ఉచిత పుస్తకాలు



మీకు ముందుకు ముందే రావలసిన మూడు ఉచిత పుస్తకాలనూ ఈ క్రింది ఆరింటినుంచి ఎంచుకోవచ్చును



**F 33 స్వయంవరం** — బలవత్తరమైన బాహిర ఉపాధులకూ, అవ్యక్తమైన ఆంతరిక ఉపాధులకూ జరిగే ప్రేమ సంఘర్షణలో అంతప్పృతే అంతిమ విజయమని చాటే కపిల కాశీపతి నవల.

**F 34 సుడిగాలి** — శాంతమైన సంసారాల్లో పనిపాటా లేని చుప్పనాతులు లేపే సుడిగాలులూ, వాటికి చిక్కుకుని అల్లాడే అమాయకురాండ్ర ఆరాటాలూ, ఆ చుప్పనాతులకు తగిన చురకలు వేసే బాలల చమత్కారమూ చిత్రించే గుళ్లపల్లి సుందరమ్మ నవల.

**F 35 ప్రెసిడెంట్ లిండన్ జాన్సన్** — అన్నింటా తనకి అంతటి ఘనుడనిపించుకొంటున్న అమెరికా అధ్యక్షుని కథ. బాబ్ మూనీ ఆంగ్ల మూలానికి రామలక్ష్మి ఆరుద్ర అనువాదం.

**F 36 కథానాయకుడి కథ** — అమెరికా అంతటా జైత్రయాత్ర చేసి జేజేలు అందుకొని వచ్చిన, నటశిఖామణుల్లో నాయకమణి మన నాగేశ్వరరావు అసలు, నకలు జీవితాల్లోని జీవద్ఘట్టాల సజీవ చిత్రణ. అన్నిటికీ అన్ని చిత్రాలు. ముళ్లపూడి వెంకటరమణ రచన.

**F 37 కాలం తెచ్చిన మార్పు** — ఇన్నాళ్లూ మరుగున వుండి, కలిసివచ్చిన కాలం తెచ్చిన మార్పువల్ల బయటికివచ్చిన కథకుడు ఆర్. యస్. సుదర్శనం కథల బంగారు బరిణ.

**F 38 చిటికె చిరుగంట** — చిన్నారి పాపల చిట్టి హృదయాల్లోని గట్టి గుణాలను ప్రతిబింబించే పిల్లల నవల. రంగు రంగు బొమ్మలతో వల్లియప్ప రచనకు చల్లా రాధాకృష్ణశర్మ చక్కని అనువాదం.

## ఆఖరు గడువు సెప్టెంబరు 30






Regd. 212864

18 నెలలు పూర్తిచేస్తే మీకువచ్చే

## యావజ్జీవిత సదుపాయాలు

యావజ్జీవితమూ మా పంపిణీ పుస్తకాలన్నిటిపైనా 10% కమిషన్. 20 రూ॥లకు పైబడ్డ ఆర్డర్లకు అదనంగా రవాణా ప్యాకింగులు ఉచితం.

అవసరమైనప్పుడు 50 రూ॥లకు మించకుండా నెల రోజుల అరువు. "పుస్తక ప్రపంచం" చందాలోకూడా 10% తగ్గింపు. ఉత్తరోత్తరా వచ్చే పెద్దా, చిన్నా కేటలాగులన్నీ ఉచితం.

ఆంధ్రలో మంచి గ్రంథాలయాలు ఇంటకలవారి పేర్లు ఛాయా చిత్రాలతో పలువురికి ఉపయోగించగల విధంగా తీర్చిదిద్దిన సువర్ణ గ్రంథంలో మీ పేరు చేరుస్తాం.

### చందా కట్టే విధానం

1. 6 ఉచిత పుస్తకాల జాబితానుండి మీకు నచ్చిన 3 పుస్తకాలను ఎంచుకుని ✓ గుర్తుపెట్టి ఈ కూపను పూర్తిచేయండి.
2. కూపను, మొదటి నెల చందా రు. 5/-లు చేర్చి దిగువ అడ్రసుకు మనియార్డరు పంపండి.

'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక
ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతి రోడ్, సికిందరాబాదు

3. తరువాత నెల నెలా రు 5/- వంతున ఆయానెల ఆఖరులోగా చందా మొత్తం రు 90/- అయేదాకా పై అడ్రసుకి పంపుతూ వుండాలి.

ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళికకు నన్ను చందాదారునిగా చేర్చుకోండి. మొదటి నెల చందా రు. 5/- మనియార్డరు పంపుతున్నా. తొలి విడత ఉచిత పుస్తకాలు మూడూ కింద గుర్తుంచాను (✓) మీ నిబంధనలకు బద్ధుణ్ణి.

F 33    F 34    F 35    F 36    F 37    F 38

పేరు

చిరునామా

ఊరు                                        జిల్లా

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్
సికిందరాబాద్

వెళ్ళి పంతులుగారితో తమ కూతుర్నిస్తాననడం, వారంగీకరించడం, తరువాత తాంబూలాలు పుచ్చు కుని ముహూర్తం నిర్ణయించుకోవడం జరిగింది.

పెళ్ళింక ఇరవై రోజులుందనగా పంతులుగారు బంధువులందరి ఇళ్ళకూ వెళ్ళి చెప్పడం ప్రారం భించారు. "హనుమయ్యగారు మా పిల్ల పెళ్ళిలో ఎన్ని పేచీలు పెట్టాడో మీకు తెలుసు. ఇప్పుడు చూడండి. వారి పిల్లని మేము ఎంత సౌమ్యంగా వివాహం చేసుకుంటామో. పెళ్ళంటే ఇదే పెళ్ళి! మీరు తప్పకుండా రావాలి సుమండీ. అసలు ముఖ్యమైన సంగతి కట్నం సంగతి ఇంతిమ్మని నేనడుగలేదు. ఆయన చెప్పలేదు. ఆయన ఇచ్చిందే పుచ్చుకుంటాను" అని ఆడా మగా భేదంలేకుండా అందరితోనూ, కన్నుకొడ్తూ, వెకిలిగా నవ్వుతూ. "వాళ్లకు ఈ దెబ్బతో బుద్ధివస్తుంది. చూసుకోండి అహహా !— హనుమయ్యేం తెలుసండీ, పెళ్ళి చెయ్యడం అంటే? ముగ్గురు మగపిల్లల పెళ్ళిళ్లు చూశాడు. అంతేనా? ఇప్పుడు ఆడపిల్లల పెళ్ళి చెయ్యమనండి, తెలుస్తుంది" అని చెప్పసాగాడు. ఆయన మాటలు వినేవాళ్లంటే, తన జీవితచరిత్ర అంతా అంటే తను ఎప్పుడెప్పుడు ఎవళ్లని కోర్టు కీడ్చి తిప్పలు పెట్టిందీ— వివరంగా చెప్తాడు. చాలా మందికి వినడం ఇష్టం ఉండకపోయినా, డబ్బున్న వాడుకదా అని, తనకు అతనితో ఎప్పుడైనా అవసరం రావచ్చునని, శ్రద్ధ నటిస్తూ, ఆయన కన్నుకొట్టడాన్నీ వెకిలి నవ్వునీ లోలోపల అస హ్యించుకుంటూ వింటారు.

తన గొప్పతనం, కట్నం అడుగక పోవడంతోనూ తనను అన్ని తిప్పలుపెట్టిన హనుమయ్యగారి కూతుర్నే మళ్లీ తన కొడుక్కి వివాహం చేసుకో దల్చుకోవడంలోనూ, ఏ విధంగా ప్రదర్శితమౌతున్నదీ బంధువులందరికీ తెలియాలని, తను వేయించే శుభలేఖల్లో, పైన మామూలుగా వేయించే "జానక్యాః కమలామలాంజలి పుటే......" అన్న శ్లోకం బదులు, "ఒరులేయవి యొనరించిన, నరవర యప్రియము తన మనంబునకగు దా నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమధర్మ పథముల కెల్లన్" అను పద్యం వేయించాడు. చదివినవారంతా ఇది కొత్త పద్ధతిలా ఉందనుకున్నారు. పంతులు గారు తన సౌజన్యాన్ని ఎంత చాటుకోదల్చుకున్నా, బంధువులూ, స్నేహితులూ ఆయన్ను బాగా ఎరిగిన వారు కాబట్టి, ఇదంతా హనుమయ్యగారిని రచ్చ కెక్కించాలని చేస్తున్న ప్రయత్నమనీ, కట్నం అడుగకపోవడానికి కారణం, ఎలాగా హనుమయ్యగారు పది పన్నెండు వేలదాకా ఇవ్వదల్చుకున్న విషయం అందరికీ తెలిసిందే కాబట్టి వేరే అడుగనవసరంలేదనీ, పెళ్లయ్యాక పంతులుగారు కోడల్ని నానా హింసలూపెట్టి, తన కూతుర్ని వాళ్ళు పెట్టిన తిప్పలకు జవాబు చెప్తారనీ అనుకోసాగారు.

పంతులుగారు బంధువులందరికీ పై పద్యాన్ని కూడా మరీ చదివి వినిపించి, తను ఎంత సౌమ్యంగా ఈ పెళ్ళికి ఒప్పుకున్నదీ చెప్తూ వచ్చారు. పెళ్ళిలో కొత్తగా గొడవలుండవనేసరికి కొందరు బంధు వులు బాగా నిరుత్సాహపడిపోయి, "పోనిస్తూ,

# ఒరులేయవి యొనరించిన

26 వ పేజీ తరువాయి

ఈ పెళ్ళికి వెళ్లకపోతేనేం?" అనుకున్నారు. దానికి మరికొందరు, "అదేం మాట? హనుమయ్యా— పంతులూ దెబ్బలాటల్లేకుండా ఎలా పెళ్లిచేస్తారు. అందులోనూ బుచ్చిశాస్త్రి సామర్థ్యం— నీళ్లల్లో మంటలు పుట్టించగల మేధావి, అతను! ఈ పెళ్లి చూసి తీరాల్సిందే" అని చిందులు తొక్కారు మరికొందరు వయసుమళ్లిన బంధువులు. మరీమరీ పెద్ద దెబ్బలాటలు జరగవచ్చునని వూహించి, ఎందు కైనా మంచిదనీ, అయొడినూ, బాండేజీలతోసహా సిద్ధమయ్యారు.

హనుమయ్యగారు చాలా కోలాహలంగా పెళ్లి ఏర్పాట్లు చేయించారు. తమ మేడని, అడుగడు గునా కాగితంపూలతోటీ, మెర్క్యురీ దీపాలతోనూ అలంకరించారు. ఈ నాల్రోజులూ, భోజనాలూ, కాఫీ టిఫిన్లూ,....పెద్దహోటలువారికే కాంట్రాక్టు ఇచ్చేసారు. పందిరీ, పెళ్లి మండపం అలంకరణా, కన్నులు మిరుమిట్లుగొల్పేటట్లున్నాయి. లగ్నం ఆ రోజు రాత్రనగా, ప్రొద్దున్నే పెళ్లివారు స్పెషల్ బస్సుల్లో దిగారు. వారి ఏర్పాట్లన్నీచూసి, ప్రొద్దుటి తతంగమంతా జరిపించి, హనుమయ్యగారు పెళ్లివారికెటువంటి లోటుపాట్లు లేకుండా చూసు కోసాగారు. పంతులుగారికి, కట్నంగురించి హను మయ్యగారు ఏమీ అనడేమా? అన్న ఆలోచన పట్టుకుంది.

సాయంకాలం ప్రధానం జరిగింది. పంతులుగారు శాస్త్రిని పక్కకు పిల్చి, "కట్నం సంగతేమిటోయ్." అనడిగారు, కన్నుకొట్తూ. దానికి బుచ్చిశాస్త్రి "నాతోనూ ఏమీ అనలేదండీ. వాలకం చూస్తే లగ్నకాలమందే ఇచ్చేటట్లుంది. అప్పుడే ఆ సంఖ్య తేలుతుంది." అన్నాడు.

"అయితే సరేలే" అన్నారు పంతులుగారు. లగ్నం రాత్రి రెండుగంటలకు. ఒంటిగంటకే వివాహ మండపం చుట్టూవున్న ఆవరణంతా, అతిథులతో నిండిపోయింది. విద్యుద్దీపాలతో కాంతి, భాజాభజం త్రీల ధ్వనీ, నవనాగరిక యువకులూ, పట్టు చీర్ల యువతులూ తిరుగుతూంటే ఏర్పడే శోభా, పురోహితుని మంత్రాలూ, మంగళ స్నానంచేసి తీవిగా కూర్చున్న పెళ్లికొడుకూ, సిగ్గుతో తలవంచుకున్న పెళ్లికూతురూ, అన్నీ నయనా నందకరంగా ఉన్నాయి. ముహూర్తం సమీ పిస్తున్నకొద్దీ పంతులుగారి గుండెల్లో గుర్రాలు పరిగెత్తసాగాయి. కట్నం! ఎంత !— ఇదే ఆయన ప్రశ్న: పదివేలా— పదిహేను వేలా—పాతిక...ఏమో! ఒక్కతే కూతురూ, అపురూపం కాబట్టి, పాతిక వేలివ్వచ్చు.

ముహూర్తం అయిపోయింది. భాజాభజంత్రీ ఒక్కసారి హోరుమన్నాయి. మళ్లీ ఆగిపోయాయి. బుచ్చిశాస్త్రి మంత్రాలు చదవడం ఆపి, "శ్రీ హను మయ్యగారు......కన్యాదాన కాలమందు......" అం టున్న మాటలు విన్పించారు పంతులుగారికి. "హమ్మయ్య!" అనుకున్నారు. ఇహ ఇప్పుడు కట్నం సంగతి తేలుతుంది. శ్రద్ధగా బుచ్చిశాస్త్రి మాటలు వినసాగారు. "తమ అల్లుడికి హనుమయ్యగారు సమర్పించు కట్నం వెయ్యినూట పదహార్లు......" పంతులుగారికి ప్రపంచం గిర్రున తిరిగినట్లైంది. "ఆ !" అన్నారు.

"వెయ్యినూట పదహార్లా ?" అని అరచారు. బుచ్చిశాస్త్రీ హనుమయ్యగారూ ఆయనవైపు చూసి, "అవును" అన్నారు. పంతులుగారు రౌద్రా కారం దాల్చారు. "ముష్టి వెయ్యి రూపాయిలా? చాల్చాలు. సూర్యం లేచిరారా?" అని అరచారు. అంతా అల్లకల్లోలమైపోయింది. హనుమయ్య గారు, "ఏం ? నువ్వింత ఇమ్మని అడిగావా ? అడగ లేదు కాబట్టి నే నివ్వదల్చుకోలేదు. నా కూతురు వంటిమీద పదిహేనువేల రూపాయిలు బంగారం పెట్టాను. నువ్వడిగితే అదే కట్నమిద్దును" అన్నారు. దానికి పంతులుగారు "ఇదంతా మీరాడిన నాటకం అన్నమాట. పదివేలకు తక్కువ గాకుండా కట్నం ఇస్తానని, బుచ్చిశాస్త్రిచేత చెప్పించి ఇప్పుడిలా ఎగ్గొట్తారా ? మాకీ పెళ్లే అక్కర్లేదు. సూర్యం, రారా !" అన్నారు. పెండ్లి చూడటానికి వచ్చిన వాళ్లంతా, ఇద్దర్నీ శాంతింపజెయ్యాలని చూశారు గాని, వియ్యంకులిద్దరూ ఎంతమాత్రం ఆగక ఒకరి నొకరు విపరీతంగా దూషించుకోవడం మొద లెట్టారు. మధ్యవర్తులు కలుగజేసుకుంటే "ఆ పది హేనువేలూ కట్నం ఇవ్వమనండి" అని పంతులు గారూ, "కట్నం మాటెత్తవద్దనండి" అని హను మయ్యగారూ అరవ నారంభించారు. పంతులుగారు "లేచి రావేమిరా సూర్యం ? రా !" అని గట్టిగా అరిచేసరికి, పెళ్లికొడుకైన సూర్యం లేచి నిల్చు న్నాడు. అందరూ అతనివైపు చూశారు. "నాన్న గారూ !" అని పిల్చాడు.

"నాన్నగారూ ! శుభలేఖల్లో 'ఒరులేయవి యొనరించిన అప్రియము, దా నొరులకు నవి సేయ కునికి పరమ ధర్మము' అని వేయించారు కదా. వాళ్లది మోసబుద్ధయితే ఆ అగౌరవం వాళ్లకే ఉండ నివ్వండి. మనం వాళ్ల కోవలో చేరడ మెందుకూ? మనం చెప్పుకున్నట్టు మనం ఆచరిద్దాం" అన్నాడు. అది విని హనుమయ్యగారు, "బాగా చెప్పావు నాయనా" అన్నారు. అందరూ అవునన్నారు. పంతులుగారు "నోర్మూయ్ !" అన్నారు. "సిగ్గు లేక కట్నంలేని పెళ్లి చేసుకుంటావా ? రా ! ఇవతలికి" అని కేకేశారు. పెళ్లికూతురు నిల్చుంది. "మామగారూ! మీ రడుగలేదు కాబట్టి, ఇవ్వలేదని మా నాన్నగా రన్నారు. ఇప్పుడడిగారు గాబట్టి ఈ బంగార మంతా కట్నంక్రింద ఇచ్చేస్తున్నాను. తీసుకోండి. మీ పంతాలు మానండి" అని మనోరమ తన నగలుతీసి శాస్త్రికిచ్చి, కట్నంక్రింద చదివించ మంది. హనుమయ్యగారు నిర్ఘాంతపోయారు. పంతులుగారూ కన్నుకొట్తూ "ఏమిటీ ?" అంటూ, బుచ్చిశాస్త్రి చదివింపు వినసాగారు.

పెండ్లికొచ్చిన అతిథులంతా మనోరమనెంతో మెచ్చుకున్నారు. సూర్యం, ఆశ్చర్యంతోనూ, మెప్పు దలతోనూ మనోరమను చూస్తూంటే, ఆమె తల వంచుకుని క్రీగంట అతనితో చూపు కలిపింది.



# ఆడవారూ—హాస్యమూ

29 వ పేజీ తరువాయి

వచ్చినపుడల్లా కబుర్లు చెపుతూ వాళ్ల ఇంట్లో పిల్లలకని పెట్టిన చాకలెట్లని తినేసేవారుట. ఇది చూసి విసుగెత్తిన పద్మ, ఆవిడ తినగానే క్రింద పడేసిన చాకలేటు కాయితాలన్నీ చేర్చి పెట్టింది. వాటిని ఆవిడకిచ్చి "దీన్ని మీ పిల్లలకిస్తే వీటిని గుచ్చి కాగితాల మాల క్రింద తయారు చేసుకుంటారు. వాళ్ల అమ్మ తినేసిన చాకెలెట్ల జ్ఞాపకార్థం" అని చమత్కారంగా ఒక పొట్లం ఇచ్చింది. ఇంకా తర్వాత ఆవిడ చాకెలెట్లని ముట్టుకోలేదు.

అలాగే ఇద్దరాడవాళ్లు కలుసుకున్నపుడు ఒకావిడ రెండో ఆవిడతో "మా ఆయన యుద్ధానికి వెళ్లినపుడు కూడా నా ఫోటో తీసుకెళ్లారు" అంత ప్రేమ నాపై అన్న ధోరణిలో. దానికి రెండో ఆవిడ "ఓహో దాన్ని చూపించి శత్రువులని భయపెట్ట వచ్చున్న వూహ కాబోలు" అని తక్కువ చెప్పిందిట. మొదటి ఆవిడ ఇంకెప్పుడూ గొప్పలు చెప్పుకోలేదుట.

ఒక లేడీస్ క్లబ్బు వార్షికోత్సవంలో మనుష్యుల ఆకారాలకి తగ్గట్లుగా బహుమతులిచ్చారు. పన్నగా పొడుగ్గా ఉన్నావిడకి పొట్లకాయ లావుగా గుమ్మటంలాగా ఉన్నావిడకి గుమ్మడికాయ మొదలైనవి. దాని కెవరూ కోపగించుకోలేదు. అందరూ నవ్వుతూనే పుచ్చుకున్నారు. స్త్రీలకి హాస్యానుభూతి లేకపోయినా, స్పోర్టింగ్ స్పిరిట్ లేక పోతే ఇలాంటివన్నీ సరిగ్గా అర్థం చేసుకోగలరా ?

పిల్లల అల్లరిని నవ్వుతూ భరించేది తల్లి మాత్రమే. వాళ్లు చేసినవన్నీ చిలవలూ, పలవలూ చేసి భర్తకి చెబుతుంది అతడది సరిగ్గా వినక చిరాకుగా ఏదైనా మనస్సు నొచ్చేట్లుగా అంటే అభిమానం కొద్దీ లేచి వెళ్లిపోతుందా ఇల్లాలు. ఇంక మొదలు "అబ్బ మాట అంటేనే కోపం, అభిమానం మీ ఆడవాళ్లకి నీళ్లకుండ నెత్తినే ఉంటుంది" అని విమర్శలు.

మగవారు హాస్యంగా వ్యంగ్యంగా, వెటకారంగా అనేవాటికి తిరిగి, చమత్కారంగా జవాబు చెప్పాలనే ఉంటుంది స్త్రీకి. కానీ ఉగ్గుబాలతో ఆడవాళ్లలా చెప్పకూడదు, చెయ్యకూడదు, నవ్వకూడదు అన్న ఆంక్షలు జీర్ణించుకు పోయిన ఆడది గబుక్కున ఎదురు జవాబు చెప్పదు, చెప్పనేరదు. మాటకి మాట చమత్కారంగా అందించనేరక అభిమానంతో కోపగించుకుంటుంది లేదా ఏడుస్తుంది, అంత మాత్రాన ఆడవారికి సెన్స్ ఆఫ్ హ్యూమర్, స్పోర్టింగ్ స్పిరిట్ లేదనడం సబబు కాదు.

ఈ ప్రాంతాల కాలేజీ ఆడపిల్లలు ఎంత హాయిగా నవ్వుకుంటారోను. నవ్వుకోవడంలోనే ఉండే హాయి వేరే ఎందులోనూ లేదు. అన్నింటినీ మరిచి హాయిగా నవ్వగలగాలి. కష్టాలని నవ్వుతూ ఎదుర్కోవాలి. దీనికి ఆడా మగా భేదం ఉండకూడదు. నవ్వుతూ, నవ్విస్తూ హాయిగా జీవించడం నేర్చుకోవాలి ప్రతి ఒక్కరూ. ★

# హృదయ కుసుమాలు

19 వ పేజీ తరువాయి

సీత మళ్ళా చెప్పసాగింది—

"అక్కయ్యతో ఇట్లా అన్నాను. జానకీ! నీకు చెప్పేటంత అనుభవంగానీ, అవకాశం గాని నాకు లేదే! అక్కా, నువ్వు వివాహితవు. నేను అవివాహితను. భార్యా భర్తల మధ్య ఉండవలసిన ప్రేమానురాగాలు గాని, సంసార జీవితంలోని సుఖ సౌఖ్యాలు గాని, నాకు తెలియవు గనుకనే, ఈ విషయాల్లో నీతో ఎట్లా మాట్లాడాలో నాకు అర్థం కావటం లేదు. భర్తను ఎదిరించి వారి కివ్వవలసిన గౌరవ మర్యాదలను వారి యందు చూపక స్త్రీకి కూడా సమాన హక్కులు కావాలనే వాంఛతో భర్తను చిన్నతనంగా చూట్టం ఎంత తప్పో, భర్త యందు అమిత వినయ విధేయతలు ప్రదర్శిస్తూ, వారి అడుగులకు మడుగులొత్తుతూ, వారనే మాటలనూ, తిరస్కృతులనూ, శిరసావహిస్తూ, వ్యక్తిత్వాన్ని చంపుకుని, యాంత్రికంగా బతికటమూ అంత తప్పే. దోషమున్నా లేకపోయినా కొంత మంది స్వభావం ఎదుటి వారిని అనవసరంగా దూషించటం తమ ధ్యేయంగా పెట్టుకుంటారు. వారి మనస్తత్వం అటువంటిది. అభాండాలు వెయ్యటం కొంత మందికి సరదా. ఎదుటి వారి మనస్తత్వాన్ని కించపరచటం కొంత మందికి హాబీ. ఇతరుల వ్యక్తిత్వాన్ని విమర్శిస్తూ వారిని దుయ్యబడుతూ తమ అసందర్భపు తెలివి తేటలు ప్రదర్శించి ఆనందించట మనేది కొంత మంది తరహా. వీటనన్నింటినీ పురస్కరించుకుని నిజంగా మనం తప్పు చేస్తున్నామా, అనుకుని ఏమీ లేకపోయినా భయపడి ఆత్మవంచన చేసుకోటం వివేకవంతుల లక్షణం కాదు" అన్నాను.

అక్కయ్య నవ్వింది. నా మనస్సులోని ఆవేదననీ, భావాలనీ, అది అర్థం చేసుకుంటే నేను కృత కృత్యురాల్ని అయినట్లే. కాని జడత్వంతో దాని మనస్సు నిండిపోయినప్పుడు నే చెప్పే మాటలు అక్కయ్య అంతగా అర్థం చేసుకోలేదు.

"అంటే నేను మీ బావకు దాసురాల్నయిపోయి నా వ్యక్తిత్వాన్ని చంపుకుని బ్రతుకుతున్నానంటావా" అన్నది అక్కయ్య.

"వ్యక్తిత్వ మనేది కొంత పుట్టుకతోనే రావాలి. కాలాను గుణ్యంగా వయస్సు పెరుగుతున్న కొద్దీ ఆ వ్యక్తిత్వాన్ని మన జీవితానికి అనుగుణ్యంగా మెరుగులు దిద్దుకుని మనం మన జీవిత పథాన్ని మలచుకో గలిగితే మనస్సుకు ఏ బాధా ఉండదు. ఒకళ్ళు అంటున్నారని మనం బాధపడేకన్నా, అలాంటి వాళ్ళ మనస్తత్వాల్ని మనం అర్థం చేసుకుని, మన యందు ఏ తప్పూ లేదని నిరూపించుకుంటే మనస్సుకు ఎంత హాయిగా బరువు తీరినట్లుగా ఉంటుందో ఆలోచించు" అన్నాను.

"నిజమే సీత, మీ బావ మనస్సుని అర్థం చేసుకునేదానికన్నా, నా మనస్సులోని దుఃఖానుభూతుల్ని ఇంకా పెంపొందించుకుని, నాలో నేను కుమిలి పోయి విచార పట్టంలోనే ఎక్కువగా కాలం గడుపుతున్నానే సీతా" అన్నది అక్కయ్య.

"అంతవరకూ ఒప్పుకుంటే నీ బుర్రలో కాస్త తెలివి తేటలు మిగిలి ఉన్నయ్యని అనుకుంటాను. లభించిన దాంతోనే, జీవితాన్ని సరిదిద్దుకోవటానికి మన తెలివి తేటలు ఉపయోగించాలని నేను మరీ మరీ చెపుతున్నాను. బావ నీ మీద అనుమానపడ్డారు. ఆ అనుమానమే ఆయనలో గట్టిగా పాతుకు పోయి ఉంటే నిన్నసలు వదిలిపెట్టేవారే కదా. కులట అని నిర్ధారణగా తెల్సుకున్న తరువాత ఏ మాత్రం వ్యక్తిత్వం కల భర్తయినా, తన భార్యను ఏలుకుంటాడా? ఆలోచించు. నిన్ను గురించి బావ ఎంతో మథన పడుతున్నారని అంటున్నావు కదా. వ్యక్తిత్వం లేని వారయితే ఈ విషయాల్ని గురించి అంత ఆలోచిస్తారా, నువ్వే ఆలోచించు." అన్నాను.

నా మాటలకు అక్కయ్య ఆశ్చర్యపడ్డది. దాని మనస్సులో కొంత సంచలనం కలిగినట్లు దాని ముఖ కవళికల్ని బట్టి గ్రహించాను. ఆ రోజున అక్కయ్యతో ఈ విషయాలు మాట్లాట్టం అంతటితో ఆపేశాను.

---

**లోక్‌సభలో మాజీ స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగార్ తన చైనా పర్యటనలో అక్కడ చూడవలసిన విశేషాలన్నీ చూశారు. కాని, ఆ దేశంలో కల్లా పెద్దనదికి కట్టబడిన ఆనకట్టను చూడాలని చాలా ఉబలాటం ఉండేది. కాని, చైనా అధికారులు దాన్ని అతనికి చూపలేదు. అతనికి పట్టుదల ఎక్కువై ఆ ఆనకట్టను చూసి తీరాలన్నాడు. అప్పటి అధికారి ఒకరు "సార్, ఆనకట్ట కట్టడమూ, అది వరదల్లో కొట్టుకొని పోవడమూ జరిగాయి." అందువల్ల దాన్ని మీకు చూపలేదు" అన్నాడు. (ట.)**

ప్రకాశం (అనంతపూర్)

---

అక్కడికి వెళ్ళింతరువాత నేను బావతో ఎక్కువగా కల్పించుకుని మాట్లాడలేదు. అక్కయ్యతోనే మాట్లాడుతూ, దానికి సాయం చేస్తూ వారం రోజులు గడిపాను. నాకు మొదట్లో బావ ప్రవర్తన విషయంలో కొంచెం అనుమానం కలిగింది. కాని ఈ వారం రోజుల్లోనూ బావ ప్రవర్తన చూస్తుంటే నాకు ఏ అనుమానమూ కలగ లేదు. అక్కయ్య నడిగితే తనకూ అలాంటి అనుమానమేమీ కలగలేదనినే చెప్పింది.

విజయదశమి పండుగ ఇంకా రెండు రోజులుందనగా పండక్కి ఏం చెయ్యమంటారని బావ నడిగింది అక్కయ్య. ఆ సమయంలో నేనూ అక్కడే ఉన్నాను. బావ నా వైపు చూస్తూ—

"నిన్న విషయం అట్లా ఉంచు. సీతకేం ఇష్టమో కనుక్కున్నావా జానకీ. ఈ పండుగ సీత ఇష్టానుసారమే చేసుకోవాలి. ఏం సీతా, నీకేం ఇష్టం చెప్పు మరి" అన్నారు బావ.

నేనూ ఆలోచించాను. బావ మనస్తత్వం తెల్సుకోటానికి ఇది ఒక సమయమే అనుకున్నాను. బావ అంతర్యం ఏమిటి? అక్కయ్య సౌమ్యతలో ఉందా? బావ పెడసరితనంలో ఉందా? అంతా మెల్లిగా తెల్సుకోవాలనుకున్నాను.

"నా ఇష్టా ఇష్టాలతో ఏనేముంది బావా. మీరు ఏ పిండివంటలు ఇష్టమో చెపితే అవ్వే చేస్తుంది అక్కయ్య. తీరా నా ఇష్టప్రకారం చేస్తే అదేంతప్పో" అన్నాను.

బావ నా వైపూ, అక్కయ్య వైపూ చూశారు. ఆయన ముఖంలో నవ్వు చూట్టం అక్కయ్య కాపురానికి వెళ్ళాక అదే ప్రథమం.

"పోనీండి మీ బావా మరదళ్ళకు ఇద్దరికీ ఇష్టమైన పిండివంటలే చేస్తాను. మీ ఇద్దరికీ ఇష్టమైతే నాకూ ఇష్టమే. సరేనా. మరి మీరిద్దరూ తేల్చిచెప్పండి." అన్నది అక్కయ్య. నాకు తెలిసినంత వరకూ అక్కయ్య అంత సంతోషంతో బావతో మాట్లాట్టం అదే మొదలు.

బావ మాట్లాడలేదు. నవ్వుతూ ఊరుకున్నారు.

"ఏం చెప్పండి" అన్నది అక్కయ్య.

"నాకు రవ్వలడ్డూ, పులిహోర, అందులో జీడిపప్పులు నువ్వుపప్పుపొడి వెయ్యాలి తెల్సిందా. ఇంక ఆవడలు. అంతే అంత వరకూ చాలు" అన్నారు బావ.

"మరి నీకో సీత" అని నన్నడిగింది అక్కయ్య.

"ఆంధ్రుల పౌరుషానికీ, రోషానికీ పులిహోర చిహ్నం. బావ ఎంతో పౌరుషవంతులు కనుక పులిహోర అడిగారు. ఆడదానికి పౌరుషం అలంకారం కాదు. ఆంధ్రుల ఔదార్యానికీ, విశాల హృదయానికీ చిహ్నం చెక్కెర పొంగలి. నాకు మంచి నేతితో కమ్మగా చక్కెర పొంగలి చెయ్యవే అక్కా" అన్నాను నవ్వుతూ.

బావ, అక్కయ్య పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వారు.

"నీకన్నా సీత ఎంతో తెలివైంది. నువ్వూ ఉన్నావ్ ఎందుకూ. కోస్తే రెండు తలుపు చెక్కలవుతావ్" అన్నారు బావ కిటికీలోంచి బయటకు చూస్తూ, గోళ్ళు కొరుక్కుంటూ. అంతలోనే బావ పూసర వెల్లిలా రంగులు మార్చటం చూస్తే నాకు ఆశ్చర్యం కలిగింది. అంత సంతోషంతో మాట్లాడిన బావ ఒక్క నిమిషంలో అట్లా మారిపోవటానికి కారణం నాకు తెలీలేదు. అక్కయ్య చిన్నబుచ్చుకుని వెళ్ళింది. నేను బావవైపు చూస్తూ నిల్చున్నాను. బావ కిటికీలోంచి బయటకు చూస్తూ ఒక్కసారి నా వైపు చూసి తలవంచుకుని కుర్చీలో నుంచి లేచారు. నాకూ ఏం తోచక అక్కయ్య దగ్గరకు వంటింట్లోకి వెళ్ళాను.

"అంత తొందరగా అట్లా తేలిపోయారేమే బావ. అంతకోపం ఎందుకొచ్చింది" అన్నాను అక్కయ్యతో.

"అదే నాకూ అంతు పట్టంది" అన్నది అక్కయ్య బెరుగ్గా నా వైపు చూస్తూ.

(సశేషం)

## అతని ప్రేమ కథ

23 వ పేజీ తరువాయి

నీ కెవరో చాలా దారుణంగా కథని కల్పించి చెప్పారు. అవునా— అనుకున్నాడతను.

రమని అతను గౌరవించేవాడు. ఒకే దారి కావడం మూలంగా తరచూ ఇద్దరూ ఒకే దారిని కాలేజీకి వెళ్ళేవారు. అంతవరకూ నిజం.

అతనికి సీతని వినహా మరొకర్ని ప్రేమించడం తెలీదు. సీత రూపం తప్ప మరో రూపాన్ని అతనెప్పుడూ ఊహించలేదు.

ఒక ఆడపిల్లని పదిమంది నడిచే నడిరోడ్డు మీద అల్లరిపెట్టడం అతనికిష్టం లేదు. ఒకరోజు కామేశం రమని అల్లరి పెట్టాడు. అది సాక్షాత్తూ తన కళ్ళముందు. సహించలేక పోయాడు. అది తప్పు అని హెచ్చరించాడు. అతనేదో వాగేడు. బుద్ధి చెప్పేడు శ్యామలరావ్.

ఇదీ జరిగిన కథ. కట్టుకథలు చాలా ప్రచారంలోకి వచ్చాయి. మగవాడు ప్రచారం చేసే మాట కన్నా ఆడపిల్ల చెప్పిన కథకి విలువ హెచ్చు. అబద్ధం ఆడపిల్లకే అందంగా కుదురుతుంది. కామేశం చెల్లెలు కుసుమ. తన అన్న అభాసు పొందిన విషయం తెలిసి ఆమె కోపంతో నిలువునా ఉడికిపోయింది. కారణమైన శ్యామలరావుని అల్లరి పెట్టాలనుకుంది. స్కాండల్స్‌ని తయారుచేసి ప్రచారంలో పెట్టింది.

చిన్న అతని మనసు కలవరపాటు చెందింది. కావాలని చెప్పి రమని తప్పించు తిరిగాడు. ఇది ప్రచారానికి మరింత బలాన్నిచ్చింది.

మనసు అదుపులో లేనప్పుడు చదువు సాగక పోడం ఆశ్చర్యం కాదు. క్లాసు వస్తుందనుకున్నది కాస్త రాలేదు. ఇంతకు మునుపు నాన్నగారు విన్న ఉదంతానికి ఈ 'అర్హత' తోడై తన విలువని తగ్గించింది. ఆయన మందలించలేదు భోగాని, మౌనంతో చంపుకుతిన్నంత పని చేశారు. అతికష్టంతో తనకి యూనివర్సిటీలో సీటు సంపాయించారు. చేరే వేళకి వద్దని ఆయనే ఆజ్ఞాపించేరు. రమ అదే యూనివర్సిటీలో చేరుతుందని నాన్నగారికి తెలీడం తన దౌర్భాగ్యం. చదువు ఆగిపోయింది. సాధారణమైన ఉద్యోగం దొరికింది.

ఇంత కథ, ఇంత చరిత్రలో తన తప్పు ఎక్కడుంది? తననీచత్వం ఎక్కడ కనిపించింది? సీతకి చెప్పాలి. సీత తనక్కావాలి.

సీతా నన్ను దూరం చేయకు. ఐ లవ్ యూ సీతా. ఐ లవ్ యూ.... శ్యామలరావ్ మెల్లిగా గొణుక్కున్నాడు.

—బాగా చీకటి పడింతర్వాత అతను ఇంటి వైపు నడిచేడు. ఇంట్లో కాలుపెట్టగానే నాన్నగారి గదిలోంచి మాటలు సన్నగా వినిపిస్తున్నాయి.

"....శ్యాముడు సీతని ప్రేమించాడు. ఇది నీకూ తెలుసు. నువ్వు ఆ పిల్లకి చెప్పి చూడరాదూ." నాన్నగారి గొంతు.

"ఈ మధ్య సీత ఎందుకో మారిపోయింది నాన్నా! వయస్సొచ్చిన పిల్లని ఆజ్ఞాపించడం నా చేత కాదు." అక్కయ్య అన్నది.

"నీదంతా చాదస్తమమ్మా! మిమ్మల్ని అలా పెంచామా." అమ్మ నిష్ఠూరం పలికింది.

"ఆయనగారు గారాం చేసి నెత్తికెక్కించు కున్నారు. నేనేం చేసేది. ఈ చదువూ వద్దన్నాను. ఆయన విన్నారు కాదు." అన్నది అక్క.

శ్యామలరావ్ గబగబా తన గదిలోకి వచ్చేశాడు. కాలు కాలిన పిల్లిలా గదంతా తిరిగేడు. అతని కేమీ తోచడంలేదు.

నాన్న మాట కాదనలేరు అక్కా బావాను. కాదనలేక సీతని ఒత్తిడిచేసి ఇష్టం లేని పెళ్ళి చేస్తే— జీవితంలో మిగిలుందనుకున్న ఆ సంసార సుఖం గూడా అన్యాయమై పోగలదు. కూడదు. అలా జరక్కూడదు.

కానీ— సీత తనకి కావాలి.

గంటున్నరలో అతను ఆరు సిగరెట్లు కాల్చేడు. నోరంతా చేదుగా ఉంది. తల తిరుగుతున్నట్లుంది. రెండు రోజుల్లో ఉద్యోగానికెళ్ళాలి. మళ్ళా ఎన్నాళ్ళకిటు రావడమో ? అప్పటి వరకూ సీత....

"ఏమిటది ?" అన్నారెవరో తన గదిలోకి వచ్చి.

ఉలిక్కిపడి చూశాడు. వచ్చినది వదినగారు. కాలుస్తున్న సిగరెట్టు కిందపారేసి కాలితో తొక్కి, మూతి తుడుచుకుంటూ లేచి నిలబడ్డాడు.

"నువ్వు సిగరెట్లు కాలుస్తావా ?"

".... .... .... ...."

"అద్దంలో చూడు. నీ అవతారం ఎల్లా ఉందో ?"

"వదినా ?" అతని కంఠం రుద్ధమైంది.

"ఏం జరిగిందనయ్యా ఇంత ఖంగారు"

"వదినా ! నేను.. దుర్మార్గుడినా ?"

"అని ఎవరన్నారు ?"

"సీత.. సీత నన్ను అపార్థం చేసుకుంది వదినా."

వదినగారు మెల్లిగా నవ్వేరు.

"సీతకి నువ్వేదో ఉత్తరం ఇచ్చి పంపావుటగా"

తలూపాడు శ్యామలరావ్.

"సీత చాలా అదృష్టవంతురాలు నాయనా ! నీలాటి బుద్ధిమంతుడు తనకి కాబోయే భర్తంటే ఎగిరి పోవాలి సీత.' '

"ఔను వదినా ! కానీ— సీత నన్ను భయ పెట్టేస్తుంది."

వదినగారు మళ్ళా నవ్వేరు. ఆవిడ నవ్వు చల్లగా మనసుకి ధైర్యంగా ఉంది. ఆపైనే అన్నారు.

"చిన్న పిల్ల మనసుపట్టి అర్థం చేసుకునేపాటి వయస్సు కాదు. నేనిప్పుడు సీతతో మాట్లాడి వస్తున్నాను. వెళ్ళి సీతతో మాట్లాడు. నీ గురించి చెప్పదలచుకున్నదంతా చెప్పుకో." వదినగారు సలహా చెప్పి వెళ్ళిపోయారు. ఆవిడకి మనసులో చేతులు జోడించాడు శ్యామలరావ్.

కాసేపేదో ఆలోచించేడు. మనసుకేదో తట్టింది. వెంటనే లేచి బీరువా తలుపు తెరిచాడు. దాన్లోంచి, చదువుకునే రోజుల్లో వ్రాసుకున్న డైరీని తీశాడు. దాన్లో ఓ కాగితం మీద వ్రాయ దల్చుకున్నదంతా వ్రాశాడు.

'సీతా,

ఈ డైరీ ఒక్కటే నా హృదయం. చదువుకో. హృదయాన్ని నీకే సమర్పిస్తున్నాను. నేను అలాంటి వాడిని కాను ! ఇలాంటి వాడికే దెబ్బలెక్కువ తగుల్తాయుట. చదువుకున్న దానివి. అపార్థం చేసుకుంటే ధన్యుడ్ని.

—శ్యామలరావ్.

ఆ ఉత్తరం, డైరీ తీసుకుని సీత గదిలోకి వెళ్ళాడు. సీత ఏదో చదువుతూ ఉంది. చదువుతూన్న పుస్తకాన్ని చూశాడు. ఆనందించి అన్నాడు.

"అది నేను వ్రాసిన పుస్తకం. ఎల్లా ఉంది సీతా ?"

సీత అతనివైపు చూసింది. లేచి నిలబడి అన్నది.

"ఈ పుస్తకం అత్తయ్య ఇచ్చేరు. పుస్తకం చదివి వ్రాసినవాని మనసు తెలుసుకోవచ్చుట. అది అత్తయ్య అభిప్రాయం. నాకలా అనిపించడం లేదు. అవునూ.... మళ్ళా ఇక్కడికెందుకొచ్చారు. శేషు కనిపించలేదా ?" అన్నది విస్ఫారంగా.

"నేను ఎల్లుండి మా వూరు వెళ్ళిపోతున్నాను. ఇక ముందు నిన్ను విసిగించను. ఈ ఉత్తరం చదువు. ఉత్తరం వ్రాయడం పెద్దమనుషుల పని కాదని నువ్వే చెప్పావ్. ఇంత కంటే వేరే మార్గం కన్పించలేదు నాకు. క్షమించు సీతా !"

ఉత్తరం, డైరీ బల్లమీద పెట్టి బైట కొచ్చేశాడు శ్యామలరావ్.

* * *

ఆ ఉదయం నారాయణరావుగారి పూలతోటలో నేత్రానందకరమైన ఓ సన్నివేశం చోటు చేసుకుంది. దాంతో ఆ తోట మొత్తానికి పూర్వమైన కళాకాంతులొచ్చి పడ్డాయి.

నారాయణరావుగారి ఒడిలో ఒద్దికగా కూర్చుని కబుర్లు చెబుతున్నాడు శేషు. వాళ్ళకొంచెం దూరంగా పెద్ద కోడలు పెద్దకొడుకుతో కలిసి గులాబీల అందాన్ని శ్రద్ధగా పరిశీలిస్తున్నది. సరిగ్గా ఆ సమయంలో వాళ్ళందరికీ శ్యామలరావ్ మాట వినిపించింది—

"....నాకు రెండు జడలంటే చాలా ఇష్టం సీతా ! అందులోనూ ఒకే జడలో గులాబీ పెట్టుకుంటే మరింత ఇష్టం."

శ్యామలరావ్ సీత నడుంని చేత్తో చుట్టి తనతో పాటు నడిపించుకుంటూ వచ్చాడు. తన తలని శ్యామలరావ్ భుజం మీద వాల్చి అతన్ని అందంగా అనుసరిస్తున్న సీత అన్నది చిలిపిగా—

"తెలుసు. మీ డైరీలో ఒక పేజీ అదే చెప్పింది."

అప్పుడు బిగ్గరగా అరిచేడు శేషు—

"బాబాయితో పిన్ని మాట్లాడేసింది తాతయ్యా !"

వాళ్ళంతా నవ్వుల్లో పొర్లిపోతున్నారు. తాతయ్య, మామయ్యా చిరంజీవి శేషు నెత్తిన ముద్దెట్టుకున్నారు. తాత ఒడిలోంచి లేచి ఠీంగున గెంతుతూ బాబాయి వాళ్ళ దగ్గరికొచ్చేశాడు. వాడి అరవడం చూసి, కాబోయే దంపతులు సిగ్గుపడి పోయారు.

వాళ్ళ సిగ్గుతో నారాయణరావుగారి పూలతోట సరసం నేర్చుకున్నాయేమో !

ఈ కథ వ్రాసినవారి మాటలు మళ్ళీ ఇలా మారిపోయాయేమో !

ఓహోహో ! ఇది అతని ప్రేమకథే ! ★






"ఏదీ ఇంతకీ ఆ బోర్డు కనిపించదే ? ఇన్ని బజార్లు తిరిగినా పొద్దుట్నించీ ఒక్క ఇంటి ముందైనా ఆ పవిత్రమైన బోర్డు కనిపించలేదే !" అన్నాడు బ్రహ్మానందం నావంక దిగులుగా చూస్తూ!

పాపం వాణ్ణి చూసేసరికి నాకూ జాలేసింది. పైగా, వాడు సంతోషం వచ్చినా ఆణచుకోలేడు. దుఃఖం వచ్చినా దిగమింగుకోలేడు. అలాంటివాడు బ్రహ్మానందం !

అయినా, వాణ్ణనుకొని ఏం లాభం ! ఆరోజు అటువంటిది. ప్రొద్దున్నే లేచి ఎవరి మొహం చూశామో ! కనీసం ఒక్క ధర్మాత్ముడైనా, ఒక్క దయామయుడైనా యీ మహానగరంలో "రూమ్ టు లెట్ " అన్న బోర్డు బయట పెట్టలేదే ! ఇంత పగవాళ్లయినారా యీ బ్రహ్మచారులు !

ఆరోజు ఉదయాన కాఫీ తాగి బయల్దేరాం రూములు వెతుక్కోవటం కోసం. బజారు బజారూ తిరిగాం ! కాస్త గంభీరంగా కనుపించిన ప్రతి పెద్ద మనిషినీ అడిగాం,— వాళ్లింట్లో రూములేమైనా ఖాళీగా వున్నాయేమోనని ! "వూఁ సరే, ఇదిగో నయ్యా" అన్న పుణ్యాత్ముడే కనుపించలేదు !

ఆ పేటలో వున్న ప్రతి బజారు, ప్రతి గొంది, ప్రతి సందూ తిరిగాం! ప్రతి ఇంటివైపూ ఆపాద మస్తకం ఆశగా చూచి, నిరాశతో తలలు దించేసుకున్నాం.

కాలం, ఖర్మం కలిసి రావాలి దేనికైనా ! ఉన్న 'రూము'లోనే కాస్త ప్రశాంతంగా వుందామనుకుంటే ఆ యజమానిక్కూడా ఇప్పుడే మారాలీ బుద్ధి ! ఏం మొహమాటం లేకుండా పిలిచి చెప్పాడు, 'వారం తిరిగేలోగా ఖాళీ చెయ్యండని.'

" ఒరే ! బ్రహ్మానందం ! "

వాడీ లోకంలోనే లేడు.

మళ్లీ పిలిచాను " ఒరేయ్ బ్రహ్మ ! "

ఆశగా తిరిగాడు నావైపు : " చెప్పరా చెప్పరా చెప్పు ! ఏదీ బోర్డేమైనా కనుపించిందిరా ! చెప్పేయ్ త్వరగా, ఇవ్వాళే వచ్చి చేరదాం." అన్నాడు. వాడి ఆశ వాడిది.

" అది కాదురా ! ఇక ఇవ్వాల్టికి ఇంటికి పోదాం. మళ్లీ రేపొద్దాం " ప్రాధేయ పడుతూ అడిగాను.

" ఛ ! ఛ ! నామర్దారా. మూడు గంటలసేపు తిరిగి, కనీసం ఒక్క రూము అయినా — పోనీ, ఒక ' టు లెట్ ' బోర్డయినా ...... చూడకుండా పోవటం, ఛ ! ఛ! డామ్ ఇన్సల్ట్ ! " అన్నాడు వాడు.

సరే ! మళ్లీ పాదయాత్ర తప్పలేదు. బ్రహ్మాండమైన ఇళ్లు కనుపిస్తున్నాయి. కాలనీల మీద కాలనీలు లేచి పోతున్నాయి !

" అదుగో, అటు చూడరా, అక్కడేదో చిన్న బోర్డున్నది " ఆశగా చెప్పాడు బ్రహ్మానందం.

అటు చూశాను. ' నిజమేరోయ్ ' అనిపించింది. బోర్డుకూడా దూరంనుంచి ముచ్చటగానే వుంది. ఇల్లుకూడా బంగారంలాగా వుంది. ఆహా! ఈ రూమే దొరికితే, " స్వర్గం, వైకుంఠం .... ఓహో ! " అనుకున్నా మనసులో !

తీరా పోయి చూద్దును—రూములేవు సరి గదా, ఇంకేవో వున్నాయట! "కుక్కలున్నాయ్, జాగ్రత్త" అని వుంది ఆ బోర్డు మీద.

" ఛీ ! ఛీ ! " అనుకొని మరో రెండడుగులు ముందుకు వేశాం. పెంకుటిల్లు కనుపించింది. బోర్డు లేదు ! కనీసం ఒక ' రూము ' దొరక్క పోతుందా? అనుకొని లోపలికెళ్లాం.

మా బ్రహ్మానందమే పిలిచాడు : " ఏమండోయ్! ఏమండోయ్ ". మా వాడి కేక విని లోపలి నుంచి ఎవరో వచ్చారు. మనిషి బాగా బొద్దుగా వున్నాడు— నడికారు మనిషి. " అయ్యా ! ఇక్కడ రూములేమైనా వున్నాయా ? " నేనే అడిగా మెల్లిగా.

" రూము కావాలా ? ఏవూరు మంది ?" ఆయనడిగాడు.

ఫలానా అని చెప్పాం.

"ఏం చేస్తున్నారు ?"

"ఫలానా ఉద్యోగం" అని చెప్పాం.

"పెళ్లి, గిళ్లి అయిందా."

"అబ్బే ! పెళ్లయితే రూ మేం ఖర్మ ! ఫేమిలీ పోర్షన్ తీసికొనే వాళ్లం గదండీ !" అన్నాం.

"అయితే లేవు పొండి ! ఎవరయ్యా మీరు? ఈ వూరికి కొత్తా, బాచిలర్స్ మా ఇంటి గడప తొక్కకూడదని తెలీదేంటి ? నడవండి ! నడవండి !"

ఆయన ఆజ్ఞ ప్రకారం, బయటికి నడవక తప్పలేదు. ఆయన మాటలు వినేసరికి బ్రహ్మానందానికి మూర్ఛ వచ్చినంత పనయింది.

"ఏమిట్రా ఈ ఖర్మ" అడిగాడు బ్రహ్మానందం.

"తప్పదు భాయ్ !" ఏదో సర్ది చెప్పాను.

మా సంభాషణను ఎవరో పుణ్యాత్ముడు రోడ్డు మీద నిలబడి విని, మమ్మల్ని పిలిచాడు :

"చూడండిసార్ ! రూములు కావాలా మీకు, ఇది కాక పై సందు తిరగండి. నాయుడుగారి యిల్లెక్కడా అనడగండి. వాళ్లింట్లో ఉన్నయ్ చాలా రూములు" అని చెప్పాడు.

వీడెవడో పాత కాలపు మనిషి కాబోలనుకున్నాం, ఆ ధర్మాత్ముణ్ణి చూపి ఒకటికి రెండుసార్లు నా

న్నారం పెట్టి, నాయుడుగారింటికోసం వెతుకుతూ బయల్దేరాం.

ఆ ఇల్లు తీరా, దానే వచ్చింది. వాకిట్లో సైన్ బోర్డు కూడా ఉంది. "ఫలానా నాయుడుగారు" అని. లోపలికెళ్ళాం. అడిగాం. 'నాయుడుగారున్నారా ?' అని.

ఎవరో అజాను బాహువు, 50 ఏళ్ళ వయస్సుగల వ్యక్తి, ఉక్కుపిండంలా ఉన్నాడు, బయటికొచ్చి "ఎవరయ్యా, మీరు?" అనడిగాడు.

బ్రహ్మానందం ఇలాంటి సమస్యను పరిష్కరించటంలో రాటు తేలిన వాడు. ఇంటి యజమానులతో ఎలా మాట్లాడాలో, రూం దొరక్క ముందు ఎలా వినయ విధేయతలతో ఉండాలో, దొరికింతర్వాత 'హక్కులు' ఎలాంటివో అతనికి బాగా తెలుసు! నిజం చెప్పాలంటే ఆ హక్కులను చెప్పబట్టేగా ఇప్పుడున్న చోట ఖాళీ చేయమన్నది!

అమాంతం నాయుడిగారి చేతులు పట్టుకున్నాడు బ్రహ్మానందం! "సార్, మీ బిడ్డలాంటి వాళ్ళం. మీరు తండ్రిలాంటి వాళ్ళు. మాలాంటి వారికి 'రూము' ఇచ్చి మీరు ఆదుకొంటుంటారని విని రెక్కలు గట్టుకొని వచ్చాం" అన్నాడు బ్రహ్మానందం.

నాయుడుగారు విస్తుపోయినా, చలించలేదు. ఆయనే చెప్పాడు అనునయంగా :

"బేష్ ! బుద్ధిమంతుల్లానే ఉన్నారు. కాని ప్రస్తుతం రూములేమీ లేవు. కాకపోతే 'రేకుల షెడ్డు' మాత్రం ఉంది. వానాకాలమేగా, రేకు అయితే ఏం, బంగారమయితేనేం ! మీ కభ్యంతరం లేకపోతే చూడొచ్చు" అన్నాడు.

రేకుల షెడ్డే అయినా, ఒక మోస్తరుగా ఉంది. నాయుడుగారు పూర్వాశ్రమంలో అక్కడ తన కారును ఉంచేవాడట. దాన్నే ప్రస్తుతం ఈ కుర్రకారు కోసం కేటాయించాడు.

"అయ్యా ! మరి, అద్దెమాట సెలవిచ్చారుకాదు!" అడుగులకు మడుగులొత్తాడు బ్రహ్మానందం.

"ఆ ! అదే చెప్పబోతున్నాను. ఇద్దరం ఉంటామన్నారుగా .... చూడబోతే బుద్ధిమంతుల్లా ఉన్నారు. మీకోసం కాబట్టి నలభై రూపాయలు నెలకు.... మొన్నటిదాకా ఏభై రూపాయలు వసూలు చేసేవాళ్ళం." అన్నా డాయన.

ఈ మహానగరపు వాతావరణాన్నిబట్టి చూస్తే, 'రూము' అనే పదార్థం దొరికినందుకే ఇవ్వొచ్చు నాలుగు నలభైలు అనిపించింది.

"మరి, తతిమ్మా రూల్సు చెప్పారుగాదు ?"

"రూల్సే అంటూ ఏమున్నాయ్. రాత్రి తొమ్మిది దాటాక బయటుగేటు తాళం వేస్తాం. నీళ్ళుతెచ్చే పని మనిషికి నెలకు, తలకు అయిదు రూపాయ లివ్వాలి? గదివూడ్చేవాడికి రెండురూపాయలు .... ప్రతి ఏడాదీ సున్నంఖర్చు ... అంతా మీదే .... ఎప్పుడు పడితే అప్పుడు వరండాలో నడవకూడదు. ప్రతి శని, ఆది వారాలు మా అల్లుడు ఇక్కడకే వస్తాడు. ఆయన ఈ ఇంట్లో ఉన్నప్పుడు మీ రిక్కడున్న చప్పుడే కాకూడదు. పాటలు పాడటం, ధూమపానం అలాంటివి పనికిరావు.... తెలిసిందేగా .... రెండు నెలల అద్దె అడ్వాన్సుగా ఇవ్వాలి?.... ఇంతే ...." అన్నా డాయన.

ఇది వినేసరికి నా మటుకు నాకు పై ప్రాణాలు పైనే పోయాయ్ ! బ్రహ్మానందం మాత్రం బ్రహ్మానందభరితుడైనట్లు కనుపించాడు. పైగా "నో. యస్. అలానే మాష్టారూ. రేపొద్దున్నే వర్షం రాకముందే వచ్చి చేరతాం. వస్తూనే రెండు నెల్లు కాదు, మూడు నెల్ల అద్దె మీ చేతిలో పెడతాం" అన్నాడు. వాడి మాటలు వినేసరికి నాకు భయం వేసింది నిజమేమోనని !

బయటికొచ్చాక అడిగాను "ఎందుకురా ఈ దిక్కుమాలిన గ్యారేజీలో"నని.

"నువ్వూ, నేను కాదుగదా ! కుక్కలు, నక్కలు కూడా ఉండవ్. ఇందులో" అన్నాడు బ్రహ్మం.

పైగా నాయుడుగారి దగ్గర మొహమాటంకోసం అలా అన్నాడట బ్రహ్మానందం. లేకపోతే చీవాట్లు తప్పవ్, ఆయన చేతిలో.

మళ్ళీ ప్రారంభించాం పాదయాత్ర. "ఇవాళ్టికి రూముకి పోదాం, ఆకలిగా ఉందిరా బ్రహ్మానందం?" అని ఎంత బ్రతిమలాడినా వాడు వినలేదు. 'రూము దొరకాలి, ఇంటి కెళ్ళాలి' అనే వాడి పంతం.

నడిచాం, నడిచాం మరో మైలు, "గది అద్దె కివ్వబడును" అనే మరో బోర్డు కనుపించింది. మళ్ళీ కథ ప్రారంభం; మళ్ళీ ఆశలు చిగురించాయి.

మా బ్రహ్మానందమే మొదలెట్టాడు. ఇంటి యజమానితో : 'అయ్యా, మీ పేరు ఒకటికి నాలుగుసార్లు వినివచ్చాం, తమరు దయామయులనీ— నోరు తెరిచి అడిగిన వాడికి, కాదనకుండా 'రూము' లిస్తారని విని వచ్చాం. ఇక మీ దయ. బుద్ధిమంతులం. మీరే చూస్తారుగా ?"

వోనరుగారు చిరునవ్వుతో సమాధానం చెప్పారు : 'సెహభాష్ ! మీలాంటివాళ్ళే నేటి భారతదేశానికి కావాలోయ్ ! మీక్కావలసింది రూమేగా ! రూమేం ఖర్మ 'రూం' ముందర వరండా కూడా మీకే ఇస్తాం. కాని, చిన్న సంగతి.... నాది స్వతహాగా పరోపకార బుద్ధి. నాయనా! నా ఇంట్లో ఉండే మీలాంటి వాళ్ళు కూడా అలానే ఉండాలని నా అభిప్రాయం."

"ఏమి అద్దెమాట చెప్పారుగాదు ?" మధ్యలో బ్రహ్మానందం గొణిగాడు.

మళ్ళీ ఆ ఇంటి యజమాని ప్రారంభించారు :

"అద్దెదేముందోయ్ ! చెరి పదిహేనివ్వండి. పోనీ, చెరీ పదివ్వండి. నే చెప్పానుగా కాస్త పరోపకారం చేసి పెట్టాలి .... ఏం లేదు, ప్రొద్దున్నే నిద్ర లేవాలి మీ పనన్నీ అయ్యాకలేండి .... మా ఆవిడ దగ్గర చిల్లర డబ్బులు తీసికొని మార్కెట్టుకెళ్ళి కూరగాయలు తెచ్చిపెట్టటం, ఆ తరువాత మా అమ్మాయిని (పెద్దమ్మాయిని కాదు, చిన్న పాపాయిని) ఎలిమెంటరీ స్కూల్లో దిగబెట్టటం చాలు. సాయంత్రం కొళాయి రాకపోతే, నూతిలో నీరు కాసినంటేకాసినే తోడిపెట్టాలి. ఇదంతా పరోపకారం ట్రైనింగోయ్! ఏం, ఎప్పుడు దిగుతారు రూములోకి ....?"

ఆ మాటలు వినేసరికి పరోపకారం సంగతి భగవంతు డెరుగు .... త్వరలో అక్కడినుంచి బయట పడకపోతే మాకే అపకారం అనిపించింది.

బ్రహ్మానందం మామూలు ధోరణిలో చెప్పాడు— "ఆహా ! దివ్యం ! దివ్యం ! ధన్యాత్ములు మీరు. ఇవ్వాళే రూములో చేరతాం. కాస్త చీకటిపడ్డాక అమ్మయి రాకముందే చేరుతాం" అని చెప్పేసి, 'అమ్మయ్య' అని బయటపడ్డాం ! బయటికి నడిచాక, అరగంట వరకు వచ్చేసరికి ఆకలి ఎక్కువయింది !

"ఒరే బ్రహ్మానందం ఆకలిరా ? ఆకలిరా ?" అన్నానేను.

"రూమురా ! రూము" అంటాడు వాడు.

రూము దొరకందే ఇంటికి వద్దంటాడు వాడు. ఇదీ సంగతి.

మళ్ళీ ప్రారంభించేం పాదయాత్ర, ఇంకా దొరక లేదు రూము. నా కాళ్ళు నడుస్తూ ఉన్నాయ్ ! బ్రహ్మానందం నోరు మాట్లాడుతూనే ఉన్నది.

(కల్పితం)★



# అజీర్ణము వల్ల ఎందుకు బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి

ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మంద కొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**




C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, 86/A నయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3

JWT/CJH/2821

# చేతిలో వెన్నముద్ద

బాలాఖానికి ఆనందం కూడా ఊళ్లో లేదు.

రేడియోకి స్విచ్ చేసి విశ్రాంతి తీసుకొంటూంది.

అప్పుడే భోజనం చేసి ఆరుబయట వెన్నెల్లో పడక కుర్చీలో పడుకున్నాను.

ఏం చేయటానికీ పాలుపోవటం లేదు.

నేను తీరుబడిగా కూర్చోటం కనిపెట్టింది గాబోలు మా చిన్న అమ్మాయి ఇందిర వచ్చి చంద మామ కేసి చూస్తూ నా ఒళ్లో పడకవేసింది.

రి వాళ్ల పిల్లలకయితే చదువు చెపుతారు గాని ఇంట్లో పిల్లల చదువు విషయమే పట్టించుకో రని, మా పెద్దవాడి అక్షరాభ్యాసం నాటినించీ కూడా నా మీద కారాలు మిరియాలు నూరటం మా శ్రీమతికి అలవాటయింది.

శ్రీమతిని సంతృప్తి పరిచినట్టుగానూ ఉం టుంది. కాలక్షేపమూ అవుతుందని ఒక సాహస కార్యానికి పూనుకున్నాను. అదే మా అమ్మాయికి పద్యం చెప్పటానికి ప్రయత్నించటం.

మా నాన్నగారు చిన్నప్పుడు నాకు ఆ పద్యం చెప్పేరు. మా తాతగారు కూడా మా నాన్నగారికి ఈ పద్యం చెప్పేరట చిన్నతనంలో.

క్లాసులో పాఠం చెప్పటమనేది ఈ రోజులలో చాలా గడ్డుపని. విద్యార్థులకి ఎన్నెన్నో సందేహాలు వస్తూ ఉంటాయి. వీటిలో చాలా భాగం పాఠ్య భాగానికి సంబంధించనివి అవటం గొప్ప విశేషం.

మా చిన్న అమ్మాయికి పద్యం చెప్పటంలో ఈ బాధలు ఉండవనే ధీమాతో ''తల్లీ, పద్యం చెప్పుకుంటావా ?'' అన్నాను.

ఏ కళన ఉందో, ''చెప్పు నాన్నా,'' అంది.

ఆమె సంబోధనలలో ఏకవచన ప్రయోగాలు కృత పద్ధతిలో ఉండవు.

సరే ఉపక్రమించాను.

''చేతులో అను అమ్మా'' అన్నాను. ఆమె అలాగే పలికింది.

''వెన్నముద్ద,'' అనమన్నాను.

''ఛీ ! వెన్నముద్ద ఏమిటి ? పెరుగుముద్ద అనాలిగాని అమ్మనాకు చేతులో వెన్నముద్ద పెడు తుందేమిటి— పెరుగుముద్ద పెడుతుంది గాని—'' అడుగులోనే హంసపాదు.

''కాదమ్మా, ఈ పద్యం రాసిన ఆయన వెన్న ముద్ద అనే రాశాడు. అందుచేత వెన్నముద్ద అనే చెప్పుకోవాలి తల్లీ,'' అన్నాను. నా సలహా పాటించ బడింది.

''చెంగల్వ'' అనమన్నాను. ''చెంగల్వ అంటే ఏమిటి నాన్నగారూ ?'' అంది.

''నాకూ తెలియదు. కలువలు అంటే మా ఊళ్లో చెరువులో చూశాను గాని చెంగల్వ లంటే ఎలా ఉంటాయో మరి. అవి ఒకరకం పువ్వులే అమ్మా !'' అని దాటేశాను.

పూదండ— చెప్పి అనిపించాను.

ప్రారంభించిన వేళా విశేషం మంచిదని ఆనం దించాను.

''బంగారు''— మా అమ్మాయికి 'ర' పలకదని ప్రాజ్ఞులు గ్రహించే ఉంటారు. 'బంగాడు' అంది.

గతంలో నేను అంత శ్రమ తీసుకోలేదు 'ర', 'డ'ల రగడను గురించి నాన్నగాడూ, ఒడేయ్ అనే సంబోధనలు నాకు చిర పరిచితాలే.

'ర' పలికించకపోతే ఇంక 'డ' అనే అలవాటు అవుతుందేమోనని, కొంచెం శ్రమ పడదామను కున్నాను.

'నీరు' అనమన్నాను. 'నీడు' అంది.

ద్విత్వాక్షరమైతే ఎలా పలుకుతుందో తెలుసు కుందామని 'క్ర' అనమన్నాను. సరిగానే పలికింది.

ధైర్యం కలిగింది. 'వారు' అనమన్నాను 'ర' వత్తి పలుకుతూ, 'వాడు' అంది స్పష్టంగా.

యస్.కె.యస్. రామానుజాచారి

పరాజయాన్ని ఒప్పుకుని పద్యం కొనసాగిం చాను. 'మొలతాడు' అన్నాను. ''ఇదిగో నా మొల తాడు— ఉంది'' అని తన మొలతాడు చూపించింది.

'మొలతాడు' అను అమ్మా అన్నాను.

''నీ మొలతాడు ఏది నాన్నా, ఉందా ?''— ఎదురు ప్రశ్న.

''ఉంది గాని పద్యం చెప్పుకో తల్లీ— 'మొల తాడు' అనుతల్లీ !'' అన్నాను.

''చిన్నన్న మొలతాడు తెంపేసుకున్నాడు నాన్న గారూ— నీళ్లు పోసుకొన్నప్పుడు వాడిని అమ్మ కొట్ట ింది కూడాను. నేను చూడు నాన్నా— మొలతాడు పాడేసుకున్నానా— వాడు మంచివాడు కాడు— కాదూ'' అంది.

నాలో సహనశక్తి కొంచెం సన్నగిలింది. కొంచెం గట్టిగా 'మొలతాడు'' అను ! అన్నాను. ఇంకా ఎంత పద్యం ఉందో అని లోపల లోపల చదువుకుని పరుగు పందెంలో పాల్గొన్నవాడు ఆయాసం వచ్చాక గమ్యస్థానం ఇంకా ఎంతదూరం ఉందో అని చూసినట్లు.

నిరుత్సాహమే కలిగింది.

'మానవుడు ఏ పరిస్థితిలోనూ ఓర్పును కోల్పో రాదు' అనేది ప్రధానమైన నీతిసూత్రాలలో ఒకటి.

నెమ్మదిగా వినయం ఉట్టిపడే స్వరంతో ''బంగారు మొలతాడు'' చెప్పు తల్లీ అన్నాను.

''నీకసలు అసలు మొలతాడే లేదు నాన్నా''— సుపుత్రి ఉవాచ.

మొలతాడు గాథ అదేదో ఊరి పెంతాడు వ్యవహారం కింద మారుతూంది.

తమాయించుకుని ''గబగబ పద్యం చెప్పుకో అమ్మా— నిద్రపోదువుగాని — 'పట్టుదట్టి' '' అనమన్నాను.— మొలతాడు అని అన్నట్టే భావించు కుని.

ఇలాటి చిత్ర విచిత్ర భావనలు ఉపాధ్యాయ వృత్తిలో తప్పవు మరి.

మాకో మేష్టరుగారు ఉండేవారు. పాఠం చెప్పి ప్రశ్నలు అడిగినప్పుడు ఏ ప్రశ్నకైనా నలుగురు అయిదుగురు చెరిగిలవాళ్లు సరైన జవాబు చెప్పలేకపోతే ఆయన ఒక తమాషా చేసే వారు. ఎక్కడో వెనకాల బల్లమీద నించి బితుకు బితుకుమంటూ చూస్తున్న కుర్రవాణ్ణి జవాబు చెప్పమనే వారు. వాడు ఏదో గొణిగేవాడు. వెంటనే ఆయన ''శెభాషు. మీరు చెప్పలేక పోయారు. అతను చెప్పేడు చూడండి'' అని ఆయనే గట్టిగా సరైన జవాబు చెప్పేసి ఇంకో విద్యార్థి చేత చెప్పించేవారు. కాని ఈ అస్త్రం చాలా అరుదుగా ప్రయోగించేవారు.

''పట్టు దట్టి'' అని మళ్లీ ప్రారంభించేసరికి ఇందిరా ప్రియదర్శిని బుసలు కొడుతూ నిద్ర పోతూంది.

పాపవాళ్ల అమ్మ పక్కమీదకి— పట్టుదట్టి చిన్ని కృష్ణమ్మ దగ్గరకూ— పద్యగాథ పత్రికకీ. ★





# మతి

ఆనాడాదివారం మేటనీకి బయల్దేరిన లక్ష్మి రాధ, సీత ఏడుపు మొహాలతో తిరిగివచ్చారు. అల్లిబిల్లిగా అల్లుకుపోయిన లతలాగ లెఖ్ఖలేనన్ని వంకరలు తిరిగి, భూమధ్య రేఖకన్నా పొడుగాటి క్యూవలన లాభంలేక పోయింది. ఆఖరుకు ఏతరగతి టిక్కెట్టయినా ఎంతకైనా సరే కొనేయడానికి తెగించారు.

దొరికి చావందే! తలుపు తాళంతీసి ముగ్గురూ మూడు మంచాలమీద వేరబడిపోయారు. టైము పదైంది.

ఉన్నట్టుండి........ 'ఒరే నేనలాగ మా అక్క దగ్గరకెళ్లొస్తాను అరగంటలో. ఉండండిక్కడే' అనేసి సీతశాల్తీ బయటకు నడచింది.

'రాధా ! ఇంతకన్నా అన్యాయంలేదు. మూడు రోజులనుండి చూస్తున్నాను. ఎక్కడికెళ్లినా శనిగాడు హాజరు. నిన్నచూడు అనవసరంగా ఫిజిక్సు లెక్చరరుచేత పడచివాట్లు తినేశాను. ఛీ....ఛీ..'

'ఐనా మరీ అంత మరుపేమిటి లక్ష్మీ? ఇన్నాళ్ళు గోలపెట్టి మొన్నంత సివియరు వార్నింగిచ్చారు ఇంతాచేసి ఇంట్లో మర్చిపోతే.......'

'మర్చిపోయాను మొర్రో! అని చచ్చి గీపెట్టినా నమ్మి చావకపోతే ఎలా అఘోరించడం? వెధవది ఛీ...ఈ వేళ చూడు! వేలు లక్షలమందికి టిక్కెట్లు దొరికాయి. మనకిమాత్రం దొరికి చావలేదు. ఛీ.....ఛీ.....'' అని కోపంగా ఝాడించిన చేతినుండి అప్పుడే విప్పిన జోళ్లు గది మూలలకు గిరవాటు పడ్డాయి.

స్టౌ ముట్టించి ఇంత టీ చేసుకు తాగారు. ఐనా చిరాకు తగ్గలేదు.

'లక్ష్మీ, నిజంగా ఈవేళ సాయంకాలమైనా మేటనీకి వెళ్లే యోగ్యత లేదా అని !'

'యోగ్యత ! ఇప్పుడెళ్లి పడిపోను ! మొట్ట మొదటి టిక్కెట్లు నువదేననుకో.'

'నీకు కొంచెమైనా బుర్రలేదు సుమీ ! ఆడాళ్లకు బుర్రలుండవు అన్నది సామెత ! ఎడ్వాన్సు బుకింగైపోయిందిగదా !'

'ఆ సామెత నాకుగాదు. ఇటునుండటు. నీకు వర్తిస్తుంది. పన్నెండు గంటలకెళ్లి క్యూలో రాస్తే దొరక్కెక్కడికెళ్తుంది?'

ఇంతలో సీతకూడ రాగానే ముగ్గురు అదే విషయం తీవ్రంగా చర్చించేశారు. ఆఖరుకు ఖచ్చితంగా నిర్ణయించేసుకున్నారు. అటు సూర్యుడిటు పొడిచినా మధ్యాహ్నం మేటనీ తప్పడానికి వీలులేదు. భోజనాలయాయి. టైము పన్నెండైంది. ముగ్గురు బయల్దేరుతున్నారు.

'ఖైం........'మని సీతవేసిన కేకకు లక్ష్మీ రాధా హడలిపోయారు. పరుగెత్తారు. ఏక హడావుడిగా సీత పుస్తకాలన్నీ కలగాపులగం చేయడం కన్పించింది. చివరకు తేలిన విషయమేమిటంటే మూడు రూపాయిల కాగితం కిమన్నాస్తి ! కన్పించలేదు.

'అసలెక్కడ పెట్టావు?'

'ఇక్కడే పుస్తకంలో పెట్టేను. 'బేరల్లో శవం' అన్న డిటెక్టివ్ పుస్తకంలో పెట్టాను. మీరు గాని చూశారా?'

'నిన్న లక్ష్మి తీసుకెళ్తున్నట్లుంది కాలేజికి'

'చఛ........నాకు తెలీదే నేను తీసుకెళ్లలేదు' లక్ష్మి గాభరా వర్ణనాతీతం. ఆ ముఖం చూచి తీరవలసిందే నిజంగా.

'నీ తలకాయ కాదు ! నిన్న థర్డవరు లీజరులో

'ఫల్గుణ'

నువ్వు చదువుతున్నాను నేను చూశాను. సరిగా జ్ఞాపకం తెచ్చుకో. నీ వెధవ మతిమరుపు నువ్వూను' అని రాధ అనేసరికి లక్ష్మికి ఉన్న మతి కాస్తాపోయింది. అయోమయం ! గాభరా ! హడావుడి !

కాస్త తేరుకుని 'యస్ ఎగ్జాక్ట్లీ...అవున్నిజంగా ! అవును...... అది శేఖరుగారు పట్టుకెళ్లారు..... ఏమండీ చదివిచ్చేస్తానంటే అలాగేననవలసి వచ్చింది మరి'.

పీత శరీరం శీతలం క్రమ్మి నిర్జీవంగా చేరబడ గానే రాధ లక్ష్మి గాభరా ఎత్తిపోయారు.

'ఏడవలేక పోయావు. నడు అతనింటికి వెళ్దాం. సీతా ఉండు క్షణంలో వస్తాం. ఇద్దరమూను.'

రాధా లక్ష్మి శేఖరు ఇంటిదగ్గర రిక్షా దిగారు.

'శేఖరుగారూ......శేఖరుగారూ....' అని ఆతృతగా పిల్చారు. అతని తమ్ముడు బయటకు వచ్చాడు. 'అన్నయ్య ఇంట్లోలేడు చంద్రంగారింటికికెళ్లాడు.' అన్నాడు.

'లక్ష్మి కొంప మునిగింది. ఇపుడెలాగ? ఏం చేయడం?'

'అదే తోచడంలేదు......గాని రాధా ఒకపనిచేస్తే? ఆ పుస్తకం ఇచ్చేయమని ఈ అబ్బాయి నడుగుదాం. ఏమంటావు?'

'లక్ష్మి ఉండుండి నీ బుర్ర బ్రహ్మాండంగా పనిచేస్తుంటుంది సుమీ.....! చూడు బాబు మీ అన్నయ్య పుస్తకాల్లో.....'

'బీరువా తాళం వేసుకుని వెళ్లిపోతాడండీ అన్నయ్య. లాభంలేదు.'

'ఐతే రాధా ఇపుడేం చేద్దామంటావు?'

'ఒకర్నొకరు పట్టుకుని ఏడుద్దాం మొర్రో మంటూ ! నడు చంద్రంగారింటికెళ్దాం. అంత కన్నా చేసేదేముంది గనక !'

'నీకు తెలుసునా ఇల్లు ! అతనిల్లు నాకు తెలీదు'

'నీకింకేం ఏదైనా తెలిసి చచ్చిందేమిటి?'

ఇద్దరూ అదే రిక్షా ఎక్కారు. రిక్షా గాలిలో పోతుంది.

'అవును నువ్వు తీసుకెళ్లావే అనుకో ! అతని కెందుకివ్వాలి?'

'అదికాదు రాధా ! అసలేం జరిగిందంటే.....! నేను లైబ్రరీకెళ్లి అక్కడ మర్చిపోయాను. వచ్చేస్తుంటే శేఖరే పిల్చి, ఏమండీ మరీ పుస్తకం మర్చిపోయారు. నేను చదివి మీకిచ్చేస్తానండీ అన్నారు. సరే అనక ఏంచేయడం చెప్పు !'

'ఉద్ధరించావు..........'

రిక్షా ఆగగానే పిల్చి అడిగారు. శేఖరం చంద్రం కలిసి భాను ఇంటికి పది నిమిషాల క్రిందట వెళ్లారని చెప్పారు.

ఇద్దరకు ఒక విధమైన ఆయాసం అంకురించింది. గాని చేయగల్గిందిలేదు. తప్పదు. అదే రిక్షా మళ్లీ బయల్దేరింది.

'భానుమూర్తిగారూ........' అని పిల్చారు.

'ఏం........? ఏమిటీ కొంప మునిగిపోయింది?' అని అతని నాన్నగారు తీవ్రంగా తలుపు తీశారు. ఏరినిచూసి 'మీరూ ఉన్నారూ? అంతేనా ఇంకెవరైనా ఉన్నారా? మీకు చదువులేమిటి వాళ్ల శ్రాద్ధం! పెద్ద గాడిదల్లాగ ఒకరి వెనకొకరు తిరగడంలో సరి. పొండి.........'

స్థాణువుల్లాగ స్తంభించిపోయారిద్దరూ. ఒకరి నోట మాటరాలేదు. అతను దభాలున వేసేయడానికి సిద్ధంగా ఉన్నారు.

'అది కాదండి ప్లీజ్ అతనితో శేఖరంగారు....'

'శేఖరం శంకరగిరి మన్యాలో అఘోరించాడు. మీకు సిగ్గు అంటూ తగలడ్డాయా? ఈపాటి దానికి చదువులు వెలగబెడదామని ఏడవడం ఎందుకు ఒకడి తర్వాత ఒకడు. వాడి తర్వాత ఇంకొకడు. ఆఖరుకు వీళ్లుకూడా తయారు. ఇదంతా సబ్జక్టులు, పార్టులు కదూ !'

'వాళ్లెక్కడికెళ్లారండీ........?' మాట రాధ గొంతులోనే పూడుకు పోయింది.

'ఎక్కడికెళ్తారు ! పెద్ద ఏమీ ఎరుగని నంగనాచుల్లాగడుగుతున్నారు. మీరందరూ కలిసి వేసుకున్న ప్రోగ్రామేకదూ ! మీకు చదువులెందుకు? చదువంటే ఇంటరెస్టు మీలో ఒక్కరికుందీ? అబ్బే...... ! ఎంతసేపు సినిమాలే ! ఆ హాల్లో కాలేజీలు, లేబరేటరీలూను. అసలు మీరందరిలాగే అఘోరిస్తున్నారంటే ఆ తప్పు మీది కాదు. నిజానికి తప్పు మాది. మీ క్రింద అనవసరంగా డబ్బు తగలేస్తున్నాం. మీరేమో సినిమాలకెళ్తారు. ఏమిటంటే కొంప మునిగిపోయింది? వెధవ సినిమా చూసేయ్యాలి. ఏమిటా వల్లకాడు హాలు ! అలంకారట........'

అంతే !.......ఇద్దరూ రిక్షాలో కెగిరిపోయారు. ఇదంతా చూస్తున్న రిక్షావాడు రాకెట్టయిపోయాడు. బిగబట్టిన వూపిరి వదలడం మర్చిపోయారు ముగ్గురికి ముగ్గురూ.

'రాధా నా గుండె దడ ఇంకా తగ్గలేదు'.

'లక్ష్మి అవంతే ! అసలటువంటి వాళ్లతో మనలాంటివాళ్లు మాట్లాడ్డం బుద్ధితక్కువ. ఏంచేస్తాం? ఎలకపిల్లల్లాగ దొరికిపోయాం.'

'ఇంతకూ అడిగినదానికి సమాధానం చెప్పారే గాదు.'

'చెప్పారు. అడిగింది వదిలేసి, అఖ్కర్లేనివి లక్ష శతకాలు చదువుతారు. అందుకే మనకు కావలసింది దొర్కుతుందా అని చూస్తున్నాను. సినిమాకనగానే హమ్మయ్య బ్రతుకున్నాను. గాని ఏ హాలో పేరు చెప్పన్దే ఒకంతట !' ఇద్దరూ నవ్వేశారు.

'ఒకటా రెండా ! ఎన్ని హాల్లు వెతుకుతాం?'

'అలంకారన్న ముక్కరాగానే ఎగిరిపోయాం. కాని లక్ష్మి! వస్తామనికూడా అనలేదు.'

'ఇంకేమంటాం ! హాముఖం ! ఇదుగో అలంకారు.'

రిక్షావాడి మండమని వెతికారు. రష్ మహా దొమ్మీగా ఉంది. ఎక్కడా కనిపించలేదు. హాలు లోపలకూడా చూచారు. లేరు. అంతా గాలించేస్తున్నారు.

కేంటీను దగ్గర దూరంగా చంద్రం కనిపించాడు. హమ్మయ్య ! ప్రాణాలు లేచివచ్చాయి. గబగబా వెళ్లారు. చంద్రం భాను కాఫీ త్రాగుతున్నారు.

'ఏమండీ శేఖరుగారెక్కడ?'

'అదేం శేఖరండీ వెధవ......సన్యాసో ఏడవాలో తెలియదు!'

'ఏమండీ ఏంవచ్చింది? ఏమైతేనేం?, రాధ గొంతులో ఆతృత ధ్వనిస్తుంది. కాని భాను గమనించే స్థితిలో లేడు.

'ఏడీ?..... అసలీ ప్రోగ్రాం వేసింది వాడూ టిక్కట్లు ఎడ్వాన్సు వాడే తీసుకున్నాడు. మా అందరి అందర్నీ లెగ్గొట్టాడు. ఇక్కడికి వచ్చాం. తిన్నగా హాలులోనికి పోయి కూర్చున్నా బాగుండిపోను. కాకరకాయలాగ ఈ చంద్రంగాడొకడు. కాఫీ గత్రాణి ! కాఫీ త్రాగుదాం అన్నాడు, పానకంలో పుడకలాగ ! వచ్చామండీ ఇక్కడికి. అంతే ! ఫినిష్ !'

'అంటే......?' రాధకు తలాతోకా అందలేదు.

'అంటే ! అంటే ఇంకేముంది ! ఒక రిక్షా ఇలా వెళ్తుంది. అందులో వాళ్లెవరో సామానుల్తో బండికో బస్సుకో పోతున్నారు. చూశారండీ.'

'వాళ్లతో వెళ్లిపోయారా........?' చటుక్కున రాధ అనేసరికి ఫక్కాలున నవ్వారంతా.

'అబ్బే !.......వాళ్లతో వెళ్లిపోయినా కొంత బాగుండిపోను. గాని, వాళ్లెవరో !...... కాని విశేషం ఏమిటంటే, వీళ్ల పిన్నిని ఒకావిడని ఇంటెక్కించి వాళ్ల చిన్నాన్న వైరిచ్చాడట స్టేషనుకు తప్పకుండా వచ్చి తీసుకువెళ్లమని. ఆ వైరు ప్రొద్దున్నే అందింది. మనవాడికి జ్ఞాపకమే లేదు. ఆ రిక్షా సామాను చూసేసరికి ఇంకేముంది.! మనవాడికి బ్రహ్మజ్ఞానం కలిగింది. స్టేషనుకు పరిగెత్తాడిప్పుడే. బస్సులో....... టిక్కట్లు అనవసరంగా పోతుందండీ. కాని మీరిద్దరు......'

'లాభం లేదండీ. శేఖరుగారి నర్జంటుగా కలుసుకోవాలి. వస్తామండి. రా లక్ష్మీ......' రిక్షా స్టేషను వైపు బయల్దేరింది.

'రాధా ! తండ్రికి సరిగా సరిపోయే కొడుకు.'

'ఈ నానుడికి కోపంకూడా తయారైతే ఆ ఖిల బ్రహ్మాండం' రిక్షావాడితో సహా నవ్వేశారు.

'గాని రాధా టిక్కెట్టు ఒక్కటేవుంది. బినా ఒకటిలే. ఈ పరిస్థితిలో మూడు టిక్కెట్లున్నా వెళ్లలేం. మొత్తంమీద సినిమా లేనట్టే.'

''సరిపోయింది ఊరంతా కరిపోయిందనిడిస్తే నటా !........'

స్టేషనులో అంతా వెతికారు. ప్లాటుఫారం వెయిటింగు రూము, బుక్‌స్టాలు, టీ స్టాలు, ఎక్కడా కనిపించలేదు. భాను తండ్రిగారి కేకలకు వదిలిపోయిన నీరసం మళ్లీ తలెత్తుతుంది. ఐనా తప్పదు ! అన్న క్లాజు ఎప్పుడూ ఉండనే ఉంది.

ఆఖరుకు ప్లాటుఫారం చివర సిమ్మెంటు బెంచీ మీద శేఖరు శాస్త్రి కనబడింది. ప్రాణాలు కుదుటపడ్డాయి. హమ్మయ్య ! మనిషి దొరికాడు.

'హల్లో శేఖరుగారూ నమస్తే. నిన్న మీకిచ్చిన పీపాలో శవం అన్న పుస్తకం......' అని లక్ష్మి గాభరాగా అంటుండగానే.

'మీరిచ్చింది బేగ్‌లో శవం అండీ !' ముగ్గురూ నవ్వేశారు.

'ఆ పుస్తకం కాస్త అర్జెంటుగా కావాలి. దానిలో ఒక ముఖ్యమైన విషయం ఉంది.'

'అహా.....నేను చదివేశాను. ఇందాక ఇచ్చేద్దామనే అనుకున్నాను. పరేలెండి సాయంకాలం మీ రూముకే తెచ్చిచ్చేస్తాను. ఐయాం వెరీసారీ'

'అది కాదండీ శ్రమనుకోకుండా మీరిప్పుడొకసారి...'

'అంతర్జెంటా ! పోతే ఎలాగ? బండి ఒకరగంటలో వచ్చేస్తుంది. నేను రావడంకాదు ముఖ్యం. అసలిచ్చేద్దామనుకుంటుంటే భాస్కరం తీసుకున్నాడు'.

ఇద్దరికిద్దరూ నీరు కారిపోయారు.

'ఒక పని చేయండి ప్లీజ్. మరొకలా భావించక భాస్కరం ఇపుడింట్లోనే ఉంటాడు. వాడి నడిగండిచ్చేస్తాడు.'

'సరే వెళ్తామండీ' అనేసి బయల్దేరారు. అతని ముఖ కవళికలలో విశేషమేమీ కన్పించలేదు. గాని విషయం ఫలానా అని చెప్పటానికి వీలులేదు.

అతనికూడా ఏమీ అనలేదు. సరేనని ధైర్యం వహించాక తప్పలేదు. భాస్కరం మళువుగానే దొరికాడు. పుస్తకం ఇచ్చేశాడు. రాధ అబ్జర్వేషనుకు అతని ముఖంలో గూడ ఏమీ కన్పించలేదు.

రిక్షావాడికి మొత్తంగా డబ్బులిచ్చి పంపించేశారు.

పుస్తకాన్ని చూడగానే సీతకు ప్రాణం లేచి వచ్చింది. హమ్మయ్య.....! అనడం, లక్ష్మి కుర్చీలో చేరబడడం ఒక్కసారే జరిగాయి. రాధచేతిలో పుస్తకాన్ని లాక్కుని అట్ట విప్పేసి చూడడానికి సీతకు క్షణం పట్టలేదు.

గాని నూరు రూపాయలు కాయితం లేదు.

'రాధా కొంప మునిగిపోయింది. టర్మ్ ఫీజుకని నాన్నగారు ఇన్సూరు చేసినదా డబ్బు. ఇది చదుతూ ఇందులో పెట్టేశాను.'

'నిన్న పెట్టి ఈ వేళ జ్ఞాపకం తెచ్చుకుంటావా. డబ్బు దగ్గర అంత అజాగ్రత్తేమి?'

'అజాగ్రత్త కాదు రాధా. ఈ డిటెక్టివ్ పుస్త అలాంటిది. నాకు తెల్సు.'

'అందుకే జాగ్రత్తగా అట్టలో పెట్టేను దేనికైనా మంచిదని.'

'ఐనా శేఖరం, భాస్కరం తీశారనుకోను.'

'బయటకు కనిపించదుకదూ ! ఇప్పుడెలాగ?'

'ఏమి సీతా ఎక్కడ పెట్టేవు?' లక్ష్మి కంఠం విన్పించింది.

'ఇదే లక్ష్మి ఈ అట్టలో పెట్టేను.'

ఆ అట్ట తీసేయగానే ఒక పెద్ద ఆయిలు పేరలు. అందులో రంగు రంగులతో శవం. ఆ ప్రక్కన ఒక ఆడమనిషి మొహం, పెద్ద కేక పెట్టినట్టుగా ఉంది. అదంతా చూడగానే లక్ష్మికి జ్ఞాపకం వచ్చింది.

'కరెక్టు.......బాగా జ్ఞాపకం వచ్చింది. ఐతే సీతా డబ్బు అజాగ్రత్తగానా పెట్టుకుంటావ్? తిరిగి తిరిగి నా అవస్థపడి వచ్చాం అనవసరంగా. ముందుగా చెప్పుకోవు ఆ విషయం? అది నా జేబులోనే ఉంది.' అని షర్టు జేబులో పోస్టుకార్డు మధ్యగా మడచిన కాగితం తీశాడు లక్ష్మీపతి.

'హమ్మయ్య !...... లేదనగానే గుండె ఆగి పోయింది' అన్నాడు సీతారామశాస్త్రి.

'వెధవా నీకు మతీ సుతీ బుద్ధీ : జ్ఞానం, ఏమైనా ఏడ్చి చచ్చి అఘోరించి తగలడ్డాయిరా? రాస్కెల్ ! మట్టిబుర్ర వెధవా !' అన్నాడు రాధా మాధవశర్మ.

'అవును లక్ష్మి అదేమి? జేబులో ఉంచుకుని పూరంతా తిరిగి వచ్చావు అనవసరంగా ! అందరికీ గాభరా ఎత్తించేశావు.' అన్నాడు సీత.

'వెధవ వెధవ వెధవన్నర వెధవ, జడ్డి వెధవ. నీడి మతి మరుపుకు అందరికీ మతులు పోగొట్టేస్తు, చవట వెధవ !' అన్నాడు రాధ.

'అదికాదురా బాబూ ! చెప్పేది వినండి. నేనీ పుస్తకం లైబ్రరీలో చదువుతున్నాను. ఇంట్రెస్టుగా ఉంది. కవరుమీద బొమ్మ చూద్దామనిపించి అట్టతీశాను. ఇదీ కాగితం. నిజంగా సీతమీద బ్రహ్మాండమైన కోపం వచ్చేసింది. చెడామడా చివాట్లు పెట్టేద్దామనిపించింది.''.

'అప్పటికే లెక్చరరు చేత బాగా తినేసి ఉన్నాడు మరి'

'అదే అనుకో ! జేబులోనైతే జాగ్రత్త చేశాను. కాని పూర్తిగా చదివేసరికి బుర్ర వేడెక్కిపోయింది. అదీ జరిగిన సంగతి.'

'ఏడిశావ్ ! ఇకనైనా సరిగానుండు.'

ముగ్గురూ ఒక విధమైన బరువు తీరినట్లు వూపిరి పీల్చుకున్నారు. 



తప్పక చూడండి!

శ్రీవిఠల్ ప్రొడక్షన్స్‌వారి

రచన: G. కృష్ణమూర్తి B.A.

సంగీతం: రాజన్-నాగేంద్ర

కెమెరా: రవికాంత్

పాటలు: C. నారాయణరెడ్డి-G. కృష్ణమూర్తి

కోడైరెక్టర: S.D. లాల్

నిర్మాత: దర్శకుడు: విఠలాచార్య





తెనుగు తమిళ చిత్రాలలో పైపైకి వస్తోన్న రాజశ్రీ

# వర్ధమానతార రాజశ్రీ

వ్యాసం : సి. ధర్మారావు



రాజశ్రీ నాట్యాలు బాగా చేస్తుంది

**మ**ద్రాసు త్యాగరాయనగర్‌లోని విజయ రాఘవాచారి రోడ్డు మలుపులిరిగి, ఓ పది బారలు నడిస్తే, అందమైన ఓ భవనంలోంచి కనిపించే సుందరి, సౌందర్యానికే మారుపేరైన రాజశ్రీ. ఆ ఇంటి కిటికీలో నుండి మత్తుగా మెరిసే కళ్ళు, గులాబీలలా ఎర్రనైన చెక్కిళ్ళు, సంపెంగ రేకుకు ఎర్రరంగు వేసినట్లు కనిపించే పెదాలు రాజశ్రీవి. మరీ అంత పొడుగు, పొట్టి కాకుండా, పొంకంగా ఉండే అమ్మాయి, అందరికీ అందంగానే కనిపించి, ఆకర్షించే వయ్యారి ఆమె.

విన్న మొన్నటి వరకు మద్రాసు, త్యాగరాయ నగర్‌లోని కేసరి హైస్కూలులో చదివింది. నాటకాలలో రాధగా, కృష్ణుడుగా వేషాలు వేసింది. అబ్బాయిలంతా ఆ అమ్మాయిని రాధ అని, అమ్మాయిలంతా కృష్ణుడు అని ముద్దుచేసి, మురిపించుకునేవారు.

“కాదలిక్క నేరమిల్లై” తమిళ చిత్రంలో నాయికగా నటించి అగ్రశ్రేణి తారై పోయింది. ఇప్పుడింక చిన్న వేషాలకు తాను తగనని, అగ్రశ్రేణి జాబితాలోకి ఛెంగున గెంతింది. అందుకు పూవు పూత ఇచ్చింది “పెళ్ళికానుక” దర్శకుడు, “కాదలిక్క నేరమిల్లై” దర్శక— నిర్మాత అయిన శ్రీధర్.

రాజశ్రీ పుట్టింది విశాఖపట్నంలో. పసివయసులోనే మద్రాసు రావడంలో విశాఖపట్నం ఏ వైపు ఉన్నదో మరచి పోయింది. మద్రాసులోనే వయసు పరిమళించింది. అదృష్టం వరించింది. యువ్వనం గుబాళించి, గులాబి దండ అయింది. ఈ అమ్మాయి నాన్నగారు ఆ రోజులలో స్టేషన్ మాష్టర్. పేరు సత్యనారాయణగారు. ఈమెకు అక్షరాభ్యాసం కన్నా ముందుగానే నాట్యకళాభ్యాసం జరగడం విశేషం. అయిదో ఏటనే కాలికి గజ్జెకట్టి వై. కుమారి వద్ద అభ్యాసం ప్రారంభించి, అనతి కాలంలోనే అందాల నర్తకి కాగలిగింది.

కుమారిని చూస్తే సాకీ జ్ఞాపకం వస్తుంది. ఉమర్ ఖయ్యాం రుబాయీలు, పానపాత్ర ప్రణయిని కళ్ళముందు కనిపిస్తాయి. రాజశ్రీ మత్తుగా చూస్తుంది. ఆ కళ్ళలో తేనె సోనలున్నాయి. కమ్మగా నిండుగా నవ్వుతుంది. నవ్వినప్పుడు సొట్టలు వికసిస్తాయి. ఒడుపుగా నడుస్తుంది. నడుస్తుంటే రాయంచలే నడకలు నేర్చుకుంటాయి. మయూరిలా నాట్యం చేస్తుంటే ఆడవారికి అసూయ జనిస్తుంది.

రాజశ్రీ కొంతకాలం పాటు శ్రీ పి. వి. నరసింహారావు వద్ద నాట్యాభ్యాసం చేసింది. వారు భరణీలో ఉండి శ్రీమతి, భానుమతికి కొన్ని నాట్య శాస్త్రం మెళకువలు నేర్పుతున్న సమయంలో ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నది రాజశ్రీ.

తొలి చిత్రం ‘నాగదేవత’, ఏ. వి. యం. స్టూడియో వారు చిత్రపు నారాయణమూర్తి



అందం అవయవ సౌష్టవం యీ నటికి పెట్టని నగలు

దర్శకత్వంలో ఆ చిత్రాన్ని మూడు భాషల్లో నిర్మించారు. అంతవరకు సినిమాలు చూడటమే తప్ప, నటించే సరదాలేదు ఆమెకు. అప్పట్లో నాట్యం నేర్పుతున్న దండాయుధపాణిపిళ్లై ఈ అమ్మాయిని ఏ. వి. యం. చెట్టియార్‌కు పరిచయం చేయడం అమ్మాయిలో చలాకీతనం, ఉత్సాహం పసికట్టిన చెట్టిగారు బుక్ చేసుకోవడం జరిగాయి. ఆమె చెంపలు చిదిపితే పాలుగారేట్లు ఉండేవి. అప్పట్లో. ఇప్పటికీ అంతే. కళ్ళు చేపల్లా మిలమిల లాడాయి.

రోజా స్కూలుబెల్ కొట్టే సమయానికి స్టూడియో కారు ఎదురయ్యేది. సరాసరి స్టూడియోకి వెళ్లి నాట్యం, హిందీ, తమిళం నేర్చుకునేది. అయితే స్టూడియోలో మూడేండ్లు కాంట్రాక్టు వ్రాసుకోవడంతో మరి బయట చిత్రాలలో నటించే అవకాశం కలుగలేదు. ఈలోగా అమ్మాయిగారికి పెళ్లి చెయ్యాలనుకున్నారు. ఎలాగో పెళ్లి పేరు చెప్పి, స్టూడియో— అగ్రిమెంటు రద్దు చేయించుకున్నారు.

పెళ్లి చేసేసుకోవాలన్న మోజైతే ఉంది కాని. పెళ్లి ముహూర్తం కుదరలేదు. అబ్బాయి కుదరలేదు. ఈ లోగా చిత్తూరు నాగయ్యగారి "రామదాసు" ముహూర్తం రానే వచ్చింది. అందులో 'కమల' పాత్రకు రాజశ్రీని బుక్ చేసుకున్నారు. అప్పుడే వెండితెర పేరు "రాజశ్రీ" అయింది. పేరులోనే పెన్నిధి దొరికింది. టక—టక 'నిత్య కళ్యాణం— పచ్చతోరణం', 'ఆరాధన', 'స్వర్ణగౌరి', 'మదనకామరాజు కథ' మొదలగు చిత్రాలలో నటించే అవకాశం వచ్చింది.

శ్రీ ఆమంచర్ల శేషగిరిరావు, శ్రీ పి. మధుసూధనరావు, శ్రీ విఠలాచార్య వంటి మంచి దర్శకుల చేతుల్లో నటనలోని మెలకువలు తెలుసుకున్నది. శ్రీ యస్. భావనారాయణగారి 'నువ్వా— నేనా' చిత్రంలో దేవిక ప్రక్కన నటించి 'నువ్వా— నేనా' అనిపించుకుంది. 'గురువును మించిన శిష్యుడు, చిత్రంలో మంచి గ్లామర్‌గర్ల్ అయిపోయింది.

ఇటీవల 'కృష్ణకుచేల, దక్షయజ్ఞం, ఆశాజీవులు' ఒల్లిబిడ్డలు' చిత్రాలలో నటించింది.

'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలో స్వేచ్ఛగా తన ఇష్టం వచ్చినట్లు నటించానని, అందుకు యువదర్శకుడు శ్రీధర్‌కు కృతజ్ఞత చెబుతుంటుంది ఈ అమ్మాయి.

ఇప్పుడు తమిళచిత్రరంగంలో రాజశ్రీకి డిమాండ్ పెరిగి పోయింది. ఓ చిత్రంలో యస్. యస్. రాజేంద్రన్‌తోనూ, మరో చిత్రంలో ఎం. జి. రామచంద్రన్‌తోనూ నటిస్తుంది.

తెలుగు, తమిళ చిత్రాలలో సంతృప్తి చెంది కూర్చోవడం రాజశ్రీకి గిట్టలేదు. జైత్రయాత్ర ప్రారంభించింది. బొంబాయి చేరుకున్నది. ఫిల్మిస్థాన్ వారి 70వ చిత్రం 'పాయల్‌కె ఝంకార్' కిషోర్‌కుమార్‌తో నటిస్తుంది. గణేష్ పిక్చర్స్ వారి 'వీరఛత్రసాల్'లోనూ నటిస్తుంది.

ఇవి కాక రాజశ్రీ నటనకు గీటురాళ్లుగా పదునెనిమిది కన్నడ చిత్రాలున్నాయి. అందులో 'రత్నమంజరి' శతదినోత్సవాలు జరుపుకున్నది. నాలుగు మళయాళ చిత్రాలలో నటించింది. 'భార్య' అనే చిత్రంలో మంచి నటిగా పేరు సంపాదించుకుంది. మళయాళంలో రాజశ్రీ పేరు గ్రేసీ. భాష రాదు. బాపుంటుందో— లేదో అన్న బెంగతో

ఈ అమ్మాయికి కేరళ రాష్ట్రంలో ఇప్పుడు పెద్ద పేరు గ్లామర్‌గర్ల్. ఆమెను చూడగానే "గ్రేసీ— గ్రేసీ" అని ఎగబడతారు జనం. రాజశ్రీకి ప్రక్కనున్న పెంపుడు కుక్క కోపగించుకుంటుంది. దాని పేరు కూడ "గ్రేసీ"యే. మళయాళ నటనకి చిహ్నంగా రాజశ్రీ తన కుక్కకు ఆ పేరు పెట్టుకున్నది.

ఈ అమ్మాయి ధైర్యంగా గుర్రపు స్వారీ చేస్తుంది. ఈత తెలుసు. కారు డ్రైవింగ్ వచ్చు. నటనలో వలె, నీటిలోనూ లోతులు చూపిస్తుంది. కారమ్స్ ఛాంపియన్, అయితే సంగీతం రాదు. వచ్చని దర్పంపోదు. నిజం చెప్పడం రాజశ్రీలోని సుగుణాలలో ఒకటి. రహస్యం లేదు. మిత్రులంటే మగకాని, ఆడకాని సరదా. పత్రికల వారన్నా, రచయితలన్నా అమిత గౌరవం, అపారమైన ప్రేమ. మంచి మిత్రులతో కేరమ్స్ ఆడుతూ గంటల తరబడి కబుర్లు చెబుతుంది.

అయిదు భాషల్లో నటిస్తున్న రాజశ్రీకి విసుగు, చిరాకు లేదు. 'పంక్చ్యుయాలిటీ' ఆమె ప్రతి పనిలోనూ, షూటింగ్‌కు టైంకు వెళ్లాలన్న భయం, డైరక్టర్లు, ప్రొడ్యూసర్లు అంటే భయం, అణకువ, పోటి నటీనటులంటే ఆత్మీయతా, ఆప్యాయతా. ఈమె సరదాలకు పరదాలు లేవు. సభలన్నా, సమావేశాలన్నా హాజరవుతుంది. మద్రాసులో ఎక్కడ ఏ తెలుగువారి సమావేశం ఏమైనా కానీ హాజరవుతుంది.

రాజశ్రీ మొదటి నర్తకి. తర్వాత నటి. ఇప్పుడు రెండూ మిళితం చేసుకున్న అభినేత్రి. నటించడంలో చాలాకీతనం కన్నా, ఉత్తప్పుడు మరీ చలాకీగా, చిలిపిగా ఉంటుంది. అగ్రశ్రేణి నటి కావాలన్నది ఈ అమ్మాయికి ఒకే ఒక్క కోరిక. ఉన్నత పథాల విహరించి, ఉన్నత నటి కావాలి. 'రిజర్వేషన్స్' ఇంటా— బయటా, స్టూడియోలోనూ, తెరమీద, తెరవెనుక లేవు. ఏ పాత్రనైనా అర్థం చేసుకొని నటిస్తుంది. ఓర్పు— నేర్పు ఉన్నాయి.

రాజశ్రీని చూస్తే చాలమంది 'వాంప్' పాత్రలు ఇస్తారు. నిజానికి అవి ఆ అమ్మాయికి ఇష్టం లేదు. సరదాగా, జోవియల్‌గా ఉండే పాత్రలంటే, మక్కువ పడుతుంది. కాని నటి, ఏదైనా నటించగలగాలి.

రోజూ తీరిక చిక్కినప్పుడు మిత్రులు, అభిమానులు వ్రాసిన ఉత్తరాలు చదువుతుంది. సాధ్యమైనంతవరకు సమాధానాలు వ్రాస్తుంది.

రాజశ్రీని చూడగానే ఆమె సింప్లిసిటీకి ఆశ్చర్యం వేస్తుంది. పైగా నిగర్వి. గర్వంలేక పోవడం కన్నా, మిన్నగా చలాకీతనం ఉండడం, జీవించడం సుఖపడడానికే నన్న తత్వం, సుఖంగాజీవించడానికేనటన.

ఇప్పుడిప్పుడే అగ్రశ్రేణి తారల్లో చేరుతున్న వర్ధమాన సినిమా నటీమణులతో మకుటం

# బహు భర్తృకత

ఓ. రాజారావు; హా. రమాపతి

ఒకే స్త్రీకి ఒక భర్తకన్నా ఎక్కువ మంది ఉండటానికి భారత దేశంలో కొన్ని ప్రాంతాల ఆచారాలు అంగీకరించాయి. ప్రపంచంలో కొన్ని ప్రదేశాల వారు బహు భర్తృకతను స్వీకరించారు, కొందరు అమెరికన్ (రెడ్) ఇండియన్‌లు, ఎస్కిమోలు, 'సౌత్ సీ అయ్‌లెండ్' వాసులు కొంత మంది, మలయాద్వీప సముదాయంలో నివసించేవారు కొందరు, తూర్పు ఆఫ్రికాకి చెందిన 'హహూమా' తెగవారు, వీరుకాక మనదేశంలో కొన్ని ప్రాంతాల వారు ఈ ఆచారాన్ని అవలంబిస్తున్నారు. టిబెట్‌లో బహుభర్తృకత ఇంకా ఉంది. భారత దేశంలో ఇది ఎక్కువగా కాశ్మీర్ అస్సాంల మధ్యచోట్లలో కనిపిస్తూ ఉంటుంది. దక్షిణ భారత దేశంలోనేమో, తోడా, కోటా తెగల వారికి బహు భర్తృకత అలవాటు ఉందిట.

ఇండియా ఈశాన్య ప్రదేశాలలో— డెహ్రా డూన్ జిల్లాలో కొన్ని చోట్ల; సిమ్లా కొండ ప్రదేశాలలో, రవైన్ చుట్టుపక్కల— ఈ ఆచారం కల వారిలో చాలా మంది ఆర్య సంప్రదాయానికి లోనయిన బ్రాహ్మణులు, రాజపుట్‌లే. అందుచేత బహు భర్తృకత అనార్య సంప్రదాయం అని వాదించటానికి వీల్లేదు. అంతేకాక, ఈ అలవాటు కొన్ని వర్గాలలో ఇటీవలే నశించింది. మలబార్ ప్రాంతాలలో కొన్ని తెగలలో బహు భర్తృకత ఉండేదని చదువుతాము.

అయితే వివిధ ప్రాంతాలలో వివిధ విభిన్నాచారాలు ఉంటాయి. ఉత్తరాది వారిలో సాధారణంగా భర్తలు అన్నదమ్ములై ఉంటారు. ఈ ఆచారం అనుసరిస్తున్న దక్షిణాది వర్గాలలో భర్తలు సొంత అన్నదమ్ములై ఉండక్కరలేదుట.

జవున్సర్— బవార్ ప్రాంతానికి (డెహ్రాడూన్ జిల్లా) చెందిన ఖాసీలలో బహుభర్తృకత చాలా విరివిగా అనుసరించ బడుతున్నదిట. ఒక స్త్రీకి జన్మించిన బిడ్డలు వరసగా, వయస్సుని బట్టి మొదటి భర్త నుంచి చివరి భర్త దాకా వారి వారికి జన్మించినట్లు పరిగణిస్తారు.

అన్నదమ్ములలో ఎవరైనా మరొక స్త్రీని వివాహం చేసుకోవచ్చు. ఈ స్త్రీ కూడా అందరికీ భార్య కావచ్చు. కాని ఆస్తి పంపకాల విషయంలో ఎన్నో చిక్కులు వస్తాయి. అందుకని వారసత్వపు నియమాలు చాలా క్లిష్టంగా ఉంటాయి.

ఒక విచిత్రం ఏమిటంటే, బాగా ధనవంతమైన కుటుంబంలో ఒకడే మగపిల్లవాడు పుట్టిన పట్లయితే అతన్ని మాత్రం పెళ్లిచేసుకోవటానికి ఏ స్త్రీ సాధారణంగా ఇష్టపడదు. దీనికి కారణం ఈ ప్రాంతాలలో ఇంటి కోడలిని కేవలం పని మనిషి కింద చూడటమే— ఇంటి పనంతా ఈ స్త్రీయే చెయ్యవలసి వస్తుందని భయంట. ఇద్దరు ముగ్గురు అన్నదమ్ములన్నా ఉంటే, ఎక్కువ మంది భార్యలు వచ్చి ఆమె భారం తగ్గుతుంది.

ఈ ఆచారాలు స్త్రీల కొరత ఉన్న ప్రాంతాలలో పెరిగాయని వూహించటం కష్టం కాదు. అదీ కాక, ఇక్కడ ప్రజలు చాలా బీదగా ఉండటం చేత ఈ రకం సమిష్టి కుటుంబాలు సౌకర్యంగా ఉంటాయి.

బహుభర్తృకత అమలులో ఉన్న సమాజాలలో స్త్రీల సంతానాలు తక్కువగా ఉంటాయట. పుట్టిన పిల్లలలో కూడా మగ పిల్లలే ఎక్కువగా ఉంటారుట. ఈ సమాజాలలో విడాకులు కావాలన్నవారికి లభిస్తుంది. వరకట్నం ఇక్కడ వారిని కూడా బాధిస్తున్నదిట !

అయితే పాత ఆచారాలు క్రమంగా నశిస్తున్నాయి. ఈ ప్రాంతాలలో కొందరు ఆధునికులు వీటిని నిరసిస్తున్నారు. ★

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### అన్నా ! ఇది డబుల్ పన్నా

కళ్లుమూసుకు పాల్తాగుతున్న పిల్లి
కనుక్కోదు లోకం అనుకుందట తొల్లి
ఇసకలో తలదూర్చిన తన వాళ్లను వెదుకాడి
'ఏరీ వీళ్ళంతా!' అని అడిగిందో నిప్పుకోడి
ఎంత మారువేషం వేసుకున్నా ఏనుగు
ఎవడు గుర్తించడో వాడు మనిషికాడు పీనుగు
చచ్చినా బతికినా లక్ష చేసే గజం
తనంతట తగ్గలేదు ముమ్మాటికీ నిజం
బట్టల దుకాణంలో మాత్రం గజం
బయటకొచ్చి కొలిస్తే అరగజం.



# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఎల్లి లేబిలు

## త్రాగి జలుబును ఎదుర్కొండి



మామూలుదని భావించే జలుబు మీలోని రోగమును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుతుంది. దేహమును బలహీన పరచి రోగములు కలిగే అవకాశమును కలిగిస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్ యొక్క విశిష్టమైన త్రివిధ క్రియ ఉపశమనమును కలిగిస్తుంది, మళ్లీ సత్తువనిస్తుంది మరియు రోగనిరోధక శక్తిని హెచ్చుచేస్తుంది. దానిలోని ముఖ్యంగా పనిచేసే క్రియోసోట్ మరియు గయికోల్ జలుబునుండి ఉపశమనము కలిగించును; దానిలో చేరే ఇనుము యొక్క సత్తువ మరియు బలవర్ధక పదార్థములు, మాల్ట్ మరియు ప్లీహ సారములు ఆకలిని పుట్టించును. కోల్పోయిన శక్తిని భర్తీచేయును. రోగము మళ్లీ రాకుండా ఉండేలా రోగనిరోధక శక్తిని కలిగించును.

ఏ శీతోష్ణస్థితిలోనైనా రోగనిరోధక శక్తికి ఎల్లి లేబిల్ గల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి.

Waterbury's
Trade Mark
Compound
with
Creosote and Guaiacol
ALCOHOL CONTENT 9.5% V/V



వాటర్‌బరీస్ కాంపౌండ్‌లోగల క్రియోసోట్ మరియు గయికోల్ కఫమును విడదీసి ఉమ్మిలో పోయేలా చేయును మరియు కఫ్లటను అడ్డును. అవి ఊపిరితిత్తులను శుభ్రపరచును, దగ్గు, జలుబు, ఉబ్బసపు అసౌఖ్యము, శ్వాసనాళపు అస్వస్థతలను పోగొట్టుటలో సహకరించును మరియు రోగములు మళ్లీ రాకుండా చేయును.

# వాటర్‌బరీస్ కాంపౌండ్

దగ్గు, జలుబు, శ్వాసనాళపు అస్వస్థతలు, ఉబ్బసపు అసౌఖ్యములను నివారించుటకు శక్తిని కలిగించును.

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో సంస్థాపితము)

TWT-WL 2349

# నల్లధనం పచ్చబంగారం

# వెండితెర తారల తెరవెనుక కథ!!

గతవారం బొంబాయిలో సినిమాతారల ఇళ్లల్లో ముప్ఫయి లక్షలరూపాయిలకు పైగా కరెన్సీ, కొంత బంగారం, విదేశీ మద్యపు సీసాలు, కొంత విదేశీ కరెన్సీ దొరికాయన్న వార్త ఆశ్చర్యం కాకపోవచ్చును. కాని, ప్రభుత్వం సినిమాతారల ఇళ్లమీద దాడి జరిపి తొలిసారిగా ఇంత ధనాన్ని చేజిక్కించుకోవటం మాత్రం తప్పకుండా అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తివేసింది.

ఇండియాలో సినిమా పరిశ్రమ బాగా పాతుకపోయిఉన్న మూడు ప్రధాన నగరాలలో బొంబాయి కూడా ఒకటి. పైగా, ఈ నగరం హిందీ చలనచిత్రసీమకు ఆయువుపట్టు. స్వదేశంలోనూ, విదేశాల్లోనూ విశేషంగా ఖ్యాతి పొందిన పలువురు నటీనటులు, సినిమా కంపెనీలు ఇక్కడ ఉన్నాయి. అందువల్ల తొలిసారిగా జరిగిన 'ప్రభుత్వదాడి' ఫలితంగా ముప్ఫయి లక్షల రూపాయలు దొరకటం చాలా మామూలు విషయం.

కేంద్ర ఆర్థిక మంత్రిత్వ విభాగం జరిపిన ఈ తొలి దాడి విజయవంతమనే చెప్పాలి. కథానాయికలు మాలాసిన్హా, వైజయంతిమాల, బీనారాయ్‌ల ఇళ్ళు; నాయకులు, నటులూ అయిన రాజేంద్రనాథ్, ప్రేమనాథ్‌ల నివాసాలు, సంగీత దర్శకులు శంకర్, రవిల గృహాలూ, నటుడూ, నిర్మాత అయిన రాజ్ కపూర్ కార్యాలయమూ 'సోదా'చేయటం జరిగింది. ఈ భవనాలన్నింటిని "అందుకు సంబంధించిన వ్యక్తుల సమక్షంలోనే ప్రభుత్వోద్యోగులు వెదకటం జరిగింది".

అధికారుల కథనం ప్రకారం, నటి మాలాసిన్హా ఇంట్లో ఇరవై లక్షల రూపాయలు, నాలుగువందల బంగారు నాణెములూ (వీటి వెల 32 వేల రూపాయలట), కొంత బర్మా కరెన్సీ, ట్రాన్సిస్టర్ రేడియోలు, కొన్ని మద్యపు సీసాలు లభించాయట!

మరో చిత్రాతి విచిత్రమైన వార్త : ఈ 20 లక్షల రూపాయల్లో, 12 లక్షల రూపాయలు మాలాసిన్హా ఇంట్లోని 'బాత్‌రూం'లో గుప్తంగా, ఉన్నాయట. అదే ఇంట్లో ఉన్న మరొకరు, ఆ సమయంలో, దాదాపు నాలుగున్నర లక్షల రూపాయలు బయటికి చేరవేస్తుండగా అధికారులు పట్టుకోవడం జరిగిందట. ఆ ఇంట్లోని ప్రతి గోడను, అధికారులు 'యాంత్రికంగా' పరీక్ష చేస్తుండగా' బాత్‌రూములోని 12 లక్షల రూపాయలు బయటపడ్డాయి.

నటి వైజయంతిమాల ఇంట్లో ఒక లక్ష రూపాయిల కరెన్సీ, 350 గ్రాముల బంగారం కొంత విదేశీ ద్రవ్యం దొరికాయట.

రాజ్ కపూర్‌కు చెందిన ఆర్. కె. స్టూడియో, మరికొన్ని ఆవరణలు వెతకగా, కొంత విదేశీ ద్రవ్యం, కొంత ఇండియా కరెన్సీ, విదేశీ కరెన్సీకి సంబంధించిన కొన్ని డాక్యుమెంట్లు దొరికినట్లు అధికారులు చెప్పారు. ఏది ఎంత దొరికిందీ వివరాలు తెలియరాలేదు.

సంగీతదర్శకుడు శంకర్ ఇంట్లో "రెండున్నర లక్షల రూపాయిలు, పదివేల రూపాయల విలువ చేసే నూరు తులాల బంగారం" దొరికాయట.

సంగీత దర్శకుడు రవి ఇంట్లో : "షుమారు ఒకటిన్నర లక్ష రూపాయలు".

నటుడు రాజేంద్రనాద్ ఇంట్లో : "61 వేల రూపాయలు, నాలుగు సీసాల మద్యం".

అంతకు క్రితం అందిన "సమాచారాన్ని" ఆధారం చేసికొనే, అధికారులు పై దాడులను జరిపారట.

శ్రీ ఎస్. జి. సహస్రభోజనె నిర్వహించిన ఈ 'చర్య'లో మద్రాసు, బొంబాయి, ఢిల్లీ నగరాలకు చెందిన పలువురు అధికారులు సాయపడ్డారట.

ధరలు పెరుగుతున్నాయనే ప్రజల ఆందోళనను, ప్రజల దృష్టిని మరలించటానికే ప్రభుత్వం సినిమా తారలమీద "దాడులు" అనే అంశాన్ని ఉపయోగించిందని కమ్యూనిస్టులు నాయకులు శ్రీ డాంగే ఒక బొంబాయి సభలో చెప్పారు.

సినిమా నటీ నటులూ, సంగీత దర్శకులు 'స్వయంప్రతిభ'తో సంపాదించుకున్న 'లెక్కలేని డబ్బు'కూ, పారిశ్రామికులు, స్పెక్యులేటర్లు సంపాదించే 'లెక్కలేని డబ్బు'కూ వ్యత్యాసం ఉన్నదని ఆయనన్నారు.

వర్తకుల 'నల్లధనం' దొంగనిల్వలు, స్పెక్యులేషన్‌లను ప్రోత్సాహిస్తాయనీ, సినిమావాళ్ల దగ్గరుండే 'లెక్కలేని ద్రవ్యం" మహా చేస్తే ప్రభుత్వానికి కొన్ని వేల రూపాయల ఆదాయపు పన్నును నష్టం చేస్తుందని శ్రీ డాంగే అన్నారు.

ఇది ఇలావుండగా ఆంధ్రప్రదేశ్‌లో "నవయుగ" కంపెనీనికూడా పరిశీలించినట్లు వార్తలు వెలువడతున్నాయి. రాజ్ కపూర్ తాజా చిత్రం 'సంగమ్'ను ఆంధ్ర దేశంలో విడుదలచేసిన అంశాన్ని పురస్కరించుకునే 'నవయుగ' కంపెనీనికూడా అధికారులు పరిశీలించినట్లు వార్త.

**తాజావార్త :**

నటి వైజయంతిమాల మద్రాసులోని త్యాగరాయనగర్‌లో ఒకానొక బ్యాంకులో ఉంచిన 'లాకర్'లో మూడువేల రూపాయలు ధనం, "చిన్న గణపతి విగ్రహం" దొరికినట్లు తాజావార్త.

ఒకవైపు ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయంటూ పేదవారు పొట్ట చేతపట్టుకుని దీనంగా విలపిస్తుంటే, మరోవైపు, పేదవారిచ్చిన డబ్బును కూడగట్టుకుని, అదే డబ్బును నిశ్చింతగా బాత్ రూముల్లో దాచుకున్నట్లు కనిపిస్తున్న ఈ సినిమా తారలను, నల్ల ధనపు చక్రవర్తులను ఎలా వర్ణించాలో తెలియటంలేదు. "కాలమే సత్యాన్ని నిరూపిస్తుందన్న" మాట మాత్రం వీళ్ల విషయంలో నిజమేనని తేలింది.

మూడవ ప్రణాళికలోని మూడో సంవత్సరం ముగుస్తున్న సమయంలోనైనా తొలిసారిగా ఇంత చక్కటి చర్య తీసుకున్నందుకు ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. ఎలాగైతే మంచిపనే చేశారు; చేసిందేదో దేశమంతా ఒకేమారు చేసినట్లయితే బాగుండేది. అలా చేయక పోవటమన్నది, మిగిలిన వారందరికి జాగ్రత్తపడటానికి అవకాశం ఇచ్చినట్లే అయింది.

వాశిరాజు ప్రకాశం. ★



రాజ్ కపూర్



మాలాసిన్హా



వైజయంతీమాల

# సినిమా వార్తలు

## "శ్రీకృష్ణ తులాభారం"

సురేష్ ప్రొడక్షన్సువారు తమ ద్వితీయ కానుకగా "శ్రీ కృష్ణతులాభారం" అనే పౌరాణిక చిత్రాన్ని నిర్మించటానికి నిర్ణయించుకున్నారు. ఈ చిత్రంలో ప్రధానపాత్ర శ్రీకృష్ణుడుగా ఎన్. టి. రామారావు వేస్తారని తెలుస్తుంది. స్క్రిప్టు వర్కు సముద్రాల రాఘవాచార్య చేస్తున్నారు. కలర్ ఫిల్ము లభ్యమయితే ఈ చిత్రాన్ని కలర్‌లో నిర్మించాలనే ఉద్దేశ్య మున్నట్లు నిర్మాత శ్రీ డి. రామానాయుడు తెలియ జేశారు. మిగతా నటవర్గాన్ని, సాంకేతిక వర్గాన్ని సెప్టెంబరులో ఎన్నిక జరిపి త్వరలోనే సెట్సు పైదకు వెళ్తారని తెలుస్తుంది. ఈ చిత్రానికి దర్శకుడు—కాపీ చాణక్య.

## అల్లు రామలింగయ్య

హాస్యనటుడు శ్రీ అల్లు రామలింగయ్య హాస్య నటుడుగా ఇప్పటి 14 చిత్రాలకు అగ్రిమెంటు చేశారు. వాటిలో 8 చిత్రాల షూటింగ్ శరవేగం తోను, 6 చిత్రాల షూటింగ్ ఓ మోస్తరు వేగం తోను సాగిపోతున్నవట.

## "దొంగలు-దొరలు"

శ్రీదేవి పిక్చర్సువారు నిర్మిస్తున్న తాజా తెలుగు సాంఘిక చిత్రం "దొంగలు—దొరలు" పూర్తి అయింది. ఈ చిత్రంలో శివాజీగణేశన్, ఎం. ఆర్. రాధా, బాలాజీ, దేవిక, వాసంతి, సంధ్య మొదలగు వారు నటించారు. ఈ చిత్రానికి మాటలు, పాటలు: రాజశ్రీ, సంగీతం: పురుషోత్తం, ఎడిటింగ్: ఎం. ఎస్. బాబు బి. ఏ, నిర్మాత : పార్థసారధిరెడ్డి. ఈ చిత్రం త్వరలోనే ఆంధ్రదేశ మంతటా విడుదల కానున్నది.

## "చ లా కీ పి ల్ల"

పి. సుబ్రహ్మణ్యం సమర్పించు "చలాకీ పిల్ల" తెలుగు సాంఘిక చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో పండరీబాయి, ఎం. ఎస్. రాజం, రాగిణి, ముత్తులక్ష్మి, బేబి ఉమ, వీరప్ప, తంగవేలు, టి. ఆర్. రామచంద్రన్, శ్రీరాం మొదలగువారు నటించారు. హెలెన్ నృత్యం కూడా ఈ చిత్రంలో ఉంది. ఈ చిత్రానికి మాటలు, పాటలు : అనిసెట్టి, సంగీతం : సత్యం, నిర్మాత : పి. సుబ్రహ్మణ్యం, ఈ చిత్రం త్వరలోనే విశాలాంధ్ర అంతటా విడుదల చేస్తారు.

## "దే వ యా ని"

కన్నడంలో నిర్మించిన "కచదేవయాని" చిత్రాన్ని పంచశీలా ప్రొడక్షన్సువారు తెలుగులో "దేవయాని" అను పేరుతో నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో బి. సరోజాదేవి, రేవతి, విద్యావతి, అశ్వద్ధ మొదలగు వారు నటించారు. ఈ చిత్రానికి మాటలు, పాటలు, నిర్మాత : "పాట్నూరి", సంగీతం : చాంద్, దర్శకత్వం : బాలు అండ్ రమణ.

## శ్రీ సింహాచలక్షేత్ర మహిమ

శ్రీ సరస్వతి మూవీస్ అండ్ శ్రీ వెంకటేశ్వర ఫిలింస్ కంపెనీ ప్రయివేట్ లిమిటెడ్‌వారు నిర్మిస్తున్న "శ్రీ సింహాచలక్షేత్ర మహిమ" చిత్రం పూర్తికావచ్చింది. ఈ చిత్రంలో ఇంకా రెండు నృత్యముల చిత్రీకరణ మాత్రం మిగిలిఉంది. ఈ నెలాఖరులోగా మొత్తం చిత్రం పూర్తికాగలదని తెలుస్తుంది.

ఈ చిత్రంలో కాంతారావు, రేలంగి, చలం, రాజనాల, నాగయ్య, వల్లరామమూర్తి, రాజబాబు, కృష్ణకుమారి, గిరిజ, సూర్యకాంతం, ఎల్. విజయలక్ష్మి మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు, పాటలు : రాజశ్రీ, సంగీతం : టి. వి. రాజు, ఛాయ : ఆర్. మధు, కళ: బి. ఎన్. కృష్ణ, నృత్యం : చిన్ని సంపత్, కూర్పు: మార్తాండ, స్టూడియో : విజయా—వాహినీ, కథ : దర్శకత్వం : బి. వి. ప్రసాద్, నిర్మాతలు : ఎన్. డి. కోమలత అండ్ శ్రీ వెంకటేశ్వర ఫిలింస్ కంపెనీ ప్రయివేట్ లిమిటెడ్.

## "ఉయ్యాల-జంపాల"

అనుపమా ఫిలింస్‌వారు నిర్మిస్తున్న తాజా సాంఘిక తెలుగు చిత్రం "ఉయ్యాల—జంపాల" చిత్రం పూర్తికావచ్చింది. ఈ చిత్రంలో ఎక్కువ భాగం ఔట్‌డోర్ షూటింగు ఉంది. ఎక్కువగా వ్యయంచేసి ఔట్‌డోరు షూటింగుకు వెళ్ళినట్లు, వర్షాలు ఆటంకపరుస్తున్నట్లు తెలుస్తుంది. ఔట్‌డోరు షూటింగ్ షెడ్యూలు ఒకసారి జరిగితే చిత్రం పూర్తికాగలదని తెలుస్తుంది.

ఈ చిత్రంలో జగ్గయ్య, కృష్ణకుమారి, ప్రభాకరరెడ్డి, చలం, రమణారెడ్డి, చదలవాడ, కె. వి. ఎస్. శర్మ, వాసంతి, మీనాకుమారి, లక్ష్మీకాంతమ్మ సూర్యకాంతం, మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన: పినిశెట్టి శ్రీరామమూర్తి, సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ : చౌదరి, కళ : తోట, నృత్యం : వెంపటి, స్టూడియో : వీనస్, నిర్మాత, దర్శకుడు : టిలక్.

## ఛాయాచిత్ర "మంచిమనిషి"

ఛాయాచిత్ర వారు ప్రప్రథమంగా సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి "మంచి మనిషి" అని నామకరణం జరిగింది. ఈ చిత్రం పూర్తికావచ్చింది. ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, జమున, జగ్గయ్య, గుమ్మడి, పద్మనాభం, హేమలత, గీతాంజలి, మిక్కిలినేని, గెస్టు ఆర్టిస్టులుగా బాలయ్య, రమణారెడ్డి నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన: పినిశెట్టి శ్రీరామమూర్తి, పాటలు : శ్రీ శ్రీ, దాశరథి, కొసరాజు రాఘవయ్య చౌదరి, సి. నారాయణరెడ్డి, సంగీతం : ఎస్. రాజేశ్వర రావు అండ్ టి. చలపతిరావు, ఛాయ : ఎం. కె. రాజా, కళ : ఎస్. కృష్ణారావు, కూర్పు : సంజీవి, స్టూడియో : విజయా, వాహినీ, దర్శకుడు : కె. ప్రత్యగాత్మ, నిర్మాత : కె. సుబ్బరాజు.

## "షె హ నా య్"

ఎస్. డి. నరంగ్ సమర్పించు "షెహనాయ్" (హిందీ) పూర్తి ఈస్ట్‌మన్ కలర్ చిత్రంలో రాజశ్రీ, బిస్వజిత్, జానీవాకర్, రహిమాన్, నిరూపరాయ్, మొదలగువారు నటించారు. దర్శకత్వం : ఎస్. డి. నరంగ్, సంగీతం : రవి, ముబ్రదా పిక్చర్సువారు త్వరలో ఆంధ్ర దేశమంతటా పూర్ణా పిక్చర్సు వారి ద్వారా విడుదల అయింది.



'హమ్‌దివానే'లో చంద్రశేఖర్, ముంతాజ్.



ఛాయాచిత్ర వారి

# మంచి మనిషి

ప్రొడ్యూసర్
కె. సుబ్బరాజు

డైరెక్టర్
కె. ప్రత్యగాత్మ

మ్యూజిక్:
యస్. రాజేశ్వరరావు
టి. చలపతిరావు

వాణీ రిలీజ్

REVATHI

STUDIO KETMAN

# సినిమా వార్తలు

## "మంగమ్మ శపథం"

డి. వి. ఎస్. ప్రొడక్షన్సువారు "మంగమ్మ శపథం" చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, రేలంగి, జమున, గిరిజ, నల్ల రామమూర్తి మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి మాటలు : సముద్రాల (జూనియర్,) పాటలు : సి. నారాయణరెడ్డి, ఛాయ : రవికాంత్ నిగాయిజ్, దర్శకుడు : బి. విఠలాచార్య, సంగీతం: టి. వి. రాజు, నిర్మాత : డి. వి. ఎస్. రాజు.

## ఆలయఫిలింస్ సాంఘిక చిత్రం

ఆలయ ఫిలింస్‌వారు ప్రప్రథమంగా సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రం అపరాధ పరిశోధకమైనదని తెలుస్తుంది. ఈ చిత్రంలో జగ్గయ్య, చలం, ప్రభాకరరెడ్డి, బాలయ్య, పద్మనాభం, కృష్ణకుమారి, గీతాంజలి, స్వర్ణ మొదలగువారు నటిస్తారని తెలుస్తుంది. ఈ చిత్రానికి రచయితః పినిశెట్టి శ్రీరామమూర్తి, కళ, రాజేంద్రకుమార్, ఛాయ : ఎం. జి. సింగ్, కూర్పు: అంకిరెడ్డి, సంగీతం : అశ్వత్థామ, నిర్మాత : ఎం. కె. రెడ్డి, దర్శకత్వం : కె. హేమాంబరధరరావు.

## జెమినీ తెలుగుచిత్రం

జెమినీవారు నిర్మిస్తున్న తెలుగు చిత్రంలో ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, రేలంగి, రాజనాల, ముక్కామల, సత్యనారాయణ, దేవిక మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి మాటలు : ఆత్రేయ, సంగీతం : విశ్వనాథ రామమూర్తి, దర్శకత్వం : వేదాంతం రాఘవయ్య. ★



శ్రీ ఎం. వి. మెనన్

ప్రెస్ సిండికేట్ లిమిటెడ్ సీనియర్ ఉద్యోగి, వీరు ఇటీవలే స్వర్గస్థులైనందుకు చింతిస్తున్నాం.

# మీకు తెలుసా? చెప్పుకోండి మరి?

## ఏ. జ్ఞానేశ్వరరావు

క్రింద కొన్ని పదాలు ఇవ్వబడినాయి. కాని అవన్నీ అసంపూర్ణమయినవే! అయితే ప్రతిపదం ప్రక్కనా కొన్ని మాటలున్నాయి. ఆ మాటల సహాయంతో మీరా పదాలని (అంటే అక్కడున్న ఖాళీ స్థలాలని) పూర్తి అర్థమిచ్చేటట్లు పూర్తి చేయాలి. మీరు పూర్తి చేసిన అక్షరాలని మాత్రం వరుసగా చేర్చి చదవండి.

1. - - ప్రదేశం — తెలుగు రాష్ట్రము
2. — మాజం — సంఘం
3. - - ము — బొమ్మ
4. - - ము — ఏడురోజులని కలిపి వాడే పదం
5. — క్షము — 15 రోజులని కలిపి వాడే పదం
6. — నేత్రుడు — శివుని మరోపేరు
7. — వి — రచయిత
8. - - ము — "లెసన్" (Lesson) అంటారు ఇంగ్లీషులో
9. — రూపి — అందవిహీనులనే పదం
10. — క్ష్మి — డబ్బు! డబ్బు!! డబ్బు!!!
11. — క్క — విశ్వాసముగల జంతువంటారుగా
12. — గు — పాములలోని ఒక పెద్దరకం ఇది
13. — ద్య — చదువు
14. - - - త్వం — "అధ్యక్షత" అని అనవచ్చు
15. — దరంగం — రాజులూ గొప్ప గొప్ప వాళ్లు ఆడే ఆట
16. — వేకము — తెలివి
17. — రుపతి — ఒక పుణ్యక్షేత్రం
18. - - నయము — నటన
19. - - లు — నూర్లు
20. - - సు — గాలివస్తే కంటిలోపడే చెత్త

### జవాబులు

1. ఆంధ్ర 2. స 3. చిత్ర 4. వార 5. ప 6. త్రి 7. క 8. పాఠ 9. కు 10. ల 11. కు

12. నా 13. వి 14. నాయక 15. చ 16. వి 17. తి 18. అభి 19. వంద 20. నలు

## భరణీవారి "వివాహబంధం"

భరణీవారు బెంగాలీలో బాక్సాఫీసు చిత్రం "పి పి కే బాంధా" ఆధారంగా "వివాహబంధం" అను పేరుతో తెలుగులో చిత్రాన్ని నిర్మించి విడుదల చేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, భానుమతి, నాగయ్య, సూర్యకాంతం, బాలయ్య, హరనాథ్, ప్రభాకరరెడ్డి'

## సినిమా వార్తలు

పద్మనాభం, వాసంతి, హేమలత మొదలగువారు నటించారు. ఈ చిత్రానికి మాటలు : పినిశెట్టి శ్రీరామమూర్తి రావు, పాటలు : సి. నారాయణరెడ్డి, సంగీతం : ఎం. బి. శ్రీనివాస్, సంగీత పర్యవేక్షణ : శ్రీమతి పి. భానుమతి, ఛాయ : అన్నయ్య, కళ : రాజేంద్ర కుమార్, నిర్మాత : దర్శకుడు : . రామకృష్ణ.

## పద్మశ్రీ "ప్రేమించిచూడు"

పద్మశ్రీ బేనర్ క్రింద దర్శకుడు పి. పుల్లయ్య "ప్రేమించి చూడు" అనే హాస్యరస చిత్రం నిర్మించడానికి పూనుకున్నారు. ఈ చిత్రానికి మాటలు : ముళ్ళపూడి వెంకటరమణ, నిర్మాత : వి. వెంకటేశ్వర్లు, దర్శకుడు : పి. పుల్లయ్య

—సి. ధర్మారావు. ★




Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

